హంలో యిప్పటికే యెన్నేళ్ళో వృథా చేశా యింక కాలవ్యయం చెయ్యను—శోక మృత్యుజరాభూయిష్ఠమైన యీ మహాసంసారసాగరాన్ని చీల్చి నీకానంద నవనీతాన్నందిస్తాను భయపడకు దేవీ!

భూ: (నిట్టూర్చి) అమ్మయ్య! అమృతంకన్నా చల్లని నీ అభయవచనంతో నా దుఃఖం తీరినట్లయింది యీ దీనురాల్ని విస్మరించకు ప్రభూ! చంద్రుని కోసం చకోరిలా మీ కోసం నిరీక్షిస్తూ వుంటాను నిత్యోపన్నురాలికతె మీరాక కెదురు చూస్తూ వుంటుందన్న కారుణ్యం యీ విశాల హృదయంలో యేమూలనున్నా చాలును ప్రభూ, చా

(భూదేవి వెళ్ళిపోతుంది)

గౌత (జాలిగా) వెళ్ళిపోయిందీ ప్రావృట్కాలనీలాంబుధరం వలె కన్నులవిందైన దేవి సస్యశ్యామలయై దీనంగా యెలా తేలిపోతూ వుందో! (నిట్టూర్చి) ముందీ రాజభవనాల్లోనించి బయట పడితేగాని గాలి పీల్చుకోలేను—సాలీడుగూళ్ళలా నా చుట్టూ సంసారబంధనా లెలా అల్లుకున్నాయో! యివి తెంచకుండా యెంత గట్టిగా వున్నాయ్! అనురాగాలూ, యీ భోగాలూ, ఆనందాలూ, అనుభవాలూ అన్నీ సంకెళ్ళై నన్ను కాలు కదల్నిచ్చట్టు లేదే! ఎలా వెళ్ళగలను?

రాజ్యలక్ష్మి (ప్రవేశిస్తూ) ఎక్కడికి యువరాజా?

గౌత ఎవరమ్మా నువ్వు? నిన్ను చూస్తూ వుంటే మాతల్లి గౌతమీదేవిలా నీపాదాలకు ప్రణమిల్లాలనిపిస్తూవుంది ఎవరు తల్లీ నువ్వు?

రాజ్య నేను మీరాజ్యలక్ష్మి న్నాయనా! నేటివరకూ నీపూర్వులు శాక్యరాజులు వారి భుజస్కంధాలమీదగా చిక్కని ముత్యాల గొడుగు నీడల్లో నీ జనకుని దాకా నడిపించుకొచ్చారు యిహపరాలు రెండూ సాధించుకున్నారు. నీ తండ్రిగారు వయోభారానికి తోడు నిత్యప్రవృద్ధమైన రాజ్యభారాన్ని కూడా భరించలేకుండా వున్నారు. వారిని వానప్రస్థం పిలుస్తూవుంది యిక నువ్వాయనకు విశ్రాంతి నివ్వాలి బలయౌవన సంపన్నమైన నీ భుజపీఠాన నన్ను ప్రతిష్ఠించు!—

గౌత లేదు తల్లీ లేదు! యీ బంగారు పంజరంలో నన్ను బంధించుకోలేను. రాచరికపు తొడుగునించి తెలివికోసం నా ఆత్మ తహతహలాడుతూ వుంది

రాజ్య (ఆశ్చర్యంగా) ఏమంటున్నావ్? (అనునయిస్తూ) నువ్వు చేసేదేమిటో నీకే తెలియడం లేదు ధర్మాన్ని త్యజిస్తానంటున్నావ్ పిచ్చి తండ్రీ! రాజ్యబంధం ఐచ్ఛికం కాదు నాయనా! అనుపూర్వికమైన మహోత్తర విధినిర్వహణం! అమాయకుడా! యీపూలతోట నీకు ముళ్ళతోటయిందా? యిది కాదని నిరాకరించి యింతకన్నా నువ్వు సాధించే దేమిటి?

గౌత ప్రపంచ కళ్యాణం తల్లీ

రాజ్య (వెక్కిరింపుగా) ఏమిటయ్యా ఆ ప్రపంచ కళ్యాణం! దొంగలా అర్ధరాత్రి గృహత్యాగం చెయ్యడమేనా? క్షత్రియుడా! మనువు మొదలు నీ వరకూ వచ్చిన రాజమార్గంలో ముళ్ళ కంచెలు వేస్తున్నావా?—ధర్మాన్ని నిలిపి—దేశాన్ని సుభిక్షంగా—ప్రజల్ని కన్నతండ్రిలా పాలిస్తూ, శాంతిజ్ఞానదీపికలు వెలిగించి వన్నెగాంచిస్తూ నీ స్వర్గాలు పండించుకోరాదటయ్యా! నీ ప్రపంచాన్ని నేను కానా? యింతకన్నా క్షత్రియ జీవితపరమావధేమున్నది?

గౌత వున్నదమ్మా! వున్నది ప్రపంచమంటే ఒక్క యీ కపిలవస్తు నగరమే నా తల్లీ?—కాదు వొక్కసారి నీ చూపు త్రిప్పిచూడమ్మా! ఆధ్యాత్మికంగా లోకం యెంత దిగజారిపోతూవుందో! ప్రజల్ని పాలించే రాజుకాదిప్పుడు కావలసింది వారి ఆత్మల్ని పాలించే ఆచార్యుడు కావాలి దుఃఖాంధకారాన్నించీ అవిద్యాగర్తాలు దాటిస్తూ అహింసాజ్యోతితో శాంతిమార్గాన్నడిపే మార్గదర్శి కావాలి! అందుకే నన్నీ బంధనాల్నించి విముక్తుణ్ణి చెయ్యి తల్లీ! అంతఃపురాల్లో లభ్యంకాదా ఆత్మసాక్షాత్కారం నా తపస్సు పండితే మొదట నీ సేవకే వస్తానమ్మా!

రాజ్య నవనీతసుకుమారమైన యీ తనువూ తారుణ్యం, రాజసుఖాల కలవాటుపడ్డ యీ ప్రాణం నీకు వశమై నీ కఠోరనిష్ఠ కనుకూలిస్తాయా అని— అయ్యోపాపం! నీమీద ప్రాణాలుపెట్టుకున్న ఆ

వృద్ధభూపతి పాద్లేం కామన్నారయా! నీ కోసం ఎదురుచూస్తున్న కీర్తి, ప్రాభవం, జయశ్రీ—అన్నీ వృథా! వృథా!!

గౌత తల్లీ! నీకు నమస్కారం నన్ను ప్రలోభపెట్టకు నాలో రగిలిన యీ మహోత్కృష్ట మందాకినీసందర్శనంతో కాక యింతా అంతా తీరేది కాదు నన్ను పోనియ్ నా ఆత్మకు బలం విశ్వాసం ప్రసాదించు అదిగో భూదేవిపిలుపులు వినిపిస్తున్నాయ్ మా కులపతులైన శాక్యరాజులవలె నిన్ను సేవించలేని నా దుర్బలత్వాన్ని క్షమించి నన్ను దీవించిపంపు తల్లీ!

రాజ్య శుభం తండ్రీ శుభం! నీ సాధనలో నీకు జయం కలుగుతుంది పోయిరా నాయనా! ప్రపంచాన్నంతా పునీతంచేసి దివ్యజ్ఞానిని ప్రమదా వనంలో క్రీడాసరస్సుకు మలపాలముకున్నా—తెలుసుకున్నా—లోకసంగ్రహణార్థం అవతరించిన మహామూర్తివి నువ్వు! జరామరణవికలమై హింసాశోక వ్యాకులమైన ప్రపంచాన్ని త్వరగా వుద్ధరించు ప్రభూ! యిక నాకు సెలవు (వెళ్లిపోతుంది)

గౌత కన్నతల్లి దీవనల్లా రాజ్యలక్ష్మీపలుకులు నాలో వినూత్నశక్తి ఉద్దీపింప చేస్తున్నాయ్

(దూరాన్నుంచి గజ్జెల ఘల్ ఘలలు మువ్వల మోతలూ వినిపిస్తాయి)

గౌత (ఆలోచిస్తూ) యిక్కడిదీ కరకంకణ ధ్వనులతో చరణమంజీర ఘలంఘలలు! సరి క్రొత్త మవ్వంలాగా యెంత మధురంగా మత్తెక్కిస్తూ వున్నవి! అంతఃపురానికి యశోధర విచ్చేసిన ఆ తియ్యని రోజుల్ని గుర్తుకు తెస్తున్నాయీ ధ్వనులు—ఎవరక్కడ?

యౌవనశ్రీ నేనే శీలోవున్న యవ్వనశ్రీని. నా సంభాషణంతా విన్నా యిక్కడికి అంతెరుగని ప్రయాణం—యెందు కింత వైరాగ్యం? యేమి టలా కృశించి తపించి సాధించేది? అందు క్కాకలసిన వయసు ముందున్నది యిప్పట్నించీ యీ తపన దేనికోయ్! వెన్నెల్లో నిల్చి చీకట్లని పిలిచే వెర్రివాడి వవుతున్నావే! యీ యౌవనం కాస్తా జారితే—మధువొలికిన పాత్రెవరి కెక్కాలి? పూలు పూచే యీ వయస్సులో యేమిటీ మొగ్గైరాలడం? యీ జన్మ, యీ సౌందర్యం, యీ యవ్వనం, యే మహాక్షేత్ర తపస్సు చేస్తే లభించాయో వూహించావా? యీ దైవప్రసాదాల్ని భగ్నం చెయ్యడానికి నీకేం అధికారం వుంది? వసంతాన్ని శిశిరంగా మారుస్తావా? యెవరు నీకీ దుర్మార్గాన్ని ఉపదేశించింది? అనుభవహీనమైన జీవితం అడివిలో పువ్వులా రాలిపోతుంది ఓయ్ విపరీతబుద్ధీ! ప్రత్యక్ష చంద్రికను పరిత్యజించి కనబడని కాంతులకోసం పరిగెత్తి పడతావంటున్నావ్! నా మాట విను హాయిగా సుఖించు

గౌత (కఠినంగా) ఆగు! యిక నీ ఊహాగానం నిలుపు! క్షణికమైన యవ్వనానికిన్ని రంగులు పులిమి యింద్రధనుసు చేసి చూపిస్తున్నావ్ యెంతసేపు దీని వైభవం? చాల్ చాలు నీ ఆనందపు లోతు తెల్సిపోయింది. నన్నిక యిబ్బంది పెట్టకు కాదనలేని తావు యీ దారిలో రెండుమాపులు! పృథ్వి పొత్తుముంబవాలు—నన్నిక శ్రమపెట్టకేవు పో పో!

యవ్వ ఓరి మూర్ఖుడా! విప్పి చెప్పినా తెలుసుకోలేకపోతున్నావే పోనీ కాని, యీ గడిచినంతకాలం నిన్నే నమ్మి నీతో తన విశ్వాసాన్ని భద్రపరుచుకున్న చరణదాసి హృదయరాజ్ఞి యశోధరకన్నా యీ జన్మలో నీకు లభ్యమయ్యే పరమార్థమేముందిరా? నువ్వింత విశ్వాసఘాతుకుడవనుకున్నదా ఆ అమాయకురాలు? అప్పుడే మరిచిపోయావా వకజాము క్రితం యశోధర యేమన్నదీ—గుర్తు తెచ్చుకో—

(—లోపల్నించి వినిపిస్తున్నట్లు—)

యశో ప్రభూ! యీ చరణదాసిని అన్యాయం చేయకండి యీ హృదయానికి దీప్తి మీరూ, యీ కన్నులకు వెన్నెల రాజులుదూ—

గౌత (వుద్వేగంతో) అయ్యో దేవీ! నీ కన్యాయం చేస్తున్నానా?—అదిగో (వింటూ వున్నట్టు) మళ్లీ యెవరిదా ఆక్రందనం—

(మళ్లీ లోపల్నించీ వినిపిస్తున్నట్టు—)

భూదేవి యీ దీనురాల్ని విస్మరించకండి ప్రభూ! చంద్రుని కోసం చకోరిలా నిరీక్షిస్తూ వుంటా—

గౌత (దృఢస్వరంతో) వస్తున్నా భూదేవీ! వస్తున్నా (కోపంగా) ఓసి యవ్వనశ్రీ! నీ దుష్టతంత్రా

లీల చాలించు గౌతము డంత చంచలుడు కాడు లే పో!!

యువ్వ నోరి అవివేకీ! శడపాతిగా నాలు గున్నావిను యీ కొమయంలో నువ్వు సాధించే దేముందోయ్? తల బోడైతే తలపులు బోడవు తాయా? మాడు, వృథ యత్నము డవు కాకు, కొదంటావా నీకర్మ పోనీ యీవిశ్వయూ స్నేయితో నరతో చెప్పి పో అని మంచిమార్గం—చూపరా, అటు మాడు—

అదిగో నీప్రణయాధిదేవత సతి
 స్వప్నానంద సందీప్తిము
ద్వదనాంతమ్ముల హాసరేఖల
 యాహ్వానించునో విన్నవే – ఓ
రి దయాహీనా! చూడు మేడొక
 రహః క్రీడాసదూలోచనా
భ్యుదితప్రేమ కలనంబో సంజపు బ
 ల్లాయున్ చెక్కుటద్దాలపై
 చూడు చూడు—
ముద్దుల మూటగట్టు నలు మోమున
 తల్లిపయంట క్రోయమున్
సగ్గుదొరంగి రొమ్ముడకు చల్లని
 చేతులు సాచుచున్న నీ
ఏద్దపుప్రేమ, శాశ్వతుల నీల
 నభశ్శిరేఖ అచ్చువం
ప్రుద్దినయట్టి నీకు ప్రతిరూపము
 బిడ్డనిచంక మాడరా!

నీ వంటి విరసపాషాణ మూర్తులతో వాదు పని లేదు లే—(గట్టిగ గలగలలతో వెళ్ళిపోతుంది)

గౌత (నిట్టూర్చి) అబ్బ! యిప్పటికి అవాంతరాలు తీరినట్లే వారిధికి సేతువు కట్టినట్లయింది వాభ్రమలే నన్నింతగా పుటం పెట్టి పరిశుద్ధుణ్ణి చేశాయ్ (తల్పంనించి లేస్తాడు వక్కాసాగా శాఖలు ప్రోగి నిల్చిపోతాయి)

## 3

"ఓహో దేవతల్లారా!"

దేవ అదిగో అశరీరవాణి యేమో చెబుతూన్నది వినండి వినండి

అశరీరవాణి (ఆనందంతో) ఓహో దేవతల్లారా! స్వామి లేచారు విశ్వకళ్యాణంకోసం స్వామి బయల్దేరారు ఓ నిద్రాధిదేవతా! నీ వెచ్చని కౌగిళ్లలో అంతఃపురాన్ని కోకొట్టి నిద్రపుచ్చాలి. స్వామి నిర్గమించేవరకూ యే ప్రాణీ మేలుకోరాదు ఓహోయ్ విశ్వబద్ధదేవతల్లారా! స్వామి మార్గాన్నంతా బాగాలుతీరి నిలవండి విఘ్నరాక్షసులు పొంచుండి మీ ప్రయత్నాలు భగ్నం చేస్తారేమో చూస్తారు జాగ్రత్త! మీ సన్నని నిట్టూర్పుగాలులతో నిశ్శబ్దంగా అంతఃపురద్వారాలన్నీ తెరిచివుంచండి అదిగో స్వామి బయలుదేరుతున్నారు ముందట మీ వీలికిరణపాళాల్లో మార్గమంతా సమ్మార్జనంచేసి నిరటంకం చెయ్యండి వింటున్నారా? స్వామి రత్నపాదుకల ధ్వనులు కూడా వినిపించకుండా పువ్వులకన్నా మెత్తని మీ అరచేతుల్ని నారిపాడుగునా అరుణాంబుజ మాలికల్లాగా పరచండి స్వామి మీ పాణిపల్లవాలమీదుగా నడిచిరావాలి ఓ అశ్వశక్తి దేవతల్లారా! జగత్కళ్యాణంకోసం స్వామి బయల్దేరి వస్తున్నారు చెన్నుని మేల్కొలపండి! కంటకాశ్వాన్ని సుసజ్జితం చేసి సౌధద్వారంవద్ద నిలిపించండి ఓ వాయుదేవతల్లారా! స్వామి నిష్క్రమించేవరకూ మీలోవున్న శబ్దప్రసారగుణాన్ని స్తంభించుకోండి యీ నగరసీమ లతిక్రమించేవరకూ యే ప్రాణీకూడా అశ్వఖురన్యాసరవళి వినకూడదు! నక్షత్రాల్లారా! స్వామిమార్గానుకూలంగా మీ వెలుగులు పట్టండి (ప్రశాన్తంగా) వచ్చేశారు స్వామి వచ్చేశారు వచ్చేశారు—

వేయి యామినులొక్కరేయి తోచినయట్లు
 తియ్యనితావులు తెరలివచ్చి,
కోటిచంద్రులొక్కచోట వెలిగినయట్లు
 విరిసిన కాంతుల వల్లివచ్చి,
క్షితికుస్వనములొక్క క్రుతిని మ్రోగినయట్లు
 అడుగు సవ్వడులల్లనల్ల వచ్చి,
సకలభాగ్యములొక్కసారి కూడినయట్లు
 చిరకాంక్షిత స్వప్నసిద్ధివచ్చి
వచ్చివచ్చి విపన్న జగచ్ఛ్రయంబు
అడుగో వరదాభయ హస్తముద్ర
స్వామిగా నెట్టయెదుట సాక్షాత్కరించె
శాశ్వతంత పయోరాశి చంద్రవంక

అశరీర ముక్కోటి దేవతల ఆనందాశ్రువులతో పాటు పరిమళ పారిజాత మందార మకరందబిందు

పూలు జల్లుజల్లుగా పడుతూ వున్నాయి. ఆ పూల వానలో స్వామి అశ్వాన్నధిరోహించి చాల సత్వరంగా గాలిలో లేచి మబ్బుల్లో తేలిపోతున్నారు. నగరప్రాకారాలపైనించి రెండోసారి గుర్రాన్ని ముందుగా ఆకాశంలో కెన్నడు కూడా నడిచిపోతున్నాడు. నిష్క్రమించాడు స్వామి నిష్క్రమించాడు—

“అతి సుహాసయ మోహన ముఖారవింద లుణ్
సడి చుట్టి గొలు ని

స్వామి పవిత్రతేజ మవికల్పక
శాంతిసమాధి నిష్ఠ హిం
సామలిన ప్రవిష్ట, లిహ సంగుణం
ధమ్మ పదమ్ము వట్టి స్వ
ర్నిమను రాత్ములై భువి
తరింప సత్వర మ్ముద్ధరించుతన్!”

నమో తస్స భగవతో అరహతో సమ్మాసం
బుద్ధస్స—

---

# నా ప్రభూ! ★ శ్రీ బెళ్లూరి శ్రీనివాసమూర్తి

నందు మనోజ్ఞహార్మ్యసుఖ వాసన లెవ్వియు—జీవితంబులో
తలపునలేని సౌఖ్యములు—త్వత్కరుణామృత వాహినీ సము
జ్జ్వల మధురాంబుపానములు వల్కెదు చిన్నకుటీరసీమ, నీ
చెలిమికి నాదు ప్రాణములు సిద్ధముచేసితిరమ్మ నా ప్రభూ!

ప్రేమయొకండె నిన్ను వలపించెడు వస్తువటంచు నాదు హృ
త్సీమకు తోచిపోయినది, తియ్యని నాయనుభూతి నొల్లి నీ
ప్రేమకు ధారవోసితిని రెక్కలువిచ్చిన ఆశగాగ నా
ధామము చెంత వ్రాలుదు గదా క్షణ మాత్రములోన నా ప్రభూ!

అల్లన కంఠమెత్తి ప్రియమారగ పిల్చిన, నా స్వరంబులో
పల్లవితంబుగా మృదుల భావనలన్నియు గుప్పవట్టనా
యుల్లనివత్తు వియ్యోవకు నెన్యోడకున్ జనవింక, నేను పూ
వల్లరి నీవు వృక్షమవు ప్రాకెద నిమదిమొల్ల నా ప్రభూ!

ఎన్నడు నీవు లేవో భువి నెందును నేనును లేనుగాన, న
కున్న సమస్త మీవొకడవో యను వైష్ణవి నాదిగాన, నీ
చిన్నెలులేని నా బ్రదుకు చేదయి తోచునుగాన, నన్ను నీ
కన్నుల కౌగిలింతకడ గానొనరించగదమ్మ నా ప్రభూ!

నీ వొక బాటసారివయి నిల్తువు నా గృహసీమచెంత సం
ధ్యావిపులాంధకారముల నక్కట—ఆకలి దప్పి దీర్చి నీ
శ్రోవకు చల్దిగట్టి పరితోషమునన్ పయనింపజేతు మ
ద్భావపరిమళంబు దనుకన్ తొలివెల్గులలోన నా ప్రభూ!

---

# స్థాయిభావములు



శ్రీ పోతుకూచి సుబ్రహ్మణ్యశాస్త్రి

శృంగారము మొదలుగాగల రసము లెనిమిది గలవు. ఈ రసములకు రతి, హాసము, శోకము, క్రోధము, ఉత్సాహము, భయము, జుగుప్స, విస్మయము అను ఎనిమిది స్థాయిభావము లగుచున్నవి. కాని స్థాయిభావమును నిర్వచింప వలసియున్నది.

ఎక్కువ ఆలోచన లేకుండా, బుద్ధిని వినియోగించకుండా, మన మనేక పనులను చేయుచున్నాము. ఇట్టి కృత్యముల నందరును దాదాపు ఏకరీతిగా చేయుట గలదు. పరిస్థితులు మారినను వీటిలో చెప్పదగినంత మార్పు కల్పించదు. అనుకరణగాని, అనుభవముద్వారా తెలిసికొని చేయుటగాని వీటిలో కల్పించదు. ఇట్టి కృత్యముల నాంగ్లమున "ఇన్‌స్టింక్టివ్ బిహేవియర్" (Instinctive behaviour) అందురు. ఈ విధమగు ప్రవృత్తి ప్రతివ్యక్తిలోగల స్థాయిభావముల నాశ్రయించుకొని వచ్చునది. పరిసరములతో సమన్వయపరచుకొనుచు పోవు ప్రాణుల ప్రవృత్తిని స్థాయిభావ ప్రవృత్తి యందురు. ప్రాణరక్షణకు, వంశవృద్ధికి తోడ్పడ మొదలగు నీ స్థాయిభావములు ప్రతివ్యక్తియొక్క మానసములోని అంగములని యొక వాదము గలదు. కాని భావోద్రేకముగాని, జ్ఞానముగాని లేని స్థాయిభావప్రవృత్తి కేవల యంత్రపరంపరలోని దగుచు ఒకే ఒక స్థాయిభావప్రవృత్తిలో వివిధావయవములేల వ్యాపృతము లగుచున్నవో, ఈ వాదము చెప్పలేకున్నది. ఈ స్థాయిభావప్రవృత్తి జ్ఞానహీనమై, ప్రసిద్ధమైనచో సమర్థవను దీనిని మార్పజాలదు. కాని అనుభవ మెక్కువైన కొలది ఈ ప్రవృత్తిలో మార్పులు కల్పించుచున్నవి.

స్థాయిభావవృత్తికి మనస్సునకుగల సంబంధము వివేచనీయము. అనుభవమున, ప్రవృత్తిలోను, మనస్సు కొన్ని సన్నివేశముల నభివ్యక్తపరచుచున్నది. ఈ సన్నివేశములు సామాన్యముగా నొక తీరున కల్పించుటచే తద్ద్వారా అంతరంగికమగు మనస్సుయొక్క స్వరూపస్వభావములు మన కవగతము లగుచున్నవి. మనస్సు విశ్రమించియున్న వేళలో గూడ నీ స్వరూపస్వభావములు స్థావరముగా నిలచి అభివృద్ధి నందుచున్నవి. కాగా మనస్సు వివిధభాగములతో సంవలితమై, ఆ అంగములతో సమన్వయము కలిగియున్న దనవచ్చును. ప్రతి భాగము తన కృత్యమును తాను నిర్వర్తించుటయేగాక, ఇతర భాగములతో సన్నిహిత సంబంధము కలిగియున్నది. తద్ద్వారా ఇతర భాగములలో దీనివలన మార్పులు రాగలవు. ఈ భాగములే స్థాయిభావములు. స్థాయిభావములకంటె విలక్షణమైన మనస్సు లేదని చెప్పవచ్చును. ప్రవృత్తి నిర్దేశించు అంతరంగికములగు స్థాయిభావములు మనస్సుయొక్క వివిధపరిణామములు. మానవప్రవృత్తి కందుచే నివి హేతుభూతము లగుచున్నవి.

స్థాయిభావనిర్దిష్టమగు ప్రవృత్తి ప్రయోజన సహితమైనది. ఒక వస్తువు నుద్దేశించగల భావన ఉద్దిష్టవస్తువును తెలిసికొనగల జ్ఞానము అనునవి రెండును లేనిచో ప్రయోజనము నెరవేరజాలదు. ప్రవృత్తి స్వాభావికమై, అయత్నసిద్ధమై, ఉద్దిష్టార్థ విషయప్రాప్తివరకు నుండును. విషయప్రాప్తికి అంతరాయములు వాటిల్లినచో ప్రవృత్తిలో భేదములు బయలుదేరును. అప్పుడు దృష్టవిషయము నెరవేర్చుచున్నది. అనగా ప్రవృత్తిలో నొక అవగాహనము మాత్రమే కద లుటగాక, జ్ఞానకార్యాత్మకరూపమగు త్రివిధాంతము వ్యాపృతములగుటకలుగు శరీరసంవలితమైన మనస్సు ప్రవృత్తిలో ప్రవేశించుటచే స్థాయిభావ ప్రవృత్తిలో జ్ఞానముండదనుమాటను తృణీకరింపవలెను.

మనస్సుయొక్క స్వరూప విన్యాసమున స్థావరముగా నుండునవి స్థాయిభావములు. వీటికి ప్రాణమున్నంతవరకు నీస్థాయిభావము లుండగలవు. ప్రతి స్థాయిభావములోను జ్ఞానాంశ, ప్రవృత్త్యంశ అను రెండంశములుగలవు. వీటిద్వారా స్థాయిభావములోని శక్తి

స్వేచ్ఛను పొంది సక్రమమార్గమును పొందుచున్నది అనగా స్థాయిభావముల కన్నిటికి మూలభూతమగు జ్ఞానాకార శక్తినుండి బలముచేకూరుచున్నది ఈ మూలరాశినుండి కొన్ని స్థాయిభావము లెక్కువశక్తిని గ్రహింపవచ్చును మరికొన్ని తక్కువ గ్రహింపవచ్చును కాని ఈ శక్తి ప్రాణియొక్క చైతన్యము కంటె విలక్షణమైనది కాదు చైతన్యము సాపేక్షకమై విషయసంకలిత మగునపుడు స్థాయిభావములను రూపములగ్వారా ఆవిర్భూతమగునని భావము ఉద్దిష్టవిషయము కనబడినపుడు అనుభవించు వ్యక్తికి ప్రమేయముతోనే అన్యతర్వసంబంధముకలుగుచున్నది అనగా ప్రవృత్తి ఉభయాభినివిష్టమై ఉత్పన్నమగుచున్నది కేవలము విషయమునుండిగాని, కేవలము ప్రమాతనుండిగాని, ప్రవృత్తిరాజాలదు ఈ ప్రవృత్తిలో క్రియానందము లవినాభావసంబంధము కలిగియున్నవి

వ్యక్తులందరి స్థాయిభావ ప్రవృత్తులు ఒకే ఒక రీతిగా నుండవు వంశక్రమానుగతమగు సన్నివేశములు, అనుభవములు మొదలగునవి స్థాయిభావ ప్రవృత్తులలో విపరీతమైన మార్పులను తీసికొని రాగలవు ఈ మార్పులను గమనించితో వీనిలో స్థాయిభావములే కల్పించుటలేదని గూడ చెప్ప సాహసింపవచ్చును అభిరుచి, జాగ్రత్త, పరిశీలన, ప్రవృత్తిలో మార్పు, అభ్యాసజనితమగు జ్ఞానము మొదలగునవి ప్రవృత్తులలో కల్పించుటచే స్థాయిభావము జ్ఞానసంకలితమని చెప్పవలయును

ప్రతివ్యక్తి ఉపయోగించగల మానసిక శక్తి స్థాయిభావ ప్రవృత్తిలో కల్పించును పరిశీలన, జాగ్రత్త మొదలగువానితో కూడియున్న దీశక్తి కాగా కొన్ని ఇంద్రియములు కొన్ని విశిష్టవిషయములయందే వ్యాపృతములు కాగలవు నిరీక్షణ, పరిశీలన, అన్వేషణ మొదలగు నవీ వ్యాపారములో కల్పించును వీటి అన్నిటియందును క్రియాశక్తి అనుస్యూతముగా గలదు ఈ క్రియాశక్తిద్వారా ఉద్దిష్టార్థ ప్రాప్తి జరుగగా స్థాయి భావము సంతృప్తినందుచున్నది దీనికి అంతరాయములు కల్గినచో ప్రవృత్తిలోగాని, సన్నివేశములలోగాని, మార్పులు తీసికొని రాబడుచున్నవి అనగా ప్రతిస్థాయిభావమునందు జ్ఞానాంశ కలదని భావము జ్ఞానసంకలితమగుటచే స్థాయిభావప్రవృత్తి వివేకముతో మెలగుచు వైశిష్ట్యము వహింపగల్గుచున్నది ఈ జ్ఞానసంకలితత్వము ప్రథమప్రవృత్తిలో సహితము కల్పించుచున్నదని పరిశీలకులనుచున్నారు ప్రయోజనము జ్ఞానాధీనమగుటచే, ప్రవృత్తిప్రయోజనాన్వితమని చెప్పినచో మొదటి ప్రవృత్తిలో సహితము జ్ఞానము కలదని చెప్పవలె యగుచున్నది

క్రిమికీటకములయందు, పసుపక్షులయందుగల స్థాయిభావము ఉద్దీపన విభావముచే జ్ఞానరహితముగా ప్రవృత్తములగుచున్నట్లు కల్పించుచున్నవి అట్టి ప్రవృత్తులు మానవదశయందు చాల కొద్దిగా నున్నవి కొరుకుట, దప్పట్లు చరచుట, నోటి వద్దకాహారమును తీసికొనిపోవుట, ప్రాకులాడుట, ధ్వనులను చేయుట, అరచుట, నవ్వుట, కోపగించుట మొదలగునవి మాత్రమే ఇట్టివి వీటిలో ఆలోచనగాని, జ్ఞానముగాని గోచరించుటలేదు. కాని మానవస్థితియందు మానసిక ప్రవృత్తులే అతి ముఖ్యములైనవి ఈ ప్రవృత్తులలో అభిరుచి, యత్నము, నిరీక్షణ, అన్వేషణ, కార్యసాధన మొదలుగాగల జ్ఞానాకారమే గోచరించును

స్థాయిభావమున బాహ్యవిషయ సందర్శనచే యత్కించిచ్చలనము కలిగిన తద్వారాచే ప్రవృత్తి ఉత్పన్నమగును ఈ కదలిక రాగానే స్తబ్ధముగా నున్న స్థాయిభావము పైకి ఉబుకును ప్రతి స్థాయిభావమున విశిష్టమగు సంచారిభావ మొకటి యుండును ఈ సంచారిభావము సంచలితమైనచో స్థాయిభావము ప్రవృత్తిమార్గమునకు దిగును కాగా ప్రవృత్తికి సద్యఃకారణము సంచారిభావమని తెలియవలెను స్థాయి సంచారి భావములు రెండును సదా జ్ఞానసంకలితములై యుండును భయము, ఉత్సాహము, జుగుప్స యను నవి స్థాయిభావములు కావచ్చును, లేదా సంచారి భావములు కావచ్చును స్థాయి సంచారిభావములు విలక్షణములు కావని, సంచారి భావరహితమైన స్థాయిభావము లేదని వీటివలన సిద్ధమగుచున్నది సంచారిభావము ద్వారా ప్రవృత్తియొక్క స్వరూప స్వభావములు మన కవగతము లగుచున్నవి కావుననే ధర్మ్యాది శబ్దములు సందర్భానుసారముగా స్థాయి వ్యభిచార్యాది నామకము లగుచున్నవని అభినవగుప్తు డనినాడు. అంతరంగికము అగు సుఖదుఃఖ

స్వభావములే స్థాయిభావములని శంకుకుడు సహితము వచించెను

ప్రతి స్థాయిభావ ప్రవృత్తియందు విషయజ్ఞాన మున్నది ప్రస్తుత సన్నివేశమును మార్పును తీసికొని వచ్చి ఉద్దిష్ట విషయమును పొందవలెనను యత్నము స్వాభావికముగా నిచట కలదు విషయజ్ఞానము సంచారిభావమును మేల్కొలిపి ప్రయత్నమునకు దారితీయుచున్నది ఇట్లు అంతరంగిక చైతన్య మీ ప్రవృత్తుల ద్వారా బహిర్గతమై వ్యక్తమగుచున్నది. అనగా స్థాయిభావములను సంవిద్రూపములుగా చెప్ప వచ్చును కావుననే స్థాయి యను చిత్తవృత్తి మాత్ర మున పొడుగబడి మార్పుచెందని సంచారిభావములని అభినవు డనినాడు. స్థాయిరహితముగా సంచారిభావ ముద్భవంతము కాదు శ్రమ యను భావ మనేక కారణములద్వారా గలదు ఈ శ్రమయొక్క స్వరూప స్వభావములు తన్మూలభూతమగు స్థాయిద్వారానే తెలియబడగలవు స్థాయిభావము స్థావరముగా నుండు నదగుటచే సంచార్యాదులలో ననువృత్తముగా నుండును, సంచారిభావముల నిందుచే నస్థాయు లని వారు

మనస్సున స్థావరముగా, వికారరహితమై యుండు అంశలు స్థాయిభావములు. ప్రమాతృ ప్రమేయ సంబంధము ననుసరించి స్థాయిభావము లభి వ్యక్తము లగును ఉద్దిష్ట ప్రమేయము చేయుకొనుటలో స్థాయిభావ్యమే వ్యాపృతమగుటచే ఎరుగొనుట సహ జమై ప్రవృత్తితో వచ్చునదగుచున్నది విశిష్ట వస్తువు లను సమీక్షించుట, పరిశీలించుట, పరీక్షించుట, తెలి సికొనుట అనునవి ప్రశ్నలో వచ్చు విశిష్టప్రవృ త్తులు కావున విశిష్టవస్తువు గమనింపబడగా సంచారి భావోద్రేకము కలుగును, అప్పుడు విస్మయప్రాప్తిచే మన మొనర్చు ఉచితకార్యమే స్థాయిభావము ఇచ్ఛాజ్ఞానానందములే స్థాయిభావములు సంతత మై యుండుటచే వీటి సముదాయమే స్థాయి యగు చున్నది వీటిలోని ఒక్కొక్కదాని నాధారముగా తీసికొని స్థాయిభావములలో భేదము చెప్ప వచ్చుచున్నది విషయప్రత్యక్షము సంచారి భావోద్రేకము అను వాటితో పాటు సంచారి భావముయొక్క బహిః స్వరూపమగు సాత్త్విక భావములతో వ్యక్తమగునది స్థాయిభావము.

ఉదాహరణకు జుగుప్స యను స్థాయిభావ మును తీసికొందము. దీనిలో జుగుప్స యను సంచారి భావము కూడా కలదు దుర్గంధ, రుధిర, మాంస, మేదస్సుల పాలంబనములుగా గ్రహించి, కృమికీటాద్యు ద్దీపనములతో నిది సంచలితమగును అప్పుడు మోహము, అప స్మారము, ఆవేగము, వ్యాధి మొదలుగాగల భావ్యసన్నివేశములతో సంచారిభావము వ్యక్తమగు చున్నది నిష్ఠీవనము, ఆస్యవలనము, నేత్రసంకో చనము మొదలగు కృత్యముల ద్వారా ప్రవృత్తి కల్పిం చును ఈ కృత్యము లన్నియు సంచారిభావము నాధారముగా చేసికొని వచ్చుటచే స్థాయిభావము సంచారిభావముచే నుద్దీపితమగుచున్నదని యనవలెను అనగా నొక్కొక్క స్థాయిభావములో తత్తద్విశిష్ట సంచారిభావము గలదని భావము స్థాయిసంచలనమున సంచారిభావము ధూయమానమగును విద్యు దుత్సేచనమువలె స్థాయిమాత్ర మధ్యమున కన బడుచు, మాయమగుచు, స్థాయిభావమునకు వైచి త్ర్యము సంపాదించునవి సంచారిభావములు

స్థాయిభావమొక చిత్తవృత్తి కాని చిత్తవృత్తి ఎక్కువ కాలము మార్పులేకుండా ఉండజాలదు. వ్యక్తియొక్క మనస్సు ద్వారా చైతన్యమునుండి ఆవిర్భవించు స్థాయిభావము తిరోహితమగునప్పుడు కొన్ని వాసనల నుంచిపోవును చిత్తవృత్తి బయలు దేగనప్పుడు సంచారిభావము లనేకము లుత్పన్నము లైనను, అవి స్థాయిని నశింపజేయజాలవు ఉప్పు అన్నిపదార్థముల తన రుచిలోనికి మగించునట్లు చేయునట్లు, సంచారిభావములను తనలోనికి సమ్మి ళింప జేయజాలునది స్థాయిభావమని దశరూపకకారు డిట్లనెను సంచారిభావములు స్థాయికి విరుద్ధము లైనను, అవిరుద్ధములైనను, స్థాయిని తిరోగమింప జేయలేవు చిరకాలము చిత్తమున నిలచి, అనుబంధ ములతో సంబంధములను పెంపొందించుచు, రసత్వ మును పొందునవి స్థాయిభావములని సరస్వతీకంఠా భరణకారుడు గూడ చెప్పెను ప్రజలకు రాజునకు గల సంబంధ మెట్టిదో, శిష్యులకు గురువునకుగల సంబంధ మెట్టిదో, అట్టి సంబంధమే సంచార్యాది భావములకు స్థాయిభావమునకు గలదని భరతుడని నాడు ఈ స్థాయిభావమే రసముగా పరిణమించునది.

స్థాయిభావము సంచారిభావ మగుట, సంచారి భావము స్థాయిగా పరిణమించుట, కల్పించుటచే స్థాయిసంచారిభావములకు వైలక్షణ్యము సాధించుట దుర్ఘటమని కొందరు విమర్శకు లనినారు. సంచారిభావస్వరూపమును విమర్శించుచు ఈ విషయమును తేల్చితిమి. ఇచట విచారింపవలసిన విషయ మింకొకటి గలదు. రుద్రట, లొల్లట, నమిసాధు, భోజులు సంచారిభావములుగూడ రసములుగా పరిణమించగలవని సిద్ధాంతించినారు. ఈ విమర్శకుల ననుసరించినచో సాత్త్వికభావములు, విభావానుభావములు గూడ స్థాయిభావములు కాగలవని చెప్పవలసి యుండును.

విభావములు రెండు రకములుగా నున్నవి. మొదటిది ఆలంబన విభావము. రసమును ఆవిర్భవింపజేయు వ్యక్తిగాని, విషయముగాని ఆలంబనవిభావ మగును. ఈ విభావము చిత్తవృత్తి కాదు. రెండవది ఉద్దీపనవిభావము. పరిసరములలో భావము నుద్దీపింపజేయు సన్నివేశ ముద్దీపన విభావము. ఇది కూడ చిత్తవృత్తి కాదు. చిత్తవృత్తి కానిది స్థాయిభావము కాజాలదు. అనగా విభావములు స్థాయిభావములు కాజాలవు.

సంచారిభావములను మన మనుభవించునపుడు బాహ్యముగా శరీరమున కన్పించు చలనములు సాత్త్వికభావములు. సంచారిభావ జనితములు. చిత్తవృత్తి రసముగా పరిణమించుటకు సంచారిభావ సహాయము నపేక్షించును. కాని సాత్త్వికభావములు సంచారిభావములవలన జనించునవగుటచే వీటిని స్థాయిభావములుగా స్వీకరింప వీలులేదు. సాత్త్వికభావ మవ్యాకృతమాయి యగుటచే అనుభావాదులతో సంబంధమును స్వతంత్రించి గ్రహించలేదు. కావున ఋతుమాల్యాది విభావములు, హాస్యాదిబాహ్యానుభావములు స్థాయిభావములు కావని నిశ్చయింపవలెను. స్థాయి సంచారిభావముల కతి సన్నిహిత సంబంధ ముండుటచే నొకదాని ప్రవృత్తిని మరియొకటి గ్రహించినదిభిన్నముగా కన్పించవచ్చును. బాహ్యానుభావముల ద్వారా సంచారి భావములు వ్యక్తమగుటచే, బాహ్యానుభావములు లేనపుడు సంచారిభావము లేకపోవుటను భావించవలెను. ఈ బాహ్యానుభావముల ద్వారా అంతర్లీనముగానున్న సంచారిభావ స్వరూప మవగతమగును. కావున స్థాయిభావము, సంచారిభావము, బాహ్యానుభావములు సాత్త్విక భావము అనునాటికి సన్నిహితమైన అన్యోన్య సంబంధము కలదని సిద్ధాంతము.

విభావానుభావ వ్యభిచారి సంయోగమునరసము నిష్పన్నమగునని భరతసూత్రమున స్థాయిభావము కన్పించదు. పైగా రతిహాసాది స్థాయి భావములను చెప్పసందర్భమున స్థాయిభావము లెన్నిగలవో వాటి సంఖ్యనుగూడ భరతుడు చెప్పలేదు. స్థాయిభావము లసంఖ్యాకములగుటచేతను, ప్రతి ప్రవృత్తిని ఏదో ఒక స్థాయిభావముతో సమన్వయపరుపవలెను గనుకను, సంఖ్యానిర్ణయ మిచట గావింపబడలేదని అభినవగుప్తున్న ప్రాచీనులైన సాహిత్యసమీక్షకులు వ్యాఖ్యానించిరి. సహృదయావర్జకత్వ ప్రాచుర్యము వలన, పూర్వప్రసిద్ధిననుసరించి, ఎనిమిది స్థాయిభావములే చెప్పబడినవి గాని ఇవి అసంఖ్యాకములని లొల్లటాదుల అభిప్రాయము. మన స్తత్త్వ శాస్త్రవేత్తలు గతించిన నూరేండ్లలో అనేక స్థాయిభావములను లెక్కించియున్నారు. వీరి లెక్కలో వేటాడుట, తినుట, జీర్ణించుకొనుట గూడ స్థాయిభావములైనవి. కాని ఇవి ఆహారాన్వేషణరూపమగు మృగయాభావములోనివే గాని వేరు గాదు. స్థాయిభావము చిత్తవృత్తియగుటచే శారీరకవృత్తులను, ఇంద్రియవ్యాపారములను స్థాయిభావము లనరాదు.

శాస్త్రజ్ఞులు, సాహిత్యసమీక్షకులు అనేక స్థాయిభావములను గూర్చి పలికినారు. వీటిలో కొన్ని సాహిత్యమున కుపకరించునవో విచారింపవలసి యున్నది. ప్రధానాలంకారిక సంప్రదాయము ననుసరించి రతి, హాసము, శోకము, క్రోధము, ఉత్సాహము, భయము, జుగుప్స, విస్మయము అను ఎనిమిది స్థాయిభావములే గలవు. ఈ ఎనిమిదింటి తోపాటు వాత్సల్యము, స్నేహము, ఆసక్తి, సంతోషము, అరతి, గర్వ, మృగయా, ఆశ, స్పృహా, క్రీడనకము, మాయా, శ్రద్ధ, భక్తి అను స్థాయిభావములను కొందరు గ్రహించిరి. మరికొందరు కాచము, ప్రవాసము, నిద్ర, నిర్మాణము మొదలగు వానిని గూడ చెప్పినారు. ఈ ఇరువదియొకంటిని పరిశీలించి, వీటిలో కొన్ని స్థాయిభావములు కాగలవో నిశ్చయింపవలసియున్నది. స్థాయిభావముల సంఖ్య

లీనముగా విశిష్టమగు సంచారిభావము స్పష్టముగా నుండవలెనని ఆసక్తియందుంచుకొని, తద్విలక్షణము లైనవి స్థాయిభావములు కావలెనని తేల్చవలెను.

స్పృహ జనకమగు భావ మాహారవిషయక ప్రవృత్తిలోనిది. ఈ రెండును, ఆత్మరక్షణ, వంశవృద్ధియను ప్రాథమిక ప్రవృత్తులలో నంతర్లీనములై యున్నవి పైగా భయక్రోధాదులద్వారా స్పృహ జనించును స్పృహ, మృగయా భావములద్వారా ఆత్మశీలితకాకున అభివ్యక్తమగుచున్నది సంతాన విషయక ప్రవృత్తిలోను, పిల్లలను రక్షించు ప్రవృత్తిలోను ఇవి ముఖ్యాంగములు ఈ ప్రవృత్తులద్వారా గృహాది నిర్మాణము జరుగుచున్నది కాగా పైన చెప్పబడినభావము లన్నియు రతియను స్థాయిభావమున నంతర్లీనములైయున్నవని నిశ్చయించవచ్చును వాత్సల్య, స్నేహాది సుకుమార భావములు కూడ రతి స్థాయిభావరూపములే యగుచున్నవి

ఆక్రోశమున కన్పించు నిస్సహాయత శోకము లోనిఅంగము ఇది క్రోధ, భయములద్వారా నిష్పన్నమగును శోకముద్వారా జనించు ఆర్ద్రానుభూతి వలన శోకతప్తులు పొందిన వ్యక్తులకు సన్నిహిత సంబంధము కలుగుచున్నది కాగా శోకజనితమగు చిత్తసంవాదమున స్నేహ మంత రూఢమగును. తద్వారా సాంఘిక జీవనము పోషింపబడును. అనగా శోకవర్గమునకు చెందినభావములలో శోక మొక్కటే స్థాయిభావముగా కన్పించగలదు

అరతి, సంతోషము అనునవి ప్రతి అనుభూతి లోను అనుస్యూతముగా నున్నవి వేదనారూపమున నున్నవి యగుటచే వీటిని స్థాయిభావము లనరాదు అక్షు, అనాదరణ, నిస్సారాది భావము లుత్సాహ స్థాయిభావము నాశ్రయించుకొని యుండునవి శారీరక పరిస్థితులవలన, వాతావరణము వలన ఉత్పన్నములగు స్థితులగుటచే విశ్రాంతి, నిద్ర, ప్రవాసము అనునవి స్థాయిభావములు కావు శౌచము, అసహ్యము అనునవి మనస్సు ఉద్దేశించు స్థితులే గాని చిత్తవృత్తి రూపములు కావు ఇట్లే ఇచ్ఛాశక్తిలోని దోషము నాశ్రయించుకొని బయలుదేరునది నష్టభావము

అస్వార్థమునకు సాధనగా గాక, నిరుపేక్ష భావముతో ననుభవింపబడు నిర్మాణ వృత్తి స్థాయి భావమే యగునని అలెగ్జాండర్ నిర్వచించినాడు కాని రసప్రపంచమున అనుభూయమానములగు భావముల కన్నిటికి ఈ లక్షణము వర్తింపగలుగు గనుక ఈ వాక్యమును స్థాయికిబద్ధ నిర్వచనముగా గ్రహించ వీలు లేదు జ్ఞానము, భావన అనునవి స్వేచ్ఛగా విహరించగా వచ్చు స్థితులు నిర్మాణము, మృగయ, శ్రద్ధ, భక్తి యనునవి అనగా ఇవి స్థాయిభావములు కావు

భక్తి వలన గాని, వాత్సల్యము వలన గాని, జనించు ప్రియతరా ఖ్యానమగు ప్రీతిస్థాయి భావము కావలెను ప్రేయస్ అనునది భావముకావ్యమందలి గుణము మాత్రమే అని ఉద్భటు డనినాడు సంచారి భావజనితములై, అత్యంతము విలువగల స్థితులగు స్నేహ, వాత్సల్యములు చిత్తవృత్తులవలన ఉద్భవించునవే గాని స్థాయిభావములు కావు స్నేహస్థాయి ఆర్ద్రీతి యని చెప్పు సమీక్షకులు రత్యుత్సాహములలో ఆర్ద్రీత అంతర్భూతమని మరచుచున్నారు స్నేహము, భక్తి, వాత్సల్యము అనునవి రతియొక్క విశేషరూపములని హేమచంద్రుడు గూడ వచించినాడు.

ప్రాణుల జీవితములో రతిస్థాయిభావ మతి ముఖ్యమైనది సర్వప్రవృత్తి, జ్ఞానవికాసము ఈ స్థాయిభావమునుండియే బయలుదేరుచున్నవని మెక్డూగల్ యొక్క సిద్ధాంతము పాలు కుడుచుట, ఆహారము నిచ్చుట, ఇంటిని కట్టుట, శిశువును రక్షించుట, శత్రువుల నెదుర్కొనుట మొదలగు క్రియలన్నియు రతిద్వారా వచ్చునవి ప్రేయస్, వాత్సల్యములు గూడ రతినుండియే వచ్చుచున్నవి శిశువు యొక్క ఆక్రందనము మాతృత్వమును, పితృత్వమును అభివ్యక్తము చేయగల్గుచున్నది అనగా రతిస్థాయి భావ మనేక భావములకు ప్రధాన కారణముగా కన్పించుచున్నది

రతిని సాంప్రయోగికీ ప్రీతి, మైత్రి, సౌహార్దము, భావము అని నాల్గు విధములుగా కవికర్ణపూర గోస్వామి విభజించినాడు సాంప్రయోగికీ ప్రీతి యనునది సంభోగాత్మకమగు ప్రవృత్తి. దీనిని పశుపక్ష్యాదులలో సైన్నస్థాయిభావముగా గ్రహించినను, మానవస్థితియం దిది రతిలోని అంతర్భావముగనే కన్పించుచున్నది భక్తిశ్రద్ధలలో జ్ఞానము, భావన, ఉత్సాహము కలవు ఈ మూడును రసప్రతీతిలో విశిష్టముగా కన్పించుటచే వీటితో కూడిన భక్తిశ్రద్ధలను స్థాయిభావములుగా గ్రహింపవీలులేదు. స్పృహ,

మతి, ధృతి, ఉత్సాహములతో సంకలితములైన భక్తి శ్రద్ధలు శాంతరసముయొక్క అంగము లగుటచే వీటికి స్థాయిత్వము లేదని అభినవుడు సిద్ధాంతించినాడు. ప్రీతి భక్త్యాదిభావములు, మృగయాక్షాది రసములు హర్షోత్సాహములలో నంతర్భూతము లగుచున్నవని దశరూపకకారుడు వచించినాడు. సమాన స్థితిగతులలోనున్న వారల మధ్య పరస్పరముగాగల రతిని స్నేహమని, అనుత్తమున ఉత్తమునియందు గల రతి ప్రసక్తిని భక్తియని, ఉత్తమున కనుత్తమునియందుగల రతిని వాత్సల్యమని హేమచంద్రుడు ప్రపంచించినాడు

కోపమువలన సంభవించు బాహ్యానుభావములలో క్రోధస్థాయి భావము కలదు. ఈ క్రోధము స్థాయిభావము, సంచారిభావము కూడ నగుటచే దీని స్వరూపమును నిర్ణయించుట కష్టము. స్థాయిభావముయొక్క స్వాభావికప్రవృత్తికి ఆటంకములు కలుగగా ఉద్దిష్టార్థ విషయప్రాప్తి దుర్లభమైనట్లు కల్పించినపుడు ఉత్పన్నమగు క్రోధమును స్థాయిభావముగా గ్రహించవలెను. ఆటంకము, అంతరాయములను పారద్రోలుటకు చేయబడు యత్నము, అనువాని ద్వారా నభివ్యక్తమగు ప్రవృత్తిలో క్రోధము ప్రధానమైనది. ఇచట విషయముకన్న ప్రవృత్తియే ముఖ్యమగుచున్నది. ఆటంకమున భయము, యత్నమున ఉత్సాహము వచ్చుచున్నవి. భయముద్వారా భయానకము, ఉత్సాహముద్వారా వీరము సిద్ధించగలవు. వీరభయానకములు క్రోధము నాశ్రయించుకొని వచ్చుటచే వీటికి రౌద్రము మూలభూతమగుచున్నది. అనగా ఉత్సాహ, భయ, క్రోధముల కతి సన్నిహితసంబంధము కలదని భావము. పరుగెత్తుట, పారిపోవుట, మీదకు దుముకుట, స్తబ్ధముగా నుండుట, వణకుచు కూలిపోవుట, మొదలగునవి భయవర్గమునకు చెందినవి. ప్రీతితో సంకలితమైనది క్రోధము. ఉద్దిష్టార్థమును సాధించుటకు క్రోధము వ్యాపృతమగుచుండగా, విషయమునుండి వెనుకకు మరలుట జుగుప్సలో గలదు. జాగరూకత, కంపము, తొట్రుపాటు మొదలగునవి ఉభయత్ర కలవు. వీటి నన్నిటిని ప్రత్యేక ప్రత్యేకముగా స్థాయిభావములన వీలులేదు

క్రోధ, భయ, జుగుప్సలద్వారా శోకము రాగలదు. ఈ శోకము బీభత్సమునకు సంబంధించిన దగుటచే జుగుప్సావహమగును. కాని భయమునుగొల్పు వస్తువు మిక్కిలి ఆకర్షణీయమైన విస్మయము రేకెత్తును. విస్మయము సర్వసాధారణమై అన్ని ప్రవృత్తులలోను కల్పించును. అన్ని ప్రవృత్తులకు కొంతవరకాధారభూతమైనది విస్మయము. అసమగ్రప్రతీతినిగాని, జ్ఞానమునుగాని ఆధారము చేసికొని బయలుదేరు విస్మయముద్వారా విషయముగాని, సన్నివేశముగాని అతి స్పష్టమగును. పరిశీలన, అన్వేషణ, జ్ఞానము మొదలగువానికి విస్మయ మాధారభూతము. దీనిని చేతోవిస్ఫార మందురు. ఈ విస్మయమున చిత్తవికాస విస్తృతులు కల్పించగలవు. అనగా అనేక స్థాయిభావములకు విస్మయమే పట్టుకొమ్మవంటిది. విస్మయముద్వారా ప్రధానముగా స్వీయవిషయకమగు జుగుప్స కలుగును. కావున క్రీడనకాది శబ్దములచే తెలియనగు విషయవిజ్ఞేయతలు స్వతంత్రముగా స్థాయిభావములు కాజాలవు. విస్మయ మనేక ప్రవృత్తుల కాశ్రయమైనను, కొన్ని ప్రవృత్తులలో విస్మయమే ప్రధానముగా గోచరించును. లోకోత్తరవిషయములను దర్శించునపుడు విస్మయ మొక్కటే కల్పించగలదు

కావున రతి, క్రోధము, భయము, ఉత్సాహము, విస్మయము అనునవి మానవజీవితములో నతి ముఖ్యమైన స్థాయిభావములు. కరుణాంతర్గతమగు శోకముతోను, హాసముతోను కలసి ఈ మొత్తము ఏడు స్థాయిభావములు పురుషార్థ (*Values*) సాధకము లగుచున్నవి. మానవజీవితమున కరుణాంతర్గతమగు శోకము స్థాయిభావముగాను, సంచారిభావముగాను కూడ అనుభూయమానమగుచున్నది. బాధలో గాని, దుఃఖములో గాని ఉన్న వారియెడల మన మనుభవించు కరుణ లాలిత్యముతో గూడి చిత్తమును ద్రవింపజేయునది. విపత్తులో గల విషయముపై ప్రేమయున్నచో చిత్తము ద్రవించును. అనగా కరుణ రతి స్నేహవాత్సల్యాదులతో సంకలితమై యున్నది. చిత్తద్రవీకరణ ద్వారా ఇతరుల బాధను భవనారూపమున అనుభవించుటయే హాస్యమందలి ప్రధాన విషయము. కాగా రతి హాస శోకములకు పరస్పరము సన్నిహిత సంబంధము కలదని, మిగిలినవాటికి ఇట్టి అన్యోన్య సంబంధమే కలదని సిద్ధమగుచున్నది.

ఈవిధముగా నతి ముఖ్యమైన స్థాయిభావముల జుగుప్సతో కలసి ఎనిమిది యగుచున్నవి. ఇది కేవ

లను చిత్తవృత్తులు మనస్సునందు అనుకూలవిషయముపై కలుగు ప్రసన్నాయితము రతి వైక్లబ్యమును చిత్తవృత్తివిశేషము శోకము చేత విశాదము హాసము ప్రజ్వలన మనబడు చిత్తవృత్తియే క్రోధము ఔన్నత్యాత్మిక చిత్తవృత్తి ఉత్సాహ మందురు. భయమున చిత్తవైక్లబ్యము కలదు గనుక భయశోకములను రెండు భిన్నస్థాయిభావములుగా పరిగణింప నవసరము లేదు చిత్తవిస్ఫార రూపమగు విస్మయము జుగుప్సాగులకు హేతువు కాగా ఆరే ప్రధాన స్థాయిభావము లగుచున్నవని

ఈ స్థాయిభావముల కన్యోన్య సంబంధ మతి సన్నిహితము ఒకే సమయమున ననేకచిత్తవృత్తులు పైకి ఉబుకవచ్చును ఒకేవిషయము నుద్దేశించి అనేకమందికి ఒకే ఒక విశిష్టమైన చిత్తవృత్తి కలుగవచ్చును. ప్రతిస్థాయిభావము ప్రవృత్తి పరముగుటకు తత్తద్విశేషములు ఉద్దీపనములు గలవు ఇతరుల చిత్తవృత్తుల వలన కలుగు బాహ్యానుభావములను చూచినపుడుగూడ ఈ స్థాయిభావములు పైకి రాగలవు భయజనితమగు శోకమును వినగానే ఆదే వర్గమునకు చెందిన ఇతర వ్యక్తులకు తుల్యానుభూతికల్గుట సహజము అట్టిసమయములలో మనస్సు కరిగించి, ఇతరులమనస్సులతో ననన్యత్వమును పొందుచున్నది దీనినే చిత్తసంవాద రూపముగ అర్థింతు రందురు ఈ సంవాదరూపము ద్రవీకరణ మానసికము దీనివలన ఒకేవర్గమునకు చెందిన వ్యక్తులకందరకు నొకేవిధమైన మనస్సు, మనః ప్రవృత్తులు గలవని చెప్పవీలగుచున్నది ఈ తాదాత్మ్యము లేనిచో స్థాయిభావములకు ప్రవృత్తి ఉండజాలదు అనగా స్థాయిభావములన్నియూ నొకేరీతిక మూలశక్తినుండి ఆవిర్భవించుచు, ఆ శక్తియొక్క రూపములుగా బహిర్గతములగు చిత్తవృత్తులనిభావము. కావున నొకేరీతి ప్రవృత్తిలో ననేక స్థాయిభావములు కల్పించ వీలున్నది కాని వీటిలో నొక్క స్థాయిభావమే ప్రధానమగును మిగిలినవి వీనికి అంగములు కావలెను ఒక స్థాయిభావమున కంగములగు మిగిలినస్థాయిభావములు సంచారి భావములవలె ప్రవర్తించగలవు అనగా సందర్భవశమున నొకేరీతి చిత్తవృత్తి స్థాయిభావముగాను, సంచారిభావముగాను కూడా కన్పడును సజాతీయ విజాతీయ భావాంతరములచే తిరస్కృతముగాక ఉపనిబద్ధమానములగు రత్యాదులే స్థాయిభావములని అవలోక కారుడు నిర్వచించియున్నాడు

క్రోధ, శోక, భయ, జుగుప్సలు తమంతట తామే పరుని ఉత్పన్నములు చేయజాలవనుటచే శక్తి వీనికి సంక్రమించునదే గాని, వీటినుండి ఉత్పన్నమగునది కాదని స్పష్టము రతి, ఉత్సాహ, విస్మయములతో సర్వదా మెలగునది హాసము ఇది ప్రతిప్రవృత్తిలోను కల్పించు భావములు చిత్తద్రవీకరణశక్తితో నీనాల్గుభావములు అర్థరహితములు, ప్రయోజనరహితములు కాగలవు స్థాయిభావజనితములగు అనుభావము లవాంతరములైనపుడే చిత్తసంవాదము కలుగును సాంఘికజీవనమున కీచిత్తసంవాద రూపమగు అవగతి లేక వ్యంజన ప్రముఖాధారము తద్ద్వారా వ్యక్తులందరు అన్యోన్యసంబంధమును కలిగి మెలగుదురు. ప్రమాతృప్రమేయములకు సమగ్రమగు అనన్యత్వము సిద్ధించుటయే ఈ చిత్తసంవాదము ఈ అనన్యత్వము రసప్రతీతిలో నతిప్రధానమైనది కాగా చిత్తసంవాదమున కే యే భావము లుపకరించుచున్నవో వాటినే సాహిత్యమున మనము ప్రధానముగా స్వీకరించవలెను అప్రధానములు వస్తువు ఎవనిచిత్తమునకును విశ్రాంతి నీయజాలవు అప్రధానమగు భావము ప్రధానభావమున పర్యవసితమగుచు, అన్యముఖప్రేక్షయగుచున్నది ప్రధానమై, ఇతర భావముల కంగము గాక, స్వయం సిద్ధమై, సమగ్రమై, సంపూర్ణమైనది స్థాయిభావము పరిసరములలో కలుగు మార్పులకు లోబడక, చిత్త వృత్త్యాత్మకములైనవి స్థాయిభావములు ఈచిత్తవృత్తులు ప్రవృత్తికి దోహదము లొసగుచున్నను ముఖ్యముగా నివి జ్ఞానాకారములే యని చెప్పవలెను

కాలక్రమమున స్థాయిభావములలో విశిష్టములగు మార్పులు వచ్చుచున్నవి పశుపక్ష్యాదులలో కన్పించు స్థాయిభావములు క్లిష్టములు కావు మానవులలో నివి యనేకభావములతో క్లిష్టములై కన్పించుటచే వీనిని వివిధ భావములలోనికి విశ్లేషించవచ్చును ఈ భావము లన్నియు ఉద్దిష్టార్థ ప్రాప్తికి గాని, విషయమునుండి పరాఙ్ముఖ మగుటకు గాని వ్యాపృతము లగుచున్నవి అనగా ఇచ్ఛ నాశ్రయించుకొని ప్రవృత్తిముఖములగు నీ భావములు, ఉద్దిష్టార్థప్రాప్తితో ప్రయోజనవంతము లగును ప్రవృత్తికి హేతుభూతములగు కోరికలద్వారా ప్రవృత్తి సుఖదుఃఖముల నొసగజాలుచున్నది కాని ప్రతి ప్రవృత్తిలోను సుఖదుఃఖములు సంవలితములైయుండునని మరువరాదు స్థాయిభావముల నాధారముగా చేసికొనియున్న రసప్రతీతి మానసికానుభూతివి, ఆత్మానుభూతిని ఇచ్చునది చిత్తవృత్త్యాత్మకమైనదగుటచే స్థాయిభావ ప్రవృత్తి ప్రయోజన సహితము ఈ ప్రయోజన మితర భావములద్వారా, ప్రవృత్తులద్వారా, అవగతి మగుచున్నది ఈ అవగతి చైతన్య ప్రతీతి యైగా అవగతి అర్థరహితము కాదు అర్థము జ్ఞానాకారము అనగా చైతన్యము, జ్ఞానము అనునవి పర్యాయపదములు అనుభూతిలో విషయములన్నియు జ్ఞానమున లీనమగుచున్నవి ఈ యనుభూతి చేతనుడగు వ్యక్తికి కలుగునది

# తెప్ప తిరునాళ్లు

★

శ్రీ కంపకూరి రామభద్రరావు

రండమ్మ రండి! రవలసొమ్ములతోడ,
తరలి రారండి! తెప్పతిరునాళ్లు,
శ్రీనృసింహస్వామి శ్రీదేవితో గూడి
కార్తీక జ్యోత్స్నలో కడలి కెరటంపైన
ఉయ్యాలలూగగా ఊరేగివచ్చేను   రం॥

వెన్నెలంతా నింగి వెలిగొడుగు విప్పింది
హరితాంకురాలతో అవని పులకించింది
నేయిదివ్వెలతోడ సేవచేయుసామికై
హాయిగా సాగు సన్నాయిమేళము రండి.   రం॥

వెండితళుకుల చిర ప్రేలాడు కుచ్చిళ్ల-
గొప్పింటి ఒయ్యారి గోదావరీగంగ
ఆదరికి ఈదరికి ఒదుగుతూ తానొచ్చి
నిజనాథు పజ్జనే నిలిచి మ్రొక్కింది   రం।

సాగరుడు చేపట్టి చదలంటగా లేచి
పనవల్లు ప్రోక్కుతూ పాల్కడలి తానై
గోదావరీ దేవి కొంగు కొంగూ కలిపి
స్వామికెదురుగవచ్చి స్వాగతంబిచ్చేను   రం॥

పల్లెపడుచుల బిగువు పగలబడి నవ్వగా
తెల్లపూదెప్పపై తేలిపోవును సామి
జేజేల నల్దిశలు చేరి మార్మ్రోగేను
క్షీరసాగరశయను సేవింప రారండి   రం।

సాగరుడు శయనమై సంతరించెడు వేళ
మేళాలు తాళాలు మినుబాణసంచాలు
కోలాహలమ్ముగా కొలువుదీర్చును సామి
అభయహస్తము నెత్తి ఆశీర్వదించేను   రం॥



# యజ్ఞఫలము

### భాసమహాకవి సంస్కృతనాటకమునకు ఆంధ్రీకరణము


## శ్రీ బులుసు వేంకటేశ్వరులు


(గత సంచిక తరువాయి)

### విష్కంభము

(సరయూ తీరమున గ్రీష్మించు ఇరువురు గంధర్వులు ప్రవేశింతురు)

చిత్రకేతువు: చిత్రపథా! నీ వీ జలముల స్నానము చేయు నుత్సాహమున నీ కర్తవ్యమును మఱచితివి మన మిట కేల వచ్చితిమో తెలియునా?

చిత్రపథుడు: తెలియకేమి యంతయు తెలియును రావణుడు రామునకేమైన కష్టము చేయుటకు విగూఢరూప చ్ఛాయతో నయోధ్యా ప్రాసాద సవిధమున దిరుగుచున్నాడు మహేంద్రుని యాజ్ఞను రాముని సంరక్షింప మనము స్వర్గమున నుండిటకు వచ్చినారము కాని

హిమగిరి నీరసౌఖ్య మొక
యింతయు సాటికి రాదు, ఉత్త
మోత్తముడు గంగ నీరు మఱి
తక్కిన దివ్యజలంబు లింతయున్
సమములు కావు చూడగ న
నంతము ఈ సరయూ జలంబుతో,
సమహిత మిందు స్నాన, మఘ
శోధ్యము, విహగజాల దీధితిన్.

చిత్రకే: హిమాద్రిక ప్రదేశమునుండియే మన మిపుడు వచ్చినను నిది నిదాఘకాల మగుటచే స్నానము సుఖావహమే కాని, స్వామి నియోగము మఱచిపో గూడదు గదా!

చిత్రప: ఔను కాని,

నిఖిల ఋతువుల బహురమణీయ మగుచు
సకల దేవర్షి మనుజ ప్రశంసితంబు
నయిన సరయూజలంబు పాపౌఘ మడచు
గ్రీష్మ శిశిరర్తువుల సమశ్లేష మొసగు

ఏమైనను నేను స్వామి నియోగము మఱవలేదు అపరాహ్ణమునకు బూర్వమే రావణు డెట్లయోధ్యకు రాగలడు? ప్రత్యక్షమున వచ్చినను నంత త్వరగా రాలేడు ఇంతకు నింద్రాదులే తమ భార్యలను రక్షించుకొనుటకైనను నాతని ప్రభుత్వ మంగీకరించిరి కదా! ఇక నెవరు రాముని రావణుని బారి నుండి రక్షింపగలరు? అట్లని ప్రభు నియోగ ముపేక్షింతుమని కాదు కాని మనము గూఢ దేహులమై యీ ప్రాసాదోపవనమున నిరీక్షింతము.

చిత్రకే: అట్లనకుము రావణుడు దశరథుని కంటె బలవత్తరుడేయైనచో నేల యాతడు గూఢముగా వచ్చును? తన కనిష్టము సంభవింపవచ్చునను భయము చేతనే యాతడు దశరథునకు దెలియకుండ వచ్చుట

చిత్రప: కాదు కాదు రావణుఁ డద్వితీయ బలవంతుడు

చోరులు శఠులును వ్యసనులు
భీరుత్వము గాంచ, రెపుడు భీతిప్రగుల
వ్యారలు, ప్రత్యక్షముగా
క్రూరములగు పనులు చేయగోరరు మనుజుల్

చిత్రకే: ఏమైనను గలదు కదా! యీ యనిష్ట ప్రతీకారోపాయము

చిత్రప: సరే రమ్ము పోదము (నిష్క్రమింతురు)

ఇది విష్కంభము

### తృతీయాంకము

రావ: (ఆకాశమార్గమున రావణుడు ప్రవేశించును)

పుట్టినాడ బులస్త్యర్షి పూతకులము
నందు నందితి శివు గొల్చి యమితబలము
సురలసేవల గొంటి, నసురులు భృత్యు
లపజయ మెఱుంగ నే రావణాసురుండ.
అద్వితీయుడ సురబలాతంకకార్య
ములను జేగీయమానుడ నలఘుకీర్తి

# తెప్ప తిరునాళ్లు

★

శ్రీ కందుకూరి రామభద్రరావు

రండమ్మ రండి! రమణీమణులతోడ,
తరలి రారండి! తెప్పతిరునాళ్లు,
శ్రీనృసింహస్వామి శ్రీదేవితోగూడి
కార్తీక జ్యోత్స్నలో కదలి కెరటాలపైన
ఉయ్యాలలూగగా ఊరేగివచ్చెను   రం॥

వెన్నెలంతా నింగి వెలిగొడుగు విప్పింది.
హరితాంకురాలతో అవని పులకించింది
నేయిదివ్వెలతోడ నేంచేయుసామికై
హాయిగా సాగు సన్నాయిమేళము రండి   రం॥

వెండితళుకుల చిర్రవేలాడుకుచ్చిళ్ల-
గొప్పింటి ఒయ్యారి గోదావరీగంగ
అదరికీ ఈదరికీ ఒరుగుతూ తానచ్చి
నిజనాథునజ్జనే పిలిచి మ్రొక్కింది   రం॥

సాగరుడు చేపట్టి చదలంటగా లేచి
పావళ్లు త్రొక్కుతూ పాల్కడలి తానమై
గోదావరీదేవి కొంగు కొంగూ కలిపి
స్వామికెదురుగవచ్చి స్వాగతంబిచ్చెను   రం॥

పల్లెపడుచుల బిగువు పగలబడి నవ్వగా.
తెల్లపూదెప్పపై తేలిపోవును సామి
జేజేల నల్దిశలు చేరి మార్మ్రోగేను
క్షీరసాగరశయను సేవింప రారండి   రం।

సాగరుడు శయనమై సంతరించెడు వేళ
మేళాలు తాళాలు మినుబాణసంచాలు
కోలాహలమ్ముగా కొలువుదీర్చెను సామి
అభయహస్తము నెత్తి ఆశీర్వదించెను   రం॥

---

# యజ్ఞఫలము

భాసమహాకవి సంస్కృతనాటకమునకు ఆంధ్రీకరణము

శ్రీ బులుసు వేంకటేశ్వరులు

(గత సంచిక తరువాయి)

### విష్కంభము.

(సరయూ తీరమున క్రీడించు నిరువురు గంధర్వులు ప్రవేశింతురు)

చిత్రకేతువు: చిత్రపథా! నీ వీ జలముల స్నానము చేయు సత్కాలమున నీ కర్తవ్యమును మఱచితివి మన మిట కేల వచ్చితిమో తెలియునా?

చిత్రపథుడు: తెలియకేమి యంతయు జలియును రావణుడు రామునకేమైన నష్టము చేయుటకు నిగూఢరూప చ్ఛాయతో నయోధ్యా ప్రాసాద సమీపమున దిరుగుచున్నాడు. మహేంద్రుని యాజ్ఞను రాముని సంరక్షింప మనము స్వర్గమున నునిటకు వచ్చినారము. కాని

హిమగిరి నీరసౌఖ్య మొక
యింతయు సాటికి రాదు, ఉత్త
మోత్తముగు గంగ నీరు మఱే
తక్కిన దివ్యజలంబు లింతయున్
సములు కావు చూడగ న
నంతము గా సరయూ జలంబుతో,
సుఖహిత మిందు స్నాన, మగ
శోద్యము, పీనగాల దీనినీ.

చిత్రకే: హిమాధిక ప్రదేశమునుండియే మన మిపుడు వచ్చినను నిది నిదాఘకాల మగుటచే స్నానము సుఖావహమే కాని, స్వామి నియోగము మఱచిపో గూడదు గదా!

చిత్రప: ఔను కాని,

నిఖిల ఋతువుల బహురమణీయ మగుచు
సకల దేవర్షి మనుజ ప్రశంసితంబు
నయిన సరయూజలంబు పాపౌఘ మడచు
గ్రీష్మ శిశిరర్తువుల సమక్షేమ మొసగు

ఏమైనను నేను స్వామి నియోగము మఱవలేదు. అపరాహ్ణమునకు పూర్వమే రావణు డెట్లయోధ్యకు రాగలడు? పుష్పకమున వచ్చినను నంత త్వరగా రాలేడు. ఇంతకు నింద్రాదులే తమ భార్యలను రక్షించుకొనుటకైనను వానిని ప్రభుత్వ మంగీకరించిరి కదా! ఇక నెవరు రాముని రావణుని బారినుండి రక్షింపగలరు? అట్లని ప్రభు నియోగ ముపేక్షింతుమని కాదు. కానిమ్ము. గూఢ దేహులమై యీ ప్రాసాదోపవనమున నిరీక్షింతము.

చిత్రకే: అట్లనకుము. రావణుడు దశరథుని కంటె బలవత్తరుడైనచో నేల యాతడు గూఢముగా వచ్చును? తన కనిష్టము సంభవింపవచ్చునను భయము చేతనే యాతడు దశరథునకు దెలియకుండ వచ్చుట.

చిత్రప: కాదు. కాదు రావణు డద్వితీయ బలవంతుడు

చోరులు శశులును వ్యసనులు
భీరుత్వము గాంచ, రెపుడు భీతిప్రదుల
న్వారలు, ప్రత్యక్షముగా
క్రూరములగు పనులు చేయగోరరు మదులన్.

చిత్రకే: ఏమైనను గలదు కదా! యీయనిష్ట ప్రతీకారోపాయము

చిత్రప: సరే రమ్ము పోదము (నిష్క్రమింతురు)

ఇది విష్కంభము

### తృతీయాంకము

రావ: (ఆకాశమార్గమున రావణుడు ప్రవేశించును)

పుట్టినాడ బలస్ఫూర్తి పూతకులము
నందు నందితి శివు గొల్చి యమితబలము
సురలవేశల గొంటి, పసురులు భృత్యు
లపజయ మెఱుంగ నే రావణాఖ్యుండ
నద్వితీయుడ సులబలాకంతకార్య
ములను చేగీయుతూనుడ నల్పుని త్రి

సకలభువనంబులందు నసమత్సమాన
వీర్యమహితుండు మఱొకండు విలయగలఁడె ?
దశరథావనిపాలు తనయుడంట ప్రసిద్ధ
రామాభిధానవి భ్రాజితుడట
శస్త్రాస్త్రవిదుడంట సమరంబునందు
సురాసురగణములకైన లీల
గెలువ శక్తుండట తలపబాలుండైన
నుత్తమయోధుడై యొప్పునంట
అని జనంబులు చెప్ప విని యాత డెట్టిడో
చూడంగ వచ్చితి జోద్యముగను

అట్టిమర్త్యుడు బలవంతుడైనవాడు
నరులలోపలఁగలడె యున్నట్టియెడల
నతని జీవింపనిత్తునే యవనిపయిని,
అందుకొరకైనదే మదీయాగమంబు

మంత్ర ప్రభావమున నిగూఢరూపములో నాకాశజల పర్వతతుల్య గతిని జరించు నారకము నెవ్వరును గనజాలరు దీని నిట నుంచి ప్రాసాదమున కేగి చూచెదను

(నిష్క్రమించును)

(అంత విశ్వామిత్రుడు ప్రవేశించును)

విశ్వా

మును తపోర్జితతేజమంద బరమా
మోఘాస్త్రసంఘాతముల్
నను వర్జింపగజాలవయ్యె నిపుడున్
బ్రహ్మత్వముంగాంచదే
వనికాయాస్త్రము లెల్ల వమ్మయియె నా
పై నట్టివసిష్ఠునిరీ
హాని తేజస్విని శక్తియుక్తి గనవా
నౌకొక్క జగంబుందునన్
భువనంబెల్ల విహారముల్ సలుపనే
పాల్పొందదే యొక్క టే
పవిదప్ మాధ్యవశక్తియుక్తి లవి చూ
పం గల్గువా రేడి మా
నవసంఘంబున జృంభకాస్త్రతతియు
న్నన్ వశ్యమెవ్వాని క
య్యవి చేయన్ మఱి తీయ శక్తి తలపో
యన్ గల్గునే యెరికిన్ ?
అతిశయవీరుడున్ దశర
థాత్మజుడున్ రఘురామనామ ధు
న్నతబలశాలి యయ్యెనను ఘు
నంబుదాంతి గలాడటన్న సం
గతి విని వచ్చినాడ గన
గా నతనిన్ గని సత్యమేని స
న్నుతముగ శిష్యుగా గొని య
నుగ్రహియించెద శస్త్రవిద్యలన్
ధరణీపతి వృద్ధుండు న
శరగురి యాచించి రామచంద్రుని గొని సం
బరమున నాశ్రమపదమున
కరిగి మదీప్సితఫలంబు నందెద నిదపన్

(ముందు చూచి) ఏమి! రావణు డాకాశము నుండి భూమికి దిగుచున్నాడు! నా తిరస్కరిణీ విద్యవలన నిగూఢుడు నగు రావణుని గనగంటిని కాని, యాతడు పైవారికి గనరాడు కానిమ్ము అతని తిరస్కరిణీవిద్యను నిగూఢ దేహమును గనగల్గుచున్నాను అతడిట నేమి యకార్య మొనరించునో ? నారాకవలన నిక నాతని యాటలు సాగవు

రావణుడు (ప్రవేశించి) ఏమి! విశ్వామిత్రుడిటకు వచ్చినాడే! ఈతడు బ్రహ్మర్షి తేజోరాశి నా కోరిక నీతడు సాగనీయడు— నేనును దుర్ధర్షుడ నగు రావణుడ నగుటచే నీతడు నా కేయనిష్టము చేయ లేడు నా నిగూఢరూప మీతడు చూడ శక్తుడు కావున నే నాతని కంటబడకుండ నిగూఢుడనగ నే చరించెదను

విశ్వామిత్ర రావణులు

(ఎవరికి వారే) నేను జూచుచున్నాను కాని యాతడు నన్ను జూచుట లేదు (ముందు చూచి) వసిష్ఠునితో గూడ నిద్దఱు నిటకే విచ్చేయుచున్నారు

(అంత వసిష్ఠుడు నలువురు కుమారులు ప్రవేశింతురు)

వసి కుమారులారా! దీర్ఘాయుష్యమస్తు

కఱచితి రెల్ల విద్యలను గంటిరి
వీరు యథాక్రమంబుగా
మఱపోక యింతలేక శ్రుత
మాత్రముచే గ్రహియించి యాత్మలన్
స్థిరపడునట్లు చేసికొని, పెంచెను
ధన్యత మదుపత్యమున్;

పరమ సుఖప్రదంబు లగు శాస్త్రముల
　　ఇచ్చెడు జ్ఞాన సంపదల్
దీపం బెట్టులు చేఁకు
దీపంబుల వెలుగజేయు తేజము సుమ్మా,

ఆ పగిదిని నస్మద్వి
ద్యా పరిణతి నా సమానులైతిరి మీరున్
మాదృశ పావనస్థి జన
　　మాన్యము శ్రేష్ఠము మీదు వంశము
శ్యాదృతి శాస్త్ర ధర్మముల
　　నంది జగజ్జన సౌఖ్యదాయులై
త్వాదృశ సద్గుణ ప్రచుర
　　తన్ వెలుగొందు ననాది నుండి యే
తాదృశ కీర్తి మీకు నగు
　　తన్, భువి వర్ధిలు రాజ్యలక్ష్మియున్

కుమారులు భగవానులను తమకడ చేరినది మొదలు మాకన్నియు శుభ పరంపరలే యగుచున్నవి ఇందు సంశయము లేదు ఇపుడు నగర బహిర్భాగమున కేగి మేము నేర్చిన రీతి ధనుర్వేద విద్యాభ్యాసము చేయ కుతూహల పడుచున్నాము తా మనుజ్ఞ యొసగుచో యథేచ్ఛము సాధన చేయుదుము

వసి నేడు పాడ్యమి కాన, అనధ్యాయము మీ యిష్టము వచ్చిన చోటికి కేగుడు నేనవధ్యాయ కరణీయముల నిర్వర్తింతును (నిష్క్రమించును)

రాము వత్సలారా! మనము పురమునకు దక్షిణముగా బోయి ధనుర్హస్తలాఘవము నేర్చిన రీతి జూపుకొందము

భర పార్శ్వచరులను పిలువనంపనా?

రాము వలదు.

నలువుర మున్న వారము, వనంబున
　　కేగగ భీతి చెంద ని
న్నలమును గాము, దూరగమనంబును
　　జేయము, చేతులందు చె
క్కులు శరముల్ వెలుంగగద! గుప్తముగా
　　భుజవీర్య విక్రమం
బులు పరికించు కొంట తగు, పొమ్మను
　　పార్శ్వచరాళి నిప్పుడే

శత్రు (తెరవంక జూచి) మనము చెప్పక పోయినను మనగమన మెఱింగి పార్శ్వానుచరులు మన వెంట వెంట వచ్చుచున్నారు

లక్ష్మ (తెర కెదురై) ఓ పార్శ్వచరులారా! మేము ధనుర్లాఘవ మభ్యసించుటకై వెళ్లుచున్నాము మీరు శ్రమపడి రావక్కఱ లేదు మీరు వచ్చిన దారినే వెనకకు బొండు

(అందరు నడతురు)

రాము (వెను దిరిగి చూచి) వీరు వెనుక కేగుట లేదు

లక్ష్మ మీరు వెనుకకు పోనిచో నేను బాణములు వేసి మిమ్ము వెనుకకు బంపుదును (విల్లు ఎక్కుపెట్టును)

రాము వత్సా! శాంతింపుము వీరు స్నిగ్ధ హృదయులగు సాత్త్వికులే దండనార్హులు కారు. (తెర కెదురై) అనుచరులారా! మీరు వచ్చినచో నాపై నొట్టు మరలి పొండు

భర : అందరు వెనుదిరిగి పోయినారు.

(అందరు మరల నడతురు.)

రాము ఇంకను నడచి యేమి లాభము? ఇక్కడనే మన ధానుష్కత నభ్యసింతము. (అందరు కూర్చుందురు)

శత్రు (లేచి)

అదిగో పిప్పలవృక్ష మందు
　　గల పత్త్రాళికా సమస్తంబు నా
పాదిలో నున్న నిషంగ మొక్కటి
　　యిదే పాల్పరగా నేగి భి
న్నదళీన్ బొందగజేసి తత్క్షణమె
　　చేరన్ వచ్చు స్వస్థానము
య్యది మీ రందఱు కన్గొనుండు
　　పరమాహ్లాదంబు రేకెత్తగన్

(బాణము విడచును)

రామ భరతలక్ష్మణులు శెబాస్ వత్సా శెబాస్

భర దీర్ఘాయుష్కుఁడు శస్త్రవిదుడు నగు శత్రుఘ్నుఁడు చేసినట్లే నేనింకొక వృక్షము నాకుల నట్లే చేసెదను (బాణము విడచును)

రాము శెబాస్ వత్సా! శెబాస్ నీ ధనుర్వేద కౌశలము చూచినారము

లక్ష్మ (విల్లెక్కిడి)

"అతని యస్త్రము వారింప నగును గోపి
యపుడు తెలియును నతని వీర్యప్రశస్తి
క్రీడయందున్న శయనించి నిద్రనున్న
సింహశౌర్యంబు తెలియునే శీఘ్రగతిని?"
(నిష్క్రమింతురు)

రాము: వత్సలారా! చూడుడు ఆ వృక్ష పత్రము లన్నిటి నొక్కమారుగా చిల్లులు పుచ్చెదను (బాణము విడిచి యాశ్చర్యముతో) ఏమి! గురితప్పి నా బాణము మార్గమధ్యమున రెండుముక్కలై పడిపోయినది!

శత్రు: అది ప్రాతబాణ మేమో?

లక్ష్మ: అది విరిగిన బాణమేమో?

భర: దారిలో సుడిగాలి కలదేమో?

రాము: కానిండు మరల బాణము విడెతును (శరము సంధించును)

విశ్వా: రావ (దూరమున ప్రవేశించి) ఏమి! ఈ రాముడు

"అమల శరాసనా జని
తామిత చండరవానలాత్ముడై
కమల దళోపమంబు లగు
కన్నుల నగ్నికణాళి రాల్చుచున్
శమము దొరంగి భీకర ద
శన్ గనుపట్టెడు సింహమట్లు లో
కములకు భీతిగొల్పు నధి
కంబుగ, వీని కసాధ్య మున్నదే?"

రాము: (మరల బాణము విడుచును)

అందఱు: మరల వట్టిదైనదే

రాము: అస్త్రరాజమగు వాయవ్యాస్త్రము ను సమంత్రకముగా విడిచి యా వృక్షమును వేళ్ళతో పెకలించి దూరముగా పారవైతును

విశ్వా: రావ (దూరముగా ప్రవేశించి) దీనిని గూడ భగ్నము చేయుదును

రాము: (బాణము విడుచును)

అందఱు: ఏమి? ఆ చెట్టు ఆకైనను గదలలేదే?

రాము:

"అరయ బాణప్రయోగ రహస్యములను
విశదముగను వాయవ్యాస్త్ర నిరుపమాన
నిపుణసంప్రయోగం బిది నిరసించె;
నస్మదీయ పరాక్రమ మరయ డింక"
(కోపముతో)

"అమితంబైన ప్రకాశమున్ గలుగు నీ
యాగ్నేయ దివ్యాస్త్రము
త్తమ భంగిన్ దరుసంతతిన్ క్షణములో
దగ్ధంబుగా జేయుతన్
విమలాస్త్రం బిటు చేయలేనిరీతులన్
విస్ఫోటనే నాదు దో
ర్మము భస్మంబొనరించి వైమత! నమో
ఘాస్త్రంబు సార్థంబుగన్"

రావ: (దూరముగా ప్రవేశించి, తనలో) ఆహా!

"ఒంటి జరించు సింహ శిశు
వు గ్రమృగాళికి భీతి హేతువౌ,
నొంటి పినాక పాణియును
హోగ్రగుడు సూర్యుడు తేజమూనిన
కుంట జగత్ప్రసిద్ధ, మటు
చొప్పగ నీతడు నాకు భీతియౌ,
దంట తనంబునన్ ధనువు
తా నిటు సజ్యము చేయుచుండగన్"

ఆగ్నేయాస్త్ర సంహారముసైతము నాకు జరిపి ఏదైనను నా ఉత్సాహముపోయి యేలనో భీతి జనించుచున్నది కావున, నే నిటనుండి వేగముగా బోవుదును ఆహా! రావణునకు భయపడుట యిదే మొదటిసారికదా! (నిష్క్రమించును)

విశ్వా: (దూరముగా ప్రవేశించి తనలో) ఆహా!

"పరబల మెంతయైన నను
బాయదు సాహస మెన్నడున్, మహో
గ్రతర సమంత్రపూత మగు
బాణము తీయగ భీతియౌను దా
శరథి, కలంచె మన్మనము
సౌమ్యుడు మూర్తిమంతుడైన స
చ్చరితుడు రామచంద్రుడని
శంకయు సద్భుతమూర్తి చూడగన్"

"అతి విఘాతుకములు పరాక్రమము లగుచు
గలవు వనముల మృగములు, కాని యందు

సింహ మెుక్కటియే వనసీమ నెల్ల
గలచి వైచును గాదె! విక్రమత మెఱయ"

అహో! నిఖిల దేవాసురబలతులితుడు, అదిగళిత నిఖిలభువన విదారణక్షముడు, మహాశైల విరూప మహాశక్తి ప్రభావుడు, విదితసర్వాస్త్రసంహారుడు నగు రావణుచే కుపితుడగు రాముని జూచి భయకంపితుడై మృగేంద్రుదర్శన మాత్రమున మృత్యుశంక జారిపోవు లేడివలె జారిపోయెనుగదా! ఈ దురాత్ముడు రథ మెక్కి లంకాపురి జేరువరకు నేను వీని ననుసరింతును లేనిచో నీతడెక్కడ నే యనిష్టము చేయునో (నిష్క్రమించును)

రాము (కొంతసేపు ధ్యానించి బాణము విడవ జూచును)

భర ఆర్యా! శాంతింపుము ఈ వృక్షములు దగ్ధమౌటవలన పక్షిగణములు నిరావాసములై బాధపడ గలవు

"విలునిలు బాణమేయకుము
నీ విద! పక్షిగణంబు లెల్ల వి
ప్పులవట మాశ్రయించి తమ
భార్యల బిడ్డల గూడియుండు, నం
చలములు లాఘవంబు లగు
సత్త్వము పక్షులదేహముల్, భవ
ద్బల విశిఖాస్త్రమీ నళిని
పాతము వానిక నీడు మిక్కిలిన్"

"శరణాగతరక్షణమును
పరకాలము తు త్రిధర్మపరములు నా, భ
కరవాళము వారింపుము
శరము నుపసంహరింపు చయ్యన నార్య!"

రాము : ఈ యస్త్రము సాపరాధము

భర : (ముందు చూచి) ఆర్యా!

"అపరాధాస్త్రం బదిరా ని
రపరాధం బగు సమంత్రమైనంతనె, నీ
కపగతమౌ స్త్రీవధ దో
షపరంపర, విడువకయ్య! శరము మహాత్మా!"

రాము (చూచి) ఓహో వారు మన ప్రాసాదచేటికలు ఓహో! మంథర కూడ (అంత చేటికలు మంథర ప్రవేశింతురు)

మంథ ఓసీ! దాస్య పరవశులు దాసులే యగుదురు మీరు మీ పనులు విడిచి యిట నిటు లాడుదురేల? మీరు వచ్చిన దారిని బొండు.

మధురిక మా పనులనుండి మమ్ము మరలింతు వేమి? మా చేటికలటున్నారు నేన చటకేగదను పనియైన పిదప బోవుదుము

మంథ ఏమే! ఏ పని కోస మెక్కడికి బోదువు? ఇది యొచ్చము ఇది నీచము వనక మీ రాణులు మీకెప్పుడు పనులే చెప్పుదురా?

చతురిక నీవును దాసివే మేము మా రాణుల పనులెట్లు చేయుదుమో కైకేయి పనులు నీవు నట్లు చేయుదువు

మంథర నేను కైకేయికి పుత్రికా సఖీ సమానను నేను సేవ చేయను సాయము చేయుదును మీరు గర్భదాసులిది రెఱుగరు

చతు ఏమే దాని దాని యని యన్ని మాటలు అందువేమే?

మంథ హౌనే మీరు నీవకురాండ్రే నన్ను మా రాణి తల్లిగా పరమ దైవతముగా జూతును

మధు నీవు దాసి పని చేయుచున్నను నిన్ను నీ రాణి తల్లిగా పరమ దైవతముగా జూచు చున్నచో మేము మా రాణులకు దల్లితో సమ నలమే

మంథ నేను సంస్కృతము మాటాడుదును

చతు నీవు సంస్కృతము మాటాడినను నీయ వినయము, ఆత్మస్తుతి నీదాసీత్వమును తెప్పక చెప్పు చున్నవి గొప్పవారెప్పుడును దమ్ము దాము పొగడు కొనరు

మంథ మీ రిక్కడ నుండి లేచి పొండు మిమ్ము నే నాజ్ఞాపించుచున్నాను

అందఱు (నవ్వి) ఏమి దానికి గూడ నాజ్ఞాపింప నధికారమేమి?

మంథ (తనలో) ఈ గర్భదాసులు నన్ను అవమానించినారు నా యవమానము కైకేయి యవమానమే భరతుడు దగ్గఱలోనే యున్నాడు ఏమి లాభము? అతడెప్పుడు రాముని యనుసరించుచు జెత కాని వాడగుచున్నాడు ఇట్టివాని నెక్కడను జూడలేదు. (ప్రకాశముగా) నేను వెళ్లి మీ యవినయము మా దేవితో జెప్పి యేమి చేయింతునో చూడుడు (నిష్క్రమించును)

భరు సురూపమునకు దగినట్లు కుటిల భావము కల మంథర పోయినది ఆమె సురూపిణి యని యామె యనుకొనరు ఈమె నిజముగా వందకత్తెయే యైన నేమి చేయుదు! మనోరికా! గౌరీ మంటపము కడ నున్న పిప్పల వృక్షముల యాకులను గోసి కొంచును రా!

పుష్పలతిక (పైకి చూచి) దీని యాకు లన్నియు జిల్లులు పడినవే! ఎందు చేతనో (అందఱు నాశ్చర్యముతో జూతురు)

భరు (భూమిపై జూచి) ఇక్కడ జాల గాలి గుర్తులు కలవు గుఱ్ఱపు డెక్కల గుర్తులు రథ చక్రముల గుర్తులు కలవు

మనో రథములో గుమారు లిటకు వచ్చి ర కొందును

భరు ఈ గుర్తులే కాని రథము వచ్చినట్లిన జాడ లేదే!

మనో (భయముతో) ఏదో భూతము వచ్చినట్లున్నది బాబో! పోదము రండు (నిష్క్రమింతురు)

భర భయపడి చేటికలు పరుగెత్తుచున్నా రేలనో!

శత్రు అక్కడే సూర్యనియస్త్రము చిక్కి పోయినది

రాము ఎవడో మఱుగుపడి యట నుండియుండ వచ్చు యోగప్రభావముచే మాయాశక్తివలన నదృశ్యముగా నుండవచ్చునని వింటిని యోగులు మోస కారులు కారు మఱి నాయస్త్ర మిట్లు అదృశ్యమైనది? ఎవడో మాయ చేసినాడు సరే నా యస్త్ర కౌశల మాతనికి దెలియగలదు. అదృశ్యుడై యున్నా వేల? ఓ యదృశ్యుడా?

"కనబడకుండగ బాణము
గొనియుండెదవి క్షణములోన గొనితేవలెన్
అనుమాన మేల? క్రక్కుం
గున రక్తము పాఱ కౌదు దుష్టాత్మకుడా!"

(బాణము సంధించును) (దూరమున వసిష్ఠుడు ప్రవేశించును)

భర (చూచి) అయ్యో! ప్రమాదము భగవానులు అర్యగురుపాదులే నీ బాణమునకు లక్ష్యముగా వచ్చినారు. బాణ ముపసంహరింపుము.

రాము (బాణ ముపసంహరించి) ఏరీ గురువులు? యోగప్రభావ పిహితదేహులై నా చిత్ర్య జూచియుందురు వీరివలననే నాయస్త్రము చిక్కిపోయి యుండును పూజార్హులగు వీరు నా బాణమునకు లక్ష్యమైరి ఇది తెలియక నేను దోష మొనర్చితిని

"శరముల నిచ్చెడి సద్గురు
చరణంబుల నిలిపి పరమ సంభావ్యముగా
శరణంచు క్షమాభిక్షము
త్వరగా గోరుదను పరమసన్మూల గురులన్"

అందఱు రండు (వసిష్ఠుని పాదములపై బడి)

"పసులునవో విగ్గులునవో
భగవానుడ గతిచేయు బాలుర మమ్మున్
అగణితము నీ కృపకే
ముగదా భాజనుల మేము జగద్వంద్యా!"

"సుతులు శిష్యులు నపరాధ కృతము చేయ
గురులు క్షమియింత్రు వాత్సల్య పరవశులయి
బాలరము మేము తెలియక పొరబడిన
దోషమును విస్మరింపుడు సంతోష మొదవ"

వసి ఇదియేమి? విపరీతము లేదు నాకు గోపమేల? దీర్ఘాయుష్కులారా! లెండు

రాము మహాశిలనైన పిండిపిండి చేయగల నా బాణము తెలియక వృద్ధులగు తమపై వేయ జూచితిని తప్పు క్షమింపుడు

వసి నీవు శస్త్రాస్త్రజ్ఞులలో బాలుడవే యైయుండవచ్చును గాని,

"నేను నీయంత బాలుడ నైనయప్పుడు
నింతకంటెను దివ్యాస్త్రమేసి దొల్లి
కౌశికుండను మహాక్రోధకారణమున
గాని యది నాకు నెట్టివికార మీదు"

"కవదం డొకటి శమంబె బ్రాహ్మణునకున్
గాపాడు బ్రహ్మకౌశిక
ప్రవిఘాతంబుల నారిసుండి, భయమా
వంతైన లేదందుచే
భవదీయాస్త్రమునన్, దలంప యముకున్
బ్రహ్మత్వయోగీంద్రు నే
ర విషాదంబున నారిపోవు నన న
స్త్రంబేమి చేయంగలున్?"

అందుచే నన్ను ఉపేక్షించి నీవు బాణము విడిచి యున్నను నాకు దగిలియుండును వలసిన చేసి చూడుము నీ కేభయమును లేదు

రాము (నమస్కరించి)
"గురువులు భగవానులు బుషి
వరులును ద్రష్టలును గరుణ శారంగకులున్
స్వ క్షరణార్థులు నిత్యము నే
శరణము మిము చేయ గొప్పను సంభవమగునే ?"

భరత భగవానులు వాకే మంగళ మొసంగగోరి యిటు లనుగ్రహించి విచ్చేసినారో గదా

వసి : నేను వనసంచార కుతూహలమున నిటకు వచ్చి యీ ప్రాంతమున నొకకమండలు వుండుట చూచి యట గూర్చుంటిని ఇదప నది విశ్వామిత్రుని దని తెలిసికొంటిని

రాము ఏమి! విశ్వామిత్రులు కూడ నం నున్నారా ?

వసి ఆయన రావణునితో వచ్చియుండెను

రాము విశ్వామిత్రులను జూచుటవలన నేను గన్నుల మగొ్వ్యదము ఏలన, నింతవఱకు మీమాయన యాశీర్వచనముకాని యభినందనములను గాని యందలేదు రావణునకు వచ్చె నని వింటిమి అతడు మహాబలు డనియు సురాసుర జయవర్చస్వి, సర్వవిద్యా పారదృశ్వ డనియు వింటిమి. కాని, కేవల మగ్ర లోపకుడట

వసి రావణునకు వత్సలుగా కవిష్టము చేయుటకే వచ్చినాను అతని రక్షముతో నాతడు తిరస్కరణీవిద్యవలన నిగూఢముగా నుండెను విశ్వామిత్రుడు కూడ నీ ప్రభావము విని చూచినప్పుడు అతడును రావణునందంత మెలంగుటకు యోగప్రభావముచే నిగూఢుడయిరే వచ్చెను

రాము తరువాత ? తరువాత ?

వసి . రావణుడు మిమ్ము జూచి వచ్చినదారినే వెనుదిరిగెను ఆ పాపి దారిలో నేమైన పాపకృత్య మొనరించునేమోయని తపో వనాంతము దాక విశ్వామిత్రు డాతని ననుసరించెను ఈ సంగతి మీకు చెప్పుటకే నేనిటు వచ్చితిని

రాము ఐన విశ్వామిత్రులను మేము చూచెద మన్న మాట

వసి ఆ. నేను మీకు చెప్పినట్లు వినయ వినయములతో నాతని మనస్సున కెక్కునట్లు బుషి పాద స్పర్శ పురస్సరముగా నమస్కరింపుడు

రాము ఆయన క్షత్రియుడని వింటిమి

వసి ఐన నేమి?

రాము బ్రాహ్మణ చరణములవలె క్షత్రియ చరణములను మా శిరములకు దగుల నిత్తురా?

వసి : అతడు తపోమహత్త్వమున

రాము తపమే బ్రాహ్మణత్వ హేతువా?
తపము వ్రతమును గులము నీతియును గూడి
యున బ్రాహ్మణ కారణ మందు రట్టి
త్రయము నందు నాతనికి బ్రాజ్యతము నటించు
బలిమి గలుగంచి కొన పెద్దలు తలంచి

వసి ఆ మాట సామాన్య తపో విషయమున మహాతప ఫలమునకు సామాన్య మున్నది విశేష-విష యము

రాము ఐన

వసి : తప ప్రభావ మొక్కటే కాదు విశ్వామిత్రుకు తండ్రి తాతలు బుషిత్వము బ్రహ్మత్వము కూడ నందిరి

భరత అతడు బ్రాహ్మణుడో యబ్రాహ్మణుడో మనకేల? గురువుల యాదేశమే మనకు శిరోధార్యము అతడు క్షత్రియుడా? వయసునందే విద్యచే తపముచే మన కగ్గుడా యనగ్గుడా? యన్న విచారము మనకేల?

రాము ఔను గురువాక్యము శరణమే మన కర్తవ్యము

అందఱు గురువులకేది యిష్టమో మనకు నదియే (నిష్క్రమింతురు)

మంథర : (ప్రవేశించి) కపట పండితుడగు వసిష్ఠుని సంగతి కంటిని వింటిని అది చెప్పను రామునితో నేనే మాటాడును గాని భరతుని లక్ష్యపెట్టడు పరిజనులు, దాసులు, నందఱు రాము మరల ఇప్పుడే రావణుడు వచ్చినట్లు చెప్పుచున్నారు. వాని పనులు చాల నకార్య జాతివట అతడు ప్రతి రఘుడట. వృద్ధుడగు రాజు రామునికే రాజ్యమీయ దలచుటయు వింటిని రావణుడు రామ విరోధియై యాతనిని జంపి వేయుచో నిక భరతుడే నిష్కంటకముగా రాజ్యమేల గలడు.

ఆహా! నా భర్తృదారిక యగు కైకేయి! నైతము రాము డన్నచో యిష్టము భరతుని కా రాజ్యము రానిచో నా పేరు మంథర కాదు అనార్యులు, అసురులు, పిశాచములు—వీరిని రామునికి శత్రువులుగా జేసి నేను భరతుని మహారాజును జేయుదును వృద్ధవశిష్ఠుడు కాని కపట సుమంత్రుడు గాని యేమిచేయగలరో చూచెదను అమ్మో! సుమంత్రుడు వచ్చుచున్నాడు (నిష్క్రమించును)

సుమం (ప్రవేశించి) ఇపుడు విశ్వామిత్ర మహర్షి వచ్చెను మరల వచ్చుగా, రావణుడు వచ్చి పోయినాడు తన యాతిథ్యము గైకొనకే యేల రావణుడు వెడలిపోయెనో యని మహారాజు ఖేదపడుచున్నాడు క్షత్రియ వైరి యాతడు వచ్చుటేమి? ఆతిథ్య మిచ్చుటేమి?

"తరుమూలంబున వాడి గొడ్డలిని నీ
తన్ దైచి ఖండింపగా
దొరకొన్నట్టి విరోధిన్ బరమ సం
తోషంబుతో నీడని
చ్చి రుచిన్ మించెడి పండ్లొసంగి మహీయున్
కెంపారు పుష్పంబులన్
గరుణామేయత నిచ్చు వృక్షము గతిన్
ప్పట్టు నీ తండ్రిటన్
(తెర లో)
ఇపుడు రావణు నిచటికి నేనుజంపు
నన్న సంగతి విని రాజు లనెలు చుంద్రి
రాత్రులందు బరంబు సంరక్షణంబు
నప్రమత్తత రక్షకు లరయ వలయు

సుమం (విని) పరి నేను రక్షకులకిది తెలుప వేగదను. (నిష్క్రమించును)

(గంధర్వులు ప్రవేశింతురు)

గంధ

రాముం డప్రతి వీరుడంచు దలిచెన్
రామాస్త్ర జాలంబులన్
శ్రీయాష్యుండగు కౌశికర్షి, దప
శ్శ్రీకుంఠితం బన్న సు
త్రాముండున్ భయమందు, నాతని శర
వ్రాతంబుచే రాముడే
దో మార్గంబున రావణున్ దునుము నిం
ద్రుండింక దోషింపగన్.

రాముడే బలుపెగు వీరుడు
రాముడు సర్వాస్త్ర శస్త్ర రాశిధరుం
డా మహనీయుడే చంపును
దాముదమున రావణాది దనుజాల నెల్లన్

(నిష్క్రమింతురు)

ఇది తృతీయాంకము

ప్రవేశిక!

(ప్రవేశము నలుగురు వైతాళికులు ప్రాసాదముపై)

మొదటివాడు ఓరీ! భవకా! కటుకంఠా! నే నీగీతము నాగీతము చాలపాడ్గనిన్నాను నీవు విను నీగీతము బుర్కవేణు శబ్దమురా

రెండవవాడు ఓరీ! మాళవకా! విను నీ స్వరము గార్దభస్వరమురా

మూడవవాడు మీ యిరువురకు గీతమన్న నేమిన్నా తెలియదు వాద్యములతో గూడిన నాగీతము మీరు వినుండు

నాలుగవవాడు నేను సంస్కృత గీతము పాడుదును మీకు సంస్కృతము రాదు అది చాల బాగుగా నుండును ఒక్కసారి నాగీతము విన్న రాజు మరల మీగీతము వినడు అదే నా గీతజ్ఞత.

మాళవకుడు: భావ! గోపిలుడు సంస్కృతమున జదువునట అది యెవరికి గావలయు? మహారాజు నాగీతము విన్నచో యిక మీగీతము వినడు

భవకుడు: నే నిపుడు ప్రత్యూషకాల మగుటచే మహారాజును లేపుట కేగుదును గోపిలుడు పాడుట కనుమతి లేదు

మాళ ఓరీ! నీగీతము విన్న మహారాజునకు నిద్ర పారిపోవునురా. అంతే కాదు. భృత్యులందఱు కూడ భయపడి పరుగెత్తుదురు

దంతిలుడు భావ! గోపిలుని వాద్యము లేక నీగీతము మహారా జెట్లు వినును? నేను నావాద్యమును వాయింతును

గోపి నా వాద్యము లేకయా? సమయము వచ్చినపుడు చెప్పెదనులే

విదూషకుడు: (ప్రవేశించి) మీ రిక్కడ నేమి చేయుచున్నారు?

గోపి : సుందరశా! స్వాగతము విశ్వామిత్ర మహర్షి వచ్చినాడు. మన మతని జూడవలయు

విదూ : ఇప్పుడు

గోపి ప్రతిదినము మహారాజు ప్రాసాదమునకు ఋషులు వచ్చుచునే యుందురుగదా! మఱి విశ్వామిత్రునిపై రాజున కింత పక్షపాత మేల?

విదూ ఆయనకు రెండు ముఖములు, నాలుగు చేతులు, నీవు లేదు రెండుప్రక్కల ముఖమే కన బడును

గోపి ఐన రెండు కింత గౌరవము?

విదూ : ఓరీ! ఆయన బ్రాహ్మణుడు క్షత్రియుడు రాజఋషి అక్షమాలాధారి ధనుర్ధరుడు ముందువెనుకలు చూడగలడు ఉభయతో ముఖు డగుటకన్న నేమికావలయునురా?

గోపి ఆ రెండు ముఖములతో నాయన యేమి చేయును?

విదూ ఒకదానితో వేదము పఠించును రెండవదానితో శాపము లిచ్చును

గోపి : నాలుగుచేతులతో నేమి చేయును?

విదూ రెండిటితో బ్రహ్మకర్మ రెండిటితో యుద్ధకర్మ

గోపి కేవల నారాయణునికె నాలుగుచేతు లుండు నని చెప్పుదురు.

విదూ భగవంతు డగు నారాయణునకు నాలుగుచేతులు ఒకముఖము. ఈయనకు రెండు ముఖములు రెండుప్రక్కల రెండురెండు చేతులు

గోపి ఆయనను నీవు చూచితివా?

విదూ : ఓరీ మూర్ఖా! నేనేమి చూడవలెనటరా? విన్నది ఎప్పుడు చూచినదానికంటె విన్నదే యెక్కువ ప్రమాణము

గోపి ప్రత్యక్షముగా జూచినవారే చూచి నట్లు లెక్క.

విదూ : ఓరీ! మూర్ఖా! కన్నులకు బొంగ్రమిచ్చిన జాడ లక్ష్యము గాదు చెవులకు బొంగ్రమ్మదు కదా?

గోపి : సరే నీవు విశ్వామిత్రులగూర్చి విన్నావు. నే నిపుడే చూచెదను.

విదూ : నీవు జాగ్రత్తగా జూచి చూచినది చూచినట్లు నాతో జెప్పు

గోపి నీ విక్కడనే కూర్చుండుము ఆయనరే స్వయముగా నిన్ను జూచును లేదా! రమ్ము స్వయముగా జూతువుగాని.

విదూ అబ్బో! నే నాయనను జూడలేను ఆయనకు కోప మెక్కువట ఏమో! ఆయన దండ కాష్ఠములతో నాబుఱ్ఱ పగులగొట్టగలడు దూరమున నుండియే చూచెదను (తెరలో)

"మును శస్త్రంబులచే జగంబు గలిచెన్,
బూర్ణుండు సత్త్వంబులో
నను, నిత్యంబు భయంబు రెండుగ నితం
డన్న న్ మహేంద్రుండు, జే
కొనె బ్రహ్మత్వము క్షత్రియత్వమును వా
కోరాని తేజంబు, ని
మ్మని మూర్ధన్యుడు, గౌరవింపు డితనిన్
బూజ్యుండు లోకాళికిన్"

అందఱు విశ్వామిత్రులు వచ్చినారు రండు పోదము

(నిష్క్రమింతురు)

(ఇది ప్రవేశక)

## చతుర్థాంకము

(ఆసనస్థుడై విశ్వామిత్రుడు ప్రవేశించును)

విశ్వా

క్రతురక్షణ మనియెడునొక
కృతిక ప్రహితుపున రాము నిమ్మని రాజున్
బతిమాలెద నాయస్త్రము
లతిపాత్రుడ కతని కిచ్చి యానందింతున్

సుమంత్రుడు (ప్రవేశించి) భగవానులకు నమస్కారములు

విశ్వా యశోవంతుడ వౌదువుగాక!

సుమం భగవానుడా! నీయాశీర్వచనమున కృతకృత్యుడైన మహారాజిదే యిటకు విచ్చేయు చున్నాడు.

విశ్వా : సరే మహారాజాగమనము పాటింతుము.

(మహారాజు, వశిష్ఠుడు, కుమారులు, విదూషకుడు, ఇతరులు ప్రవేశము)

రాజు సావిత్రీస్రష్టలు, తపోధనులు, మహామహులు నగు విశ్వామిత్రులకు దశరథు డిదే నమస్కరించుచున్నాడు (నమస్కరించును)

విశ్వా (లేచి) అనామయ మగు యశస్సు లభించుగాక!

రాజు భగవానుడా! కూర్చుండియే యాశీర్వర్షము కురిపింపుడు

విశ్వా
పరుసుడై సత్వపాలకత్వములు నీకు
కలవు నిత్యము రాజత్వవర్తనంబు,
ఏల నిలుచుండరాదు నీపాల నేను
నీసభావిజయముగోర చెలిసఖుండ!

రాజు
తాము నిలుచుంట మా కుచితంబు గాదు
ప్రభులు తాము శాసింపగా భటులము మేము,
తాము నిలుచున్న జగములు తథ్యముగను
నిలిచియే యుండును స్వకర్మనిష్ఠ లుడిగి
కూర్చుండుడు

విశ్వా (వసిష్ఠులతో) మహర్షీ! నమస్తే

వసి
తపమున బ్రహ్మత్వము గో
న్న పరమఋషివి లభించె ననంతమహత్త్వం
బపుడే నీ కిక చేయుదు
కృపగొను ప్రతివందనంబు కృతకృత్యుడనై
కూర్చుండను (కూర్చుందురు)

కుమారులు పవిత్రులు భగవానులు నగు తమ కిదే వందనము చేయుచున్నాము

(పాదములు ముట్టి విశ్వామిత్రునకు నమస్కరింతురు)

విశ్వా : అప్రతిరథులు, దీర్ఘాయుష్కులు, లోకప్రణయభాజులు పొందుదురుగాక! అందఱకు భద్రమగుగాక! కూర్చుండుడు

(అందఱు కూర్చుందురు.)

రాజు తమ తపఃక్రియ కేయాతంకములు లేక జరుగుచున్నవి కదా!

విశ్వా
ధర్మపరు లౌచు వారలు తనరుచుండ
నెటులు సుఖవంతు లౌదురో నృపులు నటులె
విఘ్నములు మాకు బొడమనివిధము కలుగ
క్షేమ మగు మాకు మాతపఃక్రియలు సాగు

వసి
పరమనృపులు స్వధర్మంబు చాటిసేయ
సౌఖ్యమబ్బుట ఋషుల, కాశ్చర్యమగునె!
చమురు కలుగుట గాలి వీసమ్ము లేమి
దీప మారక వెలుగదే దీప్తముగను!

విశ్వా (సగర్వముగా)
కరుణ వహించి రాజ్యము ల
కంటక మౌనటు చూచుచుందు మీ
సురపతి మున్నుగా గలుగు
సూరులకైనను, రాజచంద్రులన్
బరమసహాయసంపద ను
పాయము చేతను బ్రోచుచుందు; మీ
కరణి నొనర్చుచున్న ఫల
కారిగ జాడము సత్తపఃక్రియన్.

(ఆలోచించి తనలో) ఇది నా కోరికకు విరుద్ధ మగుమాటకదా! ఇట్లందును

(ప్రకాశముగా)
అఖిలమగు తపోవిఘ్నమ్ము లకల ద్రోలు
నిన్ను నొక్కటి యాచింత సేయ నేడు.

రాజు
ఆజ్ఞసేయుడు మీయాజ్ఞ ననుసరింతు
బరమమౌనుల పాదసేవకుడ గాన.

విశ్వా (వశిష్ఠునితో) భగవానుడా! అనంత బ్రహ్మకురా! ఈ దాశరథులు నలువురు యథావిధి నీచే నుపనీతులైరా?

వసి ఆఁ

విశ్వా వీ రేయే శాస్త్ర శస్త్రముల నభ్యసించిరి?

వసి : శాస్త్రము లన్నియు

విశ్వా ఏయే శాస్త్రములు?

వసి. మంత్రద్రష్టృత్వము తక్క నన్నివిద్యలలో వీరు నిష్ణాతులు.

మథన మొనరించినన్ గాని దధిని గాదు
శ్రేష్ఠమైనట్టి నవనీతసిద్ధి, యటులె
ప్రతత మనుభవము లేనిచో విరయు యశము
నదియు నృపులకు గాదు సహాయకారి

విదూ : నాకు మరల దధి కావలయును దధి తిన్న ఘృతము తిన్నట్లే కదా!

రాము

వస్తువున కెన్ని ద్రవ్యరూపములు గలుగు,
వాక్యపదముల కుత్తము భావములను,
గురులతో మైత్రి వాదంబు నెరపవలెను
అటులనే శాస్త్రము ప్రకాశ మందగాంచు

మఱియు

చెట్టునాకుల బలియింప జేయగలము
శిలల ముక్కలుగ బొడిపొడి జేయగలము,
అస్త్రశస్త్రములన్ వృక్షుల నుద్ధ,
యిది యొనర్పంగ ననుభవ మెసగు మాకు

విశ్వా

వినయ విస్పష్ట తథిక విలసితములు
మీరు పలికిన పలుకులు మిమ్ము జూ
తెలియు మీకున్న శస్త్రాస్త్ర దివ్యశక్తి
సంశయము లేదు నాకయ్యె సంతసంబు

ఈ యభ్యాసపద్ధతి యెచ్చటను లేదు అస్త్రముల నెట్లు గపిల్పగల మీ ఘనత్వత నిజముగా ప్రశంసాతీతము.

విదూ: చెట్టుఆకులు కదలిన నేమి లాభము? ఎండిపోయిన చెట్టు కొమ్మలు విరిగినను ప్రొయ్యి లోనికైన వచ్చును వంటచెఱకునకు చాల ఖర్చుగా నున్నది కూడ

రాజు: విశ్వామిత్ర ఋషీ? వారల కిది చెప్పలేదు నేను వీరి నపుడపుడు వేటకు గూడ గొనిపోవు చుందును

విశ్వా: వనములందలి కేసరి, గజ, మహిషాదు లగు మృగములు రాజుల కేమి యపకారము చేయును?

రాజు: అవి యాత్రులను సస్యములను హింసించును

విశ్వా: అవి బలిష్ఠములై ధర్మ ప్రజాపీడ కల్గించిన దండింపదగినవే కాని, శస్త్రాస్త్రములతో జంపదగినవి కావు ప్రకృతి జనులను పీడించుచు ధర్మలోపమును గల్గించు మహాబలవంతులగు రాక్షసు లనే శస్త్రాస్త్రములతో జంపవలయును. నీతో గూడ వీరి నడవికి దీసికొనిపోవుటవలన వీరికి యుద్ధక్రియ లెట్లు తెలియును?

రాజు: బలవంతము లగు మృగములను దగ్గరకు రప్పించి వానిని వీరిచే జంపించి వీరి నిపుణత నరయు చుందును

విశ్వా: సరేకాని, పాపాత్ములగు రాక్షసుల జూచి యూరకుంట తగదు

రాజు: గ్రామవాసులు కృషీవలులు, గోపాలురు, వణిజులు, సార్థవాహులు నెవ్వరును రాక్షస పీడనుండి కాపాడ నన్ను గోరలేదు

విశ్వా: అసురులు ధనలుబ్ధులు కారు అందుచే కృషీవలులజోలికి వణిజులజోలికి రారు తపోవనము లందు యజ్ఞములు చేయు తాపసులకు విఘ్నములు కలిగింతురు

రాజు: ఋషులు కాని తపస్వులు కాని న న్నీ సాహాయ్యము చేయుమని కోరనే లేదు

విశ్వా: ఋషులు తపస్వులు స్వతపోరక్షణకై క్షత్రియ సాహాయ్యమును యాచింపరు.

రాజు: నన్నెవరును గోరకుండగనే నాకు తెలియని శత్రువుల నెట్లు రూపుమాపుదును?

విశ్వా

"ఎవ్వరు కోరగా దమము
నెప్పుడు బాలగ్రహాలు సూర్యుడి
నెవ్వరు కోర వాయువు వది
యెల్లడ వీచు జగంబులోన? జ
న్నెవ్వరు కోర శేషుడు మహీత
లపై నిలువుట? దలంపగా
నవ్విధి రాజు పాపుల నయాచిత
భంగి నణంపగా దగున్"

రాజు: పాపులను శాపముచే ఋషు లేల నివారించుకొనరాదు?

విశ్వా: శపించుటవలన పుణ్యము క్షీణించును అందుచే తాపసు లెప్పుడును శపింపరు

"శాప మసహ్యపాపజన సం
తత జాతక తోగ్రదండమా;

తాపసవృత్తిలో మెలగు
ధన్యుల కయ్యది సర్వమున్, జనా
రోపితకోప మయ్యది, యె
ఱుంగ, ఫలం బెది తాపసీనను
స్థాపితకీర్తి శౌర్యగుణసంపద
లింక ? తెలుంగ జెప్పుమా !

రాజు సంతోషము నాక ర్థమ్యమేమో తామే సెలవీయుడు

విశ్వా సరే ! ఒకసారి రెండు చెప్పుచున్నాను.

రాజు ఏ వవి ?

విశ్వా గుణహారుడవయోజ్యేష్ఠుడు నీ కుమారుడగు రాముడకు దివ్యాస్త్రములనుపదేశించితివా ?

రాజు నా నేర్చిన దివ్యాస్త్రము లన్నియు కుమారులకొసంగితిని రాముడవి యన్నియు జక్కగా ప్రయోగింపగలడు నాకు రెండస్త్రములే తెలియనివి

విశ్వా ఏవవి ?

రాజు జృంభకాస్త్రము, బ్రహ్మాస్త్రము

విశ్వా బ్రహ్మాస్త్రవిదు లొక్క వసిష్ఠ భగవానుడే

వని నేను సర్వాస్త్రసంహారము చేయగలను గాని యేయలేను

విశ్వా అవి రెండు నెఱిగియే నేను బ్రహ్మత్వమందినాను

రాజు జృంభకాస్త్రములుకూడ దమకు దెలియునా ?

విశ్వా చక్కగా

రాజు అగుచో గొంతకాలము తా మిటనుండి కుమారుల కవి నేర్ప నర్థించుచున్నాను

విశ్వా అది యర్థములేని మాట

రాజు ఏల ?

విశ్వా

"అర్థి యరుదెంచు దాల గృహంబునకును
దాత యరుదేడు వెంట నాతనిని గోర,
దప్పి చెందినవాడె వెదకును సరము
సరము వెదకదు తృషితుడౌ నరుని మరల.

రాజు నా గృహమంతయు దమదే తమకు నేను నమస్కరించినప్పుడే నా యీ సర్వస్వము తమ యధీన మయ్యెను తా మిటనే యుండి నన్ననుగ్రహింప గోరుదును

విశ్వా రాజగృహంబు నానా వ్యవహారాకులము భోగభాగ్యములను విడిచి వన్యఫలాశనులము, వ్రతపరంపరావితులము, బ్రహ్మవిచారనిహిత మనస్కులము నగు మావంటివారికి మరల నిటనుండ నేల తలంపు కలుగును ? గృహస్థుని యావాసము వివిధ వ్యాపారనిలయము బ్రహ్మపరులక్రియలకు నేకాంతవాసమునకు యోగ్యముకాదు పర్ణశాలలయందే నిర్జనముగా వసించు తాపసులకవె గృహస్థులు వచ్చియుండెగలరా ? తాపసులు రాజసంపదలను ముట్టనొల్లరు

రాజు తమ చిత్తము నేను పరిహాసమున కనలేదు

"నేను సువృత్తి భృత్య పరి
నిష్ఠిత మంత్రిబలంబుగా సుఖా
సీన సుసౌఖ్యవాహన మ
హోత్తమ కోశ, నాదికంబుతో
మానిత మామకీన మణి
మండిత కేళి వనాదికంబుతో
మీ నుత పాదపద్మముల
మెప్పుగ చేసెద దాసకర్మలన్"

విశ్వా రుద్రస్వేదము, మునిమనము, వీరపాణి, రామారుచి, బలవిత్తాది సంపదలు నన్ను బంధింపజాలవు

వని ముక్తిపరుల కివి యేవియు బంధము నొసంగజాలవు ఏలన, గంధాశ్మము, రుద్రస్వేదమునకు విలువడు భక్తిచే మునిమనస్సును రంజింప జేయవచ్చును నమస్కారముచె వీరపాణి సంతసించును దాక్షిణ్యము చూపినచో రమణీసౌందర్యము బాధింపజాలదు

విశ్వా ప్రాకృతులగుజనులు ప్రాసాదవాసులలో గుణము గణింపరు ఇంతకు దేశకాలపాత్రములే వస్తుగుణనిదానహేతువులు ఎట్లన,

"సరసున సరోజతతి వికాసంబు గాంచు
మలయ పర్వతమందున వెలయు జంద

వంబు, వస్తువు లట్లు స్థానమును బట్టి
వర్తిలుచునుండు, వరియించి వ్యత్యయమున"

మఱియు
"చెట్టు చిగిరించు మధుమాసవృద్ధితోడ
నమలి నర్తించు వర్షర్తునం గడంగి
హంస శరదాగమమున గూయంబోడంగు
గాలమున సర్వమున్ సుసంకలితము లగు

రాజా కుమారుల కీ శస్త్రాస్త్రములు తెలియవు గాన, వారు నాకంటె నధికులు కావలయును. అందుచే నవి తామిటనుండి వారికి నేర్పవలయును

విశ్వా నీ వట్లుడుగకూడదు

రాజు ఏల?

విశ్వా నాయాచన మోఘమగు పక్షమున నిన్నెమియు నడుగను

రాజు
"సకలచరాచరంబును వ
శం బొనరింతును విరోధి వంగు నా
కిక వలదేమియుఁగా మరల
కన్నకు దమ్ముకుఁగా యశ్వచ్ఛమై
సుకృతులు కై కొనందగును,
జాపభవాద్భుత ఉత్తమోత్తముల్
సకరుణ నేడి కోరినను
స్వామి! శంకింపక యుండ నాంతునే!

విశ్వా నేను నిన్నేమి కోరుదునో యది తీసి కొని వెంటనే వనమున కేగుదును

రాము అజ్ఞాపింపుడు

విశ్వా రాముని యాచింతును

రాజు ఎందు కొఱకు?

విశ్వా ఈయదలచినవారిచ్చెడు దాని ఫలము పుచ్చుకొనువారి నడుగరాదు

రాజు చెప్పుడు, ధనాదులకా?

విశ్వా మాదృశులగు ఋషులు ధనాదులు కోరరు.

రాజు. రాముడు నా ప్రాణముకదా?

విశ్వా ఐతనేమి? మహాత్ము లడిగినవారికి ప్రాణ మీయరా?

రాజు రామునితో నేనును వచ్చెదను

విశ్వా నీ విచ్చినది మరల నిట్లు నిషేధింప జాతువా?

రాజు
"కారణము లేకయే రాము గావనమున
కంపి తమతోడ నే నెట్లు లకట! గృహము
నందు నివసింతు ముసలినై యక్కటకట!
జీవితము నెట్లు నిల్పుదు చెప్పుము ప్రభు?

విశ్వా కారణము లేకయే యని యనుట పాడి గాదు.

రాజు కారణమేదో చెప్పుడు

విశ్వా పదిదినములలో బూర్తియగు యజ్ఞమొకటి నేను చేయుచున్నాను

వసి ఈకాలమున యజ్ఞమేమి?

విశ్వా
"యజ్ఞదాన తపంబుల ననవరతము
చేయుటకును సర్వ వేళ్లరు శీఘ్రగతిని,
ఎపుడు చేయగ దలతురు, నెపుడు కాంతి,
యపుడె తలపోయవలయు యజ్ఞావసరము
ఆ నా యజ్ఞము శస్త్రాస్త్రజ్ఞసాహాయ్యము లేనిది విజయవంతము కాదు సర్వశస్త్రాస్త్రవిదుడగు రాముడే యజ్ఞము నిర్విఘ్నము గావింపగలడు

రాజు విఘ్నము లెట్లు కలుగును?

విశ్వా మారీచ సుబాహు ప్రముఖులగు రాక్షసులవలన.

రాజు నేను సైన్యసహితుడనై వచ్చి వారిని సంహరింతును

విశ్వా రాముడు తక్క నొరు లందులకు సమర్థులు కారు

రాజు
"రాక్షసులు నిర్దయులు బలరాజితులును
రాముని పదంబు లెద మృదురమ్యము లగు
నెటులు రక్షించు యజ్ఞంబు నింక తెందు
వనజము వనాగ్ని నార్పగా వలతిరొ ప్రభు?"

విశ్వా.
"బాలార్కుండు త్రిలోక సంవృతతమో
ధ్వంసంబు గావింపగా
జాలుం గాదె? వనిన్ మృగావళికి దా
పంబీయదే సింహారం

# "మహాప్రస్థానము"



శ్రీ పొట్లపల్లి సీతారామారావు

"కవితేవహి జానాతి కవేః కావ్యపరిశ్రమమ్" అన్నాడొక యాలంకారికుడు. కవి కావ్య పరిశ్రమములోని చిక్కులు కవికే తెలియునట. అందుకే విమర్శకుని బుద్ధి కవిప్రతిభవెంట ప్రసరించి తద్గతమైన శిల్పమును విప్పిచెప్పవలెను. అంతేగాని మూలసూత్రమునకే యెసరుపెట్టకూడదు. కవి యదభిముఖముగా కావ్యము నిర్మించెనో తదభిముఖముగా విమర్శకుడు కావ్యమును జూడవలెను. తాను భావించిన దందులేదని విమర్శ విమర్శయే గాదు. కవిసిద్ధాంతముతో మన మేకీభవించకపోవచ్చును. కాని కవి శక్తి గలవాడైనచో నా శక్తిని యొప్పుకొనియే తీరవలెను. కవికాలమునాటి సాంఘికజీవనము, — కవికిగల శాస్త్రీయదృష్టి, — కవికిగల పాండిత్యము వీనిని గుణించి వ్రాసినంతమాత్రమున విమర్శ సంపూర్ణము గాదు. అవి *Comparative Criticism*, *Historical Criticism* అను పాశ్చాత్య విమర్శల ప్రతిబింబములుమాత్రమే. కాని నిజమైన విమర్శకుడు తన బుద్ధిని కవిప్రతిభ వెంట ప్రసరింపజేయును. ఆప్రతిభను పట్టుకొని చెప్పుటయే విమర్శలోని ముఖ్యాంశము.

లోకములో నన్ని భావములు రసమయములుగా నుండవు. రసానుగుణములైన భావములు కొన్ని మాత్రమే యుండును. ఆ భావములన్నియు పూర్వకవులచే ననంతముగా మంచిమంచి చెప్పబడినవి. పూర్వకవుల ఛందస్సులన్నియు నా భావములను వ్యక్తముచేయుట కేర్పడినవే. అట్లు రసాభిముఖముగాలేని భావములకన్నిటికి ఛందస్సుకల్పించి యా భావము నొక చమత్కారముగా బోతపోసిన కవి శ్రీశ్రీ. "ఏవస్తువునైన కవి తన ప్రతిభవల్ల రసవంతము చేసికొనగలడు" అన్న ఆలంకారిక వాక్యము వస్తునిష్పృత్యర్థకమాత్రమే. అయిన శ్రీశ్రీ భావములు రసవంతములు గావా? అని ప్రశ్నించవచ్చును. రసవంతములుగా విభావాదిక కల్పనచే భాసించుటలేదు కదా! అట్లైనచో ప్రతివాక్యమునకు చేదోవిధముగ విభావాదికకల్పన చేయవచ్చును. "మృగో, ధావతి" అన్న వాక్యముగూడ రసవంతమే కాగలదు. శ్రీశ్రీ భావములు రసన—చర్వణ—ఆస్వాదన—వీనిచే సాధింపదగినవి కావని నా యభిప్రాయము. వాల్మీకి, నన్నయ్య పూర్వకవులు ఛందస్సుల సృష్టించుటలో గట్టిస్థానములు పొందిరో చేమును ఈ ఛందస్సును సృష్టించుటలో శ్రీశ్రీ అట్టి స్థానమును పొందెనమట యతిశయోక్తి కాజాలదు.

శ్రీశ్రీ చదువుటకోడవె ప్రప్రథమమున స్ఫురించునది యతని శబ్దముల పొందిక. ఒక విధముగా చెప్పవలెనన్నచో యీ కవి విలక్షణతయంతయు నా శబ్దముల సంఘటనలోనే యున్నది. ఏ శబ్దమును ముట్టుకొన్నను గింయుమని మ్రోగును. కొన్ని కొన్నిచోట్ల శబ్దముల కర్థమే యుండదు. కాని యా శబ్దసంఘటనచేత ప్రధాన భావమునకు దీప్తి వచ్చును. ఇతని సంఘటనలోని యొక లక్షణము ఉచ్చారణ విచ్ఛిత్తి సామ్యముగల శబ్దముల నొకచోట పాదిగి భావము నుద్దీపితము జేయుట

"ఇరవై కోరల, అరవై కొమ్ముల,
క్రూరఘోరకర్కోటకులో ?
కోరకిదన్నా, కొమ్ముకిదన్నా,
కర్కటక కర్కోటకులో"

ఈ కర్కటక శబ్దమున కర్థపుష్టి లేదు. కర్కోటకత్వముయొక్క అనవధిత్వమును సూచించుటకు కవిచే వాడబడినది. ఇట్టి వనంతమున్నవి.

"దారుణమారణ దానవభావంలు!
భైరవభైరవ భీకరభావంలు
ఘోషల, భాషల,
ఘంటల మంటల
కంటక కంకళ గణగణలో ?
చిటికెల చిటికెల చిటపటలో ?"

ఈ శబ్దజాలమంతయు కవికి మద్రేకములో నప్రయత్నముగా దొరలును. అది శాకమునైన భావ

ములకు చమత్కారము కల్గించును. రసానుగుణములైన భావములు కేవలము శబ్దాశ్రితములుగానే భాసించవు దానికి నూహలో దిరుగజాలిన కల్పనము లవసరములు గావలెను అందుకే యాలంకారికులు "ప్రాయశో యమకే చిత్రే రసపుష్టిర్న దృశ్యతే" అన్నారు ఈ భావములు రసవంతములు గావు కావున నేడో శబ్దముల యింద్రజాలముచే మెఱసిపోయి చమత్కారహేతువులగును చిన్నపిల్లలాట లాడునపుడు "ఉరుములు మెరుములు ఉటారు తీగెలు" ఈ శ్రేణిలోనివే అక్కడ శబ్దములకుండునట్టి ప్రాముఖ్యము అర్థమునకు లేదు ఈ కవికి నభిమానకవి స్విన్‌బర్న్ ఆయనయూ క్రొత్తక్రొత్త ఛందస్సులు సృష్టించిన కవి *Diction* లో నతిపంచ వేసినవాడు అందుకే ఆ కవిని

"ఓకవీ! నీకళకళవ్యంగళ
కళా కాహళహళాహళిలో
కలసిపోతిని! కరగిపోతిని!
కానరాక వదలిపోతిని!"

అని కీర్తించినాడు ఇదంతయూ శబ్దముల యింద్రజాలమే

ఈ కవి శబ్దములపోతయే భావమును స్ఫురింపచేయును ఎంత తీవ్రభావమునైనను శబ్దచ్ఛాయల యాశ్రయముచే పరువెత్తించగలడు ఆ శబ్దములను గిలుకరించి గిలుకరించి కదుకెక్కించును ఆ కదుకు భావోద్వేగస్ఫోరకము అంతేకాని ప్రతిశబ్దమును— అర్థమును—విడదీసి చూచినచో నర్థము సరిపోవచ్చును కాని భావోద్వేగము స్ఫురింపదు పదములను వ్యత్యయముగా వాడి ఈ కవి అనేక చమత్కారములు చేయును

"పటపటధూర్జటి
నిటాలాక్షి పగిలిందట!
నిటాలాగ్ని రగిలిందట!
నిటాలాగ్ని!
నిటాలార్చి!
నిటాలాక్షి పటాలుమని
ప్రపంచాన్ని భయపెట్టింది!"
"అదె ఝాం! ఝాం!
ఝుటక్, ఛటక్
హింసనచణ
ధ్వంసరచన!
ధ్వంసనచణ
హింసరచన!
విషవాయువు,
మరఫిరంగి,
టార్పీడో, టోర్నాడో!"

ఇట్టి శబ్దసంఘటన కుదురుట కష్టము ఈ కవితలోని ప్రాణమంతయూ నా శబ్దసంఘటనమీదనే యున్నది శ్రీశ్రీ యనుయాయులు శ్రీశ్రీవలె ప్రశస్తిలోనికి రాకుండుటకు ముఖ్యకారణము వారియందీ శబ్దశక్తి లోపించుటయే ఆ ఛందస్సునకు— ఆ భావమునకు—ఆ శబ్దసంఘటనయే ప్రాణము అది లేనిచో నా కవిత్వమే లేదు అసలా శబ్దవిన్యాసముగలవాడే యా కవిత్వమునకు ప్రయత్నించవలెను

ఇతని యుపమలు క్రొత్తవి "ఆకాశపు ఎడారిలో కాళ్ళు తెగిన ఒంటరి ఒంటెలా వుంది జాబిల్లి," "శరీరశేఖరముగా వదలకు కొంప" ఈ యుపమలు రచన రసమునకు సన్నిహితముగా పోవుచున్నదేమో యన్న భ్రమ కల్పించుచున్నది చంద్రుడు శృంగారమునందే యుద్దీపనవిభావనగా వాడుట మనమెఱుగుదుము ఇక్కడ చంద్రుని ఒంటితో పోల్చిన స్థితి కవి మనస్థితిలోని శోకమునుద్దీప్తికి దెచ్చుచున్నది "కూర్చున్న ముసలిది యారిన కుంపటివలెనున్న" దనుట, 'రాత్రి నల్లనిరాతివలె' నున్నదనుట కవి ప్రతిభాధీనమయిన విచిత్ర మనఃప్రవృత్తిని బోధించుచున్నది అన్ని యలంకారములకు నుపమయే మూలము ఈ యుపమాలంకారముచే భావము తేలికగా స్ఫురించును ఉత్ప్రేక్షాదులు భావమును మిక్కిలి క్లిష్టము చేయును ఈ కవిలో భావము మాటిగా తేలికగా స్ఫురించునదీ యలంకారము పట్టులలో మాత్రమే మిగిలినదంతయు [illegible] యర్థము జెప్పకొనవలసినదియే అలంకారములు వాడని కవి యుండడు కొందఱికవుల యలంకార నిర్మాణశక్తియే వారి కావ్యనిర్మితిలోని ప్రాణమగుచున్నది కాళిదాసుని యుపమ, కృష్ణరాయల స్వభావోక్తియు నీ శ్రేణిలోనివే. ఈ కవి రూపకక్రమాలంకారములు వాడును కాని యవి యంత చమ

త్కారముగా నుండవు. కొన్నిచోట్ల క్రమాలంకారములో నడుసగూడ తప్పియుండును.

"స్వర్గ, నరకముల, ఛాయాదేహాళి
తెలి, నలి, తలుపులు తెఱచి మూసికొను
సర్గ, విలయ, హేమంత, వసంత,
ధ్వాంతకాంతి విక్రాంతి వేళలో"

సర్గ విలయములకు క్రమముగా వసంత హేమంతములని యుండవలెను కాని యిందు తద్భిన్నముగా నున్నవి

ఉక్తివైచిత్ర్యముచేత భావమునకు పుష్టి రాకపోయినను చమత్కారము జరుగును ఆ చమత్కారము కవిమనస్సులోని చురుకుదనమును వెల్లడించును శ్రీశ్రీ మనస్సు చమత్కారము తిరిగిన పన్నముద్దవంటిది ఆ చమత్కారములో మరల నొక వైశిష్ట్యమున్నది హిరణ్యాక్షుని హిరణ్యనేత్రు డనుట—హిరణ్యాక్షుడను రూఢమైన శబ్దము అందుండి హిరణ్యనేత్రుడని విరుపు హిరణ్యమనగా బంగారము డబ్బుగలవాడను నర్థము స్ఫురించుట కొఱకట్లు చమత్కరించుట అట్లే క్రుద్ధవృకోదరుడు—దాని వ్యుత్పత్త్యర్థముచే భయత్వముకలుగుట ఇవియన్నియు శ్రీశ్రీ కవిత్వమునకు పెరుగుపెట్టుకొనుట కేరుకున్న యుక్తులు ఆ యుక్తిచేత జరిగిన మనీతిస్ఫురణ—ఆ స్ఫురణలో నొక విచిత్రమైన యనుభూతి—ఆయనుభూతిని పొగడ్తిపెడి శబ్దముల పోత విలక్షణాతి విలక్షణముగా నుండును పంకజమనగా కమలమని యర్థము ఇది రూఢము ఆ శబ్దమును తీసికొని కవి చిత్రముగా వాముచేయును "పాపపంకమునుండి పద్మాలు పుట్టించి" ఈ విరుపులే ఈ కవిత్వమునకు శోభాహేతువులు ఈ మాట విరుపులన్ని చమత్కారముకొఱకు పూర్వకవులు చేసినవారే అందులో ప్రబంధకవులలో నిది మెర మీరిపోయిన గుణము విజయవిలాసకర్త "అమ్మక చెల్ల! నా హృదయ మమ్మక చెల్లదు ఏవి కియ్యెడన్" అను పద్యభాగము ఈ శ్రేణిలోని యొక చమత్కార భావమే ఇదంతయు చిత్రకవిత్వములోని భాగము ఆ భావములకు—ఆ ఛందస్సునకు—అవి యెక్కడ పుట్టినీయవు ఈ భావములు—ఈ ఛందస్సున కవి యెక్కడ పుట్టనివ్వకపోవు. అసలెక్కడ రసదర్శకత్వములేదు. కేవలము బుద్ధిచమత్కారముకొఱకు మాత్రమే యవి వ్రాయబడినవి. ఈ రచనవలన కలుగు ఫలమే యది

ఈ గ్రంథములో కల్ల కొలికిపూసలవంటి రెండు ఖండములున్నవి అవి "చాటసారి" "భిక్షువర్షీయసి" ఇందు కవిప్రతిభ కొల మీరిపోవుచున్నది ఒక పేదబిడ్డ పట్టణములో కూలి చేసికొని బ్రతుకుటకై తల్లిమాట లెక్కపెట్టక బయలుదేరును. దారిలో ననేక కష్టపరంపర నెదుర్కొని మరణించును దీనిని కవి నిర్వహించుట హృదయగ్రాహిగా నున్నది. ఈ ఖండమంతయు మూడు ప్రయత్నములచే చెప్పబడినది అసలు కథకునికి కథాగమనము మలుపు తిరుగవలసి వచ్చినప్పుడెల్ల పట్టు తప్పకుండ చేయుట కష్టము నేటి చాల కథలలో నీలోపమే కనుపించును కథకుని మొదటి ప్రయత్నమునకు రెండవ ప్రయత్నమునకు సంబంధమే యుండదు ఈ కవి చాటసారి కష్టపరంపరలన్నియు తల్లి భావము మీదుగా నడుపును కథ మలుపు తిరిగి రెండవ ప్రయత్నమునకు మరలునపుడు రెండింటికి *Link* గా "పల్లెటూళ్లో తల్లి ఏమని పలవరిస్తోందో" అని విడిచి పెట్టును ఇది హృదయములో చురుక్కుమనును పఠితహృదయము వింతగా వాకర్షించు మార్గముండదు మూడవ ప్రయత్నములో చాటసారి మరణమును చెప్పినాడు ఆ మరణము వివిధ విధములుగా స్ఫురించునట్లు చేసినాడు "వేగుచుక్క వెక్కిరించినదట",—"జోడీగూడ వేగుజామును దెలియజేసినదట" "చాటసారి కళేబరంతో శీతవాయువు ఆడుకొంటుందట" "పల్లెటూళ్లో తల్లికేదో పాడుకలలో పేగు కదిలింది" అనుదానితో వంతము చేయుటలో శిల్పమున్నది ఈ కావ్యఖండము తల్లితోనే యారంభింపబడి తల్లితోనే యంతమైనది కథకు కావలసిన బీజనిర్వహణముల సమైక్య మిందు సూచితమైనది ముద్రారాక్షసకారుడు సూత్రధారునితో "సుకవి కావ్యములోవలె బీజములో నొకటి నిర్వహణములో మరొకటి" అని అనిపించినాడు ఇది సుకవులను గురించి యాక్షేపణ. అట్టి వాని కళంకము పొందని కథాశిల్ప మితని సొమ్ము

రెండవది 'భిక్షువర్షీయసి' దిక్కులేని ముసలిదాని కథ ఇది కథగాదు ఒక పరిస్థితి మాత్రమే. కాని కవి యుద్దీపన విభావముల మూలకే పోతపోసి

కథవలె భ్రమ గల్పించినాడు భీతావహియని చుట్టూ నూరకే యుద్దీపన విభావములను గుప్పించుచు పోయినాడు. చిట్టచివర కాయుద్దీపనవిభావములే నిర్వహణ యోగ్యములై ముసలిదానికి నంపగా విరచి నవి "రానున్నది చలికాలం" 'అనుకున్నచే శక్తి లేదు' ఇవి యన్నియు నుద్దీపన విభావములే ఇందులో నుద్దీపనవిభావముల కంటె మించి పొల్లులేదు కాని చమత్కారము—కథవలె నున్నది

ఆధునికకవులలో నవ్యజాతీయము వాడుట యొకటి సంప్రదాయముగ నున్నది అట్టినవ్యజాతీయము వాడుటలో నేమి విశిష్టత యున్నదో తెలియదు మీదు మిక్కిలి పఠితకు అర్థక్లిష్టతాపాదన కలుగును సంప్రదాయ సిద్ధమైన పలుకుబడిలో శ్రోతను గచ్చగొట్టునట్లుగా నవ్యజాతీయముచే సాధ్యముకాదు ఇతర భాషాపాండిత్యము కేవలము తత్త్వగతమైన శిల్పము వలవరచుకొనుటకో ఆకావ్యములలో శ్రోతను పట్టుకొనుటకు కవు లుపయోగించిన మార్గము లేవో తెలిసికొని దానిని తన కావ్యమునం దిమిడించుకొనవలెను అంతేగాని సంప్రదాయభిన్నమైన పలుకుబడిని ప్రవేశ పెట్టరాదు "యముని మహిషపులోహఘంటలు మబ్బుచాటున ఖణేల్ మన్నాయ్" అన్నప్పుడు పఠిత హృదయముప్పొంగినట్లుగా "నరకలోకపు జాగిలమ్ములు గొలుసు తెంచుక పరువులెత్తాయి" అన్నప్పుడుప్పొంగదు. దీనిలో పఠిత తాత్పర్యార్థముచే గ్రహించును గాని గ్రీకుసంప్రదాయములోని "హెల్ లోని "డిర్నా"" స్ఫురణకు రాదు యముని మహిషపులోహ ఘంటలన్న పదుగుబాలతో చేర్చిన సంప్రదాయములోని ఛాయ మనస్సు నమితముగా రెచ్చగొట్టును ఈ గంపములో మిగిలిన వన్నియు మరల సంప్రదాయము వైపునకే మొగ్గజూపును "కనకదుర్గసింహ మూపులించుట—" "ఇంద్రుని మదపుటేనుగు ఘీంకరించుట"— "ఉదయ సూర్యుని హయము నురుగు గ్రక్కుట" ఇవి యన్నియు పాఠకుని హృల్లత లూగించును

"ఎగిరిన ఇనుపడేగ—" "ఎగిరే లోహశ్యేనం" —"అగ్ని శిరస్సున వికసించిన వజ్రం" — ఇవి తల వసులకొట్టుకొన్నను వర్థముకావు ఇట్లనుటచేత స్వసంప్రదాయప్రయోగము లేకవి వాడుట కాదు, సంప్రదాయ సిద్ధమైన జాతీయముగాని మాట విరుపుగాని వాడినప్పుడెల్ల హృదయస్పందనము జరుగుచునే యున్నది

"చెంఘిజ్ ఖాన్, తామర్లేను,
నాదిర్ షా, ఘజనీ, ఘోరీ
సికందరో ఎవరైతేనేం ?
ఒకొక్కడు మహాహంతకుడు"

ఇంతలో ఎవరైతేనేం ? అన్న విరుపు తెలుగు పలుకుబడిలోనిదే అదొట యీ పద్యమున కింతైన యందము దెచ్చినది ఆ పలుకుబడికే కవి పాటుబడినచో కావ్య మింతేని రమ్యముగా నుండెడిది

తరువాత ఛందస్సు ఈ ఛందస్సు మొదట వైదికముగా బయలువెడలినది అక్కడ దాని ప్రయోజనము కేవలు మంత్రములలోని శక్తి నధికము చేయుటకే దాని ప్రయోజనము గాయత్రిమంత్రమున్నది అది యగా ఛందస్సులో జెప్పిన గాని యా దేవత ప్రసన్నగాదు అందుకే ఋషులను మంత్రద్రష్ట లందురు భారతములోని గరుడోపాఖ్యానమంతయు నీ వైదిక ఛందస్సుల ప్రాబల్యమును సూచించుటకు వ్రాయబడినదే లౌకికమైన వాఙ్మయమునకు సరిపోవునట్లుగా దీనిని మార్చినవాడు వాల్మీకి సాధారణముగా నున్న భావములన్నియు, ననుష్టుప్పులలోనే చెప్పి విశేష భావములకు ఛందస్సు మార్చి చెప్పును కాని ఛందస్సును మార్చి భావము నుద్దీపింప జేయుట కాళిదాస భవభూతుల చేతులలో గాని నిగ్గుదేరలేదు కాళిదాసు కుమారసంభవములోని రతివిలాపమంతయు వియోగినీవృత్తముచే జెప్పబడినది అదియునుగాక సంస్కృతభాష నాటక యోగ్యమైన భాష అందుచేతనే సంస్కృత నాటకములవంటి నాటకములు సృష్టిలో లేవు దానిని కావ్యమునకు యోగ్యముగా ద్రిప్పిన వారు కాళిదాసాదులు నన్నయభట్టారకుడు సామాన్యముగా పద్యములు వ్రాయుచు విశేషముల నుద్దీపింప జేయవలసి వచ్చినపుడు విభిన్నములైన వృత్తములు వాడును అందుచేతనే యే కారణముచేత వాల్మీకి మహాకవియో నన్నయగూడ నా కారణముచేతనే మహాకవి యగుచున్నాడు

అసలు ఛందస్సులోనే వ్రాయవలెనను నియమమేల కావలసి వచ్చినది ? గద్యలో వ్రాయవచ్చును గదా యన్నచో భావము గద్యలోకంటె ఛంద

స్సులో మెఱుగుదేరుటయే ప్రమాణము. చిన్నయసూరి—"ఏకవాక్యంబునం దాకాంక్షంబు తక్కసర్వ పదంబులు క్రమనిరపేక్షకంబుగం బ్రయోగింపంబడు," నన్న వాక్యము కేవలము పద్య రచయితను మనసులో నుంచుకొని వ్రాసినది మాత్రమే కాని ధ్వనివేత్తలు దీనిని సుదాహాదిగా చెప్పుదురు. వాడు వచ్చెను—అన్న వాక్యముకంటె వచ్చె వాడు—అన్న వాక్యములో రానే వచ్చెనను భావము వ్యంగ్యముగ నుండును. నన్నయభట్టు వచనములు పద్యములవలె నుండును. ఏనిని పద్యగంధివచనము లందురు. ఆయన వచనములు కొన్ని తేటగీతులుగానో, కందములుగనో ప్రస్తరింపవచ్చును. ఇవన్నియు ప్రయోజనము కొఱకే చేయునాయన్న విషయము శిల్ప సంబంధమైనది. మనకు ప్రస్తుతము కావలసినది ఛందస్సునకు సంబంధించినంతవఱకు మాత్రమే. దీనిని బట్టి యొక భావము—ఒక పద్ధతి గల భాషలో పద్యముగా చోతబోసినపుడు మన కాహ్లాదము కల్గించుచున్నదని తేలుచున్నది. అనగా భావమునకు, భాషకును ఛందస్సునకును పరస్పర సంబంధ ముండియే తీరవలెనన్నమాట. వేమన పద్యము లంత ప్రాచుర్యము నందుటకు గారణము భావము భాష ఛందస్సు తగిన పాళ్ళలో కలియుటయే. లోకములో కొన్ని పద్యములే మిక్కిలి ప్రాచుర్యము నందుటకు గల విధే కారణము. భావము భాష ఛందస్సుల సమైక్యము జరుగుటయే యాహ్లాదమునకు హేతువు. అది మానవప్రకృతిలో నున్నది. ఈ మూడు భావములను తూచినట్లుగ సర్వత వాడిన కవి సృష్టిలో నుండదు. మహాకవులైన వారియందు చక్కని భాగమీ మూడిటి యొక్క సమైక్యము గోచరించుచుండును. కనుక భావము ఛందస్సుచేత నుద్దీపింప చేసిన రచనయందు మనస్సు రమించినట్లుగా భావమును సూటిగా చెప్పిన వాని రచనయందు రమింపదు.

అయితే గద్య వ్రాసిన దండి బాణుల విషయమేమిటి? పాశ్చాత్యభాషా సంప్రదాయము ప్రకారము కేవలము పద్యకవిత వ్రాసిన మిల్టన్, షేక్స్పియర్ మొదలైనవారే కవులు. కార్లైల్ మెకాలే మొదలైన వారు రచయితలు మాత్రమే. తెలుగులో కూడ పద్య రచయితలే కవులుగా బరిగణింపబడుచువచ్చిరి. కాని సంస్కృత భాషా సంప్రదాయము దీనికి భిన్నమైనది. దాని యందు కాళిదాసాదులవలె గద్య వ్రాసిన దండి బాణాదులు గూడ కవులే. "గద్యమ్ కవీనాం నికషమ్ వదన్తి" అన్న వానుడి కూడ నున్నది. అయితే కాళిదాసాదులను కవులన్న యుద్దేశ్యమునకును దండి బాణులను కవులన్న యుద్దేశ్యమునకును భేదమున్నది. దండి బాణుడు—వీ పాత్రపోషణమో కథనమో చమత్కారముగా వ్రాయబట్టి కవులైరి. కాళిదాసాదులవలె ఛందస్సును వ్రాయుటచే కవులుగా బరిగణింపబడలేదు.

వాల్మీకి కాళిదాస నన్నయాదులు ప్రసిద్ధ వస్తుమాత్రమైన యదార్థ భావము నుద్దీపింపజేయుటకే యా ఛందస్సును సృష్టించిరి. ఆ భావము లా ఛందస్సుల చేతనే గాక వేఱొక ఛందస్సులచే చెప్పిన రమ్యముగావని వారి యూహ. తరువాత నది క్రమముగా నల్లిపో జొచ్చెను. పద్యముల పోకడల మీద దృష్టి నిలచెను. "శ్రవణసుఖమ్ముగా సామగానమ్ములు చదివెడి శుకముల చదువు పగిలి వినుచుండు కరులును" అని యొక ప్రయోజనము కొఱకు నిర్మించబడి నడక సాగిన పద్యము తరువాతి కవుల చేతిలోనడక దద్దాలు పోయి "గగన కల్లోలినీ కల్లోల మాలికా హాల్లీసకములతో నవఘటించి" "లలనాజనాపాంగ వలనా వసదనంగ తులనాభికాభంగ దోః ప్రసంగ" యిట్లు మారిపోయినది.

సంఘము మతము ఆచారము మాఱినట్లే కవిత్వము మాఱినది. పాశ్చాత్యులు క్రొత్త మార్గములు కనిపెట్టిరి. కమ్యూనిజం వ్యాపించి పేదలు వర్గపోరాటములో పాల్గొనిరి. లోకములో సర్వసామ్య సిద్ధాంతము పొంగి పొరలెను. రాజుల కథలే వ్రాయుట యేమి? పేదల కథలు వ్రాయవలెనను సిద్ధాంతము బయలుదేఱెను. పూర్వము పేదల కథలు వ్రాయక పోలేదు. అవి యంగములుగా గాక కేవల మంగములుగ నున్నవి. ఆ కథ లంగులుగా వ్రాయవలెనని నవీనులూహించిరి. ఇట్లు వ్రాయుటకు ననుకటి ఛందస్సులు పనికిరావు. నూతనముగా ఛందస్సు నిర్మించవలెను. శ్రీ శ్రీ దాని నిర్మాణములో కృతకృత్యుడైనాడు.

పూర్వకవులలో భావన క్రమముగా మనీషలను మనసు ముహుర్ముహు రనుసంధానము చేతగాని భావము పదునెక్కదు. ఈ భావ మట్టిది కాదు. ఏదో నిఘంగత పాతమువలె బుద్ధిని తాడితము చేయును. ఆ

కాదితమే యీ భావన యొక్క పరాకాష్ఠ దశ. అట్లు భావము ఝుడితిగా తెగులుటకు వీలుపు చాలని ఛందస్సు కావలెను పూర్వపు ఛందస్సులలో భావము వివిధ విధములుగా పోగుటకు చాలినంత స్థల మున్నది అందుచే శ్రీశ్రీ తన భావనకనువుగా ఛందస్సులను సృష్టించుకొన్నాడు కొన్ని యుద్రేక పూరితములైన భావములు చెప్పవలసివచ్చినపుడు శ్రీశ్రీ మొదటి యక్షరము లఘువుగా నుండి రెండవ యక్షరము గురువుగానున్న రచనలు పెక్కు చేయును. ఆ రెండవ యక్షరము విఱిగినపుడు భావము కూడ నుద్రేకముపై పునకు విఱుగును

"పదండి ముందుకు
పదండి త్రోసుకు
పదండి పోదాం
పైపైకి!"

"పొలాలనన్నీ
హలాల దున్నీ
ఇలాతలంలో
హేమం పిండీ"

ఇవన్నీ దీని కుదాహరణములు

శ్రీశ్రీ ఛందస్సంతయు లయాశ్రితము మాత్రలు లెక్కపెట్టినచో కొన్ని కొన్ని చరణములకు తక్కు వగుచుండును కావున లయాశ్రితముగా జూడవలసి నదే కాని మాత్రల ప్రకారము చూడదగదు పూర్వు లైన నన్నయాదులు ఛందస్సును ప్రస్తరించి యే ఛందస్సు ఏ భావము నిముడ్చుకొనునో యూహించి రచన చేసిరి శ్రీశ్రీ యట్లు చేయలేదు తనలో నే యుద్రేకము పొగినదానికే వ్రాసి యది యొక ఛందస్సుగా జూపినాడు కావున పైన చెప్పిన మార్గమునకు దీనికి భేదమున్నది లయాశ్రితమైన ఛందస్సులో భావము వ్యక్తమగునే కాని తద్భావ యాదికము వ్యక్తము గాదు పూర్వ కవులలోని భావము రసన—చర్వణ — ఆస్వాదనలద్వారా భాసించును ఈ కవిలో భావమట్లు భాసించదు పూర్వ ఛందస్సులు భావమును సంస్కరించును. ఈ కవిలో భావమే ఛందస్సుగా మారును గాన దాని కాస్థార ముండదు

లయ తప్పినచో నితని కవిత్వమే లేదు.

"ఆ అన్నె మరణిస్తే
ఆ పాపం ఎవ్వరిదని
వెర్రిగాలి ప్రశ్నిస్తూ
జాలిపోయింది!"

ఇందులో నాల్గవ పాదము మాత్రలు తక్కువైనను లయకు సరిపడును వెనుకటి జానపదగీతము లన్నియు నీ లయ నాశ్రయించి వ్రాయబడినవే కవి యుద్రేకము కొలది ప్రతిభనుబట్టి యనేక భావములు ఛందస్సులుగా తిరుగును ఇవి పూర్వకవులలోని వానివలె సంస్కృతములు గావు అట్లు సంస్కృతము గావలసిన యగత్యమును దీనికి లేదు ఉదాత్తమైన భావము సంస్కరింపబడి యంత భాసించునో అను దాత్తమైన భావము సంస్కారాభావముచే నంతగా భాసించును ఏ గుణమో—వృత్తియో—రీతియో దీని నుద్దీపనము చేయుటకు సాధించిన జాలను ఈ పరమసత్యము తెలిసికొని క్రొత్త మార్గము త్రొక్కిన కవి శ్రీశ్రీ

ఈ కవిలోని ప్రధాన వస్తువు పీడిత ప్రజ ధని కుల పన్నాగములకు జిక్కి విశీర్ణమైపోవుచున్న పేద ప్రజల జీవితమంతయు వ్యక్తము చేయబడినది

"అంతేలే, పేదల బ్రతుకులు!
అతిపెనునకు పిడికెడు మెతుకులు!
తెరుపరాగని దీర్ఘరాత్రిలో
తల పగిలెడి తలపుల గతుకులు!"

ఇట్టవి హృదయము నెంతేని కదలించున వెన్నెని యుదాహరణములు చూపవచ్చును కాని దానిని పాటుగా దీసికొని సంస్కృతిని విమర్శింప బూనుదు ఆ విమర్శనలో నుదాత్తత యుండెను, హేతువులేని వ్యర్థవినిగమనములతో నితని సిద్ధాం తము భాసించును కవికి నచ్చని ప్రతిదానిని విమ ర్శింపవచ్చును కాని యా విమర్శ పరిపుష్టముగా నుండవలెను గాలిమాటల ద్రోవవలె నుండగూడదు అది కాక మతము, — సంస్కృతి, — నీతినియమా ములో నవేమియో తెలిసికొనకుండ విమర్శించుట సుతరామూ పనికిరాదు ఒకచోట విమర్శించినచో సిద్ధాంతము తర్కసహముగా నుండవలెను

"జమీందారు రోల్సు కారు
మాయంటావా? బాబూ
ఏమంటావు?"

ఇటి మిథ్యావాది యను ఖండికలోనిది. వేదాంతులు సత్యమును రెండు విధములుగా చెప్పుదురు (1) పారమార్థికమైనది (2) వ్యావహారికమైనది. పారమార్థికమైన సత్యముగానిది మిథ్యయని వారి సిద్ధాంతము. అది వ్యావహారికమైన సత్యమని వారే యొప్పుకొందురు. జమీందారులొప్పుకొనరు. మాయ యన్నచోనది పారమార్థికమైన సత్యముగాదని వారి భావము. మిథ్యావాదిని విమర్శించు మార్గమే యిది కాదు. మేధాపటువులు కాని పాఠకులకు మిథ్యావాదమన్నచో నిజముగా నిదియే యని స్ఫురించును. ఇట్టివానిని ప్రత్యాఖ్యానము లందురు. ఈ ప్రత్యాఖ్యానములలో నిజమే సని భ్రమగొల్పు లక్షణమున్నది. మనుచరిత్రలో "ఆనందో బ్రహ్మయటన్న ప్రాజ్ఞగుఫ సంతర్పద్ధి నూహింపుమా" యని యున్నది. అసలిది యుపనిషత్తులలోనిది. అక్కడ యానంద మనగెట్టిదో నిర్వచించి యది బ్రహ్మయని చెప్పబడినది. వరూధిని తన కనుకూలముగా నానందమునకు లౌకికమైన యానందమను భ్రమ కల్పించినది. ఇట్టివి సంస్కర్తలొక్క గొప్ప లక్షణములను కించపఱచును. మిథ్యావాదమును పరిపూర్ణముగా తర్కసహాయముగా విమర్శించినచో నీ చిక్కుండదు.

ఇక నీ కవి కవితాసిద్ధాంతములు కొన్ని యీ విధములుగ నే యుండును

"కదలేదీ కదలించేదీ
మారేదీ మార్పించేదీ
పాడేదీ పాడించేదీ

కావాలోయ్ నవకవనానికి"

దీని నందరు నొప్పుకొందురు. ఎవ్వరును కాదనరు. ఈకవి "కవితా! ఓ కవితా!" యను కృతికలో కొన్ని సిద్ధాంతములు చేసినాడు. పూర్వకవిత్వమంతయు చటులాలంకారపు సటవలలో చిక్కుకొని రూపమే కానరాకపోవుటచే నీయన దీక్ష పట్టగా క్రొత్తమార్గము స్ఫురించినదట. అది శ్మశానముల లాంటి నిఘంటువులవాటి, ఛందస్సుల సర్పపరిష్వంగము వదలించుకొనిన మార్గము. పూర్వకవు లనగా బహుశః ప్రబంధకవులని యితని యుద్దేశ్యము. వారెవ్వరు నీ కవికంటె యెక్కువగా చటులాలంకారములలో భావమును బంధించలేదు. వర్ణనపదము లందలి కవిత్వములో నుండును. ఒక్కని కవిత్వ మేమిటి—శబ్దము ప్రధానముగా వ్రాయు ప్రతి కవిలో నున్నది శ్రీశ్రీలోనూ నున్నది. శ్రీశ్రీ వాడిన శబ్దాలంకారములలో నున్న సార్థక్యము ప్రబంధకవులలో లేక పోలేదు. కేవలము పద్యరచనవిషయములో వారి కవిత్వ మందలికిని శిరోధార్యము. అంత మధురముగా పద్యరచన చేయునా రితర భాషలలో నైన చాల తక్కువ. శ్రీశ్రీ "ఐ" యను ఖండికలో

"లోకాలు,
భవభూతి శ్లోకాలు,
పరమేష్ఠి జూకాలు నామహోద్రేకాలు!"

అంత్యప్రాసకొఱకు కవి ప్రయత్నము చేసిన ట్లగుపించుటలేదా! జూకాలు సాధారణముగా స్త్రీలు ధరించుకొందురు. కాని యిక్కడ ప్రాసనియమముకొఱకు పరమేష్ఠి ధరించుకొన్నాడు. అంతమాత్రముచేత పెద్ద తప్పని నా భావము కాదు. శబ్దముపై మమకారము లోకములో సహజము.

ఇక నిఘంటువులు శ్మశానము లనుట యేమి? ఈయన నిఘంటువులలో లేని పదములు వాడునా! ఒకవేళ యీయన సాహసించి వాడినను—అది యెవరి కర్థమగును? అది యొక క్రొత్తభాష యగునేమో. ఈ కవిభావము క్రొత్త క్రొత్త మార్గములను నిర్మించుట యని యేమో లక్షణయా గ్రహించుటయో—ఏదో విధముగ సరిపుచ్చుకొనుటయో చేయవలె. యీ కవిత్వ మర్థమే కాదు మఱి "ఛందస్సుల సర్వపరిష్వంగం వదలి" అని వ్రాసినాడు. ఛందస్సుల ప్రయోజన మీ కవి తెలియక యిట్లు వ్రాసినాడా! ఛందస్సు భావమును సంస్కరించును గాని బంధించదు.

శ్రీశ్రీ కవిత్వములో వద్దనుకొన్నను కొన్ని వేదాంతభావములు వచ్చును. కాని త్రుప్పుపట్టిన వనుకొన్న ప్రేతాత్మలు—హాహాకారహారలు—నాదబ్రహ్మలే తనకు కానుకలిచ్చినవని. "అశాంత దీపం" అను ఖండమంతయు వేదాంతము వాసన కొట్టుచున్నది. చచ్చిపోయిన మహాపురుషులు ఆకాశమందు నక్షత్రము లగుదురని లోకములో నమ్మకము గలదు. ఆ నమ్మకమే యీ ఖండములోని భావమున కాధారము.

"ఒక దురదృష్టశిశివి
ఉదయం అరుణ్నరకు

ఆ గదిలోనే ఆరిపోయాడు
అతని దీపం ఆగదిలో
మూలనక్క మూలుగుతున్నది

దీపం ఆరిపోయింది
తారగా మారిపోయింది"

ఈ భావము వేదాంతమునకు సంబంధించినదే

తరువాత "గంటలు" అను గేయము పేర్కొనదగినది. ఈ గేయము విభిన్న విషమమైన ధ్వనులను వివిధ్యముగా చెప్పను సృష్టియందలియు ధ్వనిమయము మని ఓంకారము లోకమంతయు శబ్దమయమను వాదనకే దీనికి మూలమనుకొందును. అందు చేతనే—

"ప్రాణము ప్రాణి ప్రతిస్థలములో,
నీహృదయములో, నాహృదయములో
గంటలు! గంటలు!
గంటలు! గంటలు!"

అని కవి చెప్పినాడు గణ గణ గణ గణ యని పునరుక్తి చేయుటచే నాశబ్దము యొక్క యనంతత్వము సూచింపబడుచున్నది

"నగరవీథుల నీరింకిన
చెరువుపక్క, చెట్టునీడ -
గోడలతో, కుండలతో,
ఎటుచూస్తే అటు చీకటి"

చీకటి గోడలతో కుండలతో నున్నదట. ఇట్టి రచనలు కొన్ని యీ కవిత్వము నా కొకపథమున కెత్తుచున్నవి. కవిని రచనా గౌరవమునుబట్టి మెచ్చుకొనవలెనా లేక వ్యక్తిగత భావములకు ప్రాధాన్య మిచ్చు సిద్ధాంతమును గాక కవిని మనకు నచ్చినవని మహాకవి యనరాదు. సిద్ధాంతములందరికి నుండును. అవి వ్యక్తము చేయు రచనాశిల్పమే కవిని సామాన్యమానవుని కంటె భిన్నునిగా పరిగణింపజేయును. కాబట్టి కవిని గురించి చెప్పుట యన్న యా రచనాశక్తిని గురించి చెప్పుటయే. రచనాశక్తి తెలియక సిద్ధాంతములనుబట్టి మెచ్చుకొనువారికంటె రచనాశక్తిని పరామర్శించి వ్రాయగలవారివల్లనే కవి కావ్యమునకే కొంతైనను లాభముగల్గునని నా భావము

శ్రీ శ్రీ కవిత్వమందఱకు నర్థమగునని కొందఱి యూహ. శ్రీ శ్రీ అన్ని పదములు లక్షణయా చెప్పకొనవలసినదే కాని వాని వాక్యార్థముల సాక్షాత్కార ముండదు. శ్రీ శ్రీ కవిత్వముకంటె పూర్వకవిత్వమే చప్పన స్ఫురించును. అందుకు గతికి సాంకేతికములైన పదములు ప్రసిద్ధములు, సంప్రదాయబద్ధములై యున్నవి. అయితే శ్రీ శ్రీ లో ప్రతిపదము తెలియకపోయినను మొత్తముమీద తాత్పర్యము తెలియ నగవచ్చును. ఆ తాత్పర్య మన్ని కవిత్వములందును తెలియుచునే యుండును. ఈ క్రింది పద్యము నాచన సోముని యుత్తర హరివంశములోనిది

"హరివంచద్ద్విప దంతికుంత కబరా
నంతార నిర్భింత
గ్గరదాన్వాకిత వజ్రాగ్రరిపు వి
చ్ఛాయైక రోమగ్ధుల
స్థిరవిద్యు త్ప్రతిపత్తిపత్రాపయి వ
చ్ఛేద స్తన చేయుంము భా
స్వరచింబ ప్రతిబింబ మంబరము ప్రేం
గ త్వచ్చ చందంబునన్ "

ఈ పద్యములో నుత్ప్రేక్షింపబడు భావ మందరికి తెలియుచున్నదికదా. ఆ సమాసముల యర్థము తెలియకపోవచ్చును

"సింధూరం, రక్తచందనం,
బంధూకం, సంధ్యారాగం

రుద్రాలికనయన జ్వాలిక
కలకత్తా కాళికనాలిక
కావలెనోయ్ నవ కవనానికి"

"కవీ! నీ గళగళన్మంగళ
కళాకాహళ హళాహళిలో
కలసిపోతివి! కరగిపోతివి!
కావరాకే కదలిపోతివి!"

ఇవి తెలిసినంతమాత్రముగా నీపద్యము తెలియకపోదు. ఏ కవిత్వమైనను తాత్పర్యమాత్రముగానే పాఠకులకు తెలియును. దానియందలి విశిష్టలక్షణము లన్నియు విజ్ఞులకు తెలియవలసినదే. శ్రీ శ్రీ చెప్పినట్లుగా పుష్కిన్, గోగల్, డాస్టవిస్కీ ప్రసిద్ధ శిల్పనిర్మాణదక్షులు. వారి కథలు చెప్పు లక్షణములే విశిష్టములు. వారి కథలు గూడ పాఠకులకు తాత్పర్యమాత్రముగానే తెలియును. తద్రచనాశిల్పము తెలి

నుడు వారినిగురించి వ్రాసెడి నేటి ప్రతి విమర్శకుడు వారు ప్రజాజీవితమును వాస్తవికముగ జిత్రించిరని చెప్పునే కాని వారి ప్రతిభలోని విశేషములు వివరించడు శిల్పము వారిచేతిలో నిగ్గుదేలినది. ఆడెన్, ఇలియట్ మొదలైన కవులలోని శిల్పసంస్కారమీ కవి కవిత్వములో గనుపించదు ఎంతసేపటికి ఛందస్సుల వైఖరి మాత్రమే పోలికగా భాసించుచుండును

సంఘములో మానసికముగా దెబ్బతిన్న విచారము శ్రీశ్రీ లో పలుచోట్ల గోచరించును అందుకే

"అలజడి మా జీవితం
ఆందోళన మా ఊపిరి
తిరుగుబాటు మా వేదాంతం"

"ఒక వ్యక్తిని మరొక్క వ్యక్తి
ఒక జాతిని వేరొక జాతీ,
పీడించే సాంఘికధర్మం
ఇంకానా? ఇకపై సాగదు"

అన్నాడు ఇవన్నియు వినువారు లేరు వారందరదృష్టవంతులు ఈ సృష్టిలో మోసమే ప్రధానాంశము "గాలిలో కనరాని గగనదుర్గాలు గోరీకదంబుల మధ్య యీదుచున్నాయిట"

"మానవుడా" అన్న గీతంలో మానవుని యనేక విధములుగా సంబోధించుచు అది మానవతా వైశిష్ట్యగు సూచించుట కేర్పఱుచుకొన్న పద్ధతి

ఈ కవిలో *Surrealism* (అధివాస్తవికకవిత) యొక్క *Influence* చాల తక్కువ దానిమీద మమకార మున్నదే కాని దానిని కావ్యగుణం చిముడించలేదు

ఈ కవి సంస్కృతము నెక్కువగా వాడినను తప్పులు రావు "వర్షుకాభ్రములు—"ప్రాంతిరాలు" —ఇవి సాధువులు కావు వార్షుకాభ్రములు—ప్రాంతములు--అనవలెననుకొందును ఇట్లే "పాదిగిట" యని యాపవిత్ర తీకముగా వాడినాడు ఇట్లు వాడకూడదు ఈ గ్రంథముపేరు మహాప్రస్థానము ఇక్కడ దీర్ఘప్రయాణ మనగా మరణమని యర్థము వచ్చును గొప్ప బాట యని యర్థము వచ్చుటకంతగా వాస్తార ముండదు ఇవన్నియు కవి ప్రతిభను శంకించదగిన దోషములు కావు

"అంతరాయ యింతయో తెలిసినట్టి
విమర్శకులైన కావ్యసి
ద్ధాంతుల యుక్తిసింబడి మహాకవి
నాగటిచాలు దీర్పు గా
లాంతరకీర్తి వృష్టిగతిమై చను
లాభముగాంచుచుణ్ లలా
ఎంతసరూతు చింతివనట
స్మగుభారతి సద్యధారణిన్"

ఇది విశ్వనాథ సత్యనారాయణగారి రామాయణకల్పవృక్షములోని పద్యము ఏ కొంచెమో తెలిసిన కావ్యసిద్ధాంతి యుక్తిచే మహాకవి నాగటిచాలు తీర్చిపెట్టును కావ్యసిద్ధాంతులచే బరామృష్టము గానిదే కావ్యము భాసించదు కవి యిట్లు కష్టించి సాధించుటవలన ప్రయోజనమేమి? తరువాత జనులు తన్ను కీర్తింతురను నాశచేత మాత్రమే అందుకే కాళిదాసుకూడ "బలవదపి శిక్షితానా మాత్మన్యప్రత్యయం చేతః" అన్నాడు లోకములో నేదో పేరుకొఱకు ప్రాకులాడువారికి కేమియు నవసరము లేదు వారు కవులే కానవసరములేదు కొన్ని పట్టుబడి పదములు చాలును

శ్రీ శ్రీ మహాకవి కాకపోయినను నొక పద్ధతికి మార్గదర్శియైన కవి ఆ కవిత్వము బహు విమర్శలచేత గాని భాసించదు మేధాపటువులైన విమర్శకులు కవి ప్రతిభలో నిమిడిన విశేషములను బైటపెట్టవలెను పూర్వకవులందఱు నట్లే నిలచిరి

# భారతనారి

★

**శ్రీమతి వట్టికొండ విశాలాక్షి**

(గత సంచిక తరువాయి)

ఏమిటది? అంటూ అట్టలిప్పి పుస్తకం నాముఖం ముందు పెట్టారు సత్యం, పేరుకింద అదే పేరు ఏడెనిమిదిసార్లు పెన్సిలుతో వ్రాసిఉన్నది అది చూసేటప్పటికి నాకు అయోమయమైపోయింది అది అనవసరంగా ఎవరు వ్రాశారో ఎలా వ్రాశారో ఎందుకువ్రాశారోకూడా నాకు బోధపడలేదు ఏమి సమాధానం చెప్పటానికి ఏమీతోచలేదు మౌనంగా నిలబడ్డాను

ఏం చెప్పవేం? అంటూ కాలిచెప్పు విసిరారు

'మీకొక నమస్కారం నన్ను చంపకండి, మీకుఇష్టం లేకపోతే వదిలైనా పెయ్యండి ఇదిమాత్రం నేను వ్రాయలేదు నా దస్తూరీ అవునో కాదో కావలిస్తే పరీక్ష చేసుకోండి అంతేకాని అనవసరంగా నన్ను అవమానించకండి ఇవన్నీ నామీద ఎందుకు ఇలా పెట్టుకొస్తున్నారో నాకేంఅర్థంకావటల్లా' అన్నాను నేనుమాట్లాడిన మాట ఒక్కటికూడా వారిచెవిలో దూరిఉండదు ఆ పరిస్థితుల్లో మానవత్వాన్ని కోల్పోయిన వ్యక్తి ఎలా ప్రవర్తిస్తాడో అదే మోస్తరుగా ప్రవర్తించారు నీవిమరునిమిషానికే ప్రయాణం కట్టవలసిందేనని చెప్పారు అంతలో మా అత్తగారు వచ్చారు మొగుడు కొట్టినందుకుగాదు తోడికోడలు తొంగిచూచినందుకని ఒక సామెత ఉన్నది చూడండి అలాగే ఆమెక్కడ తెలిసిపోతుందోనని చాటుచాటుగా కళ్లుతుడుచుకొని గదిలోనుంచి బయటకువచ్చాను

వాడు వచ్చాడట్టుందేం? అన్నదామె నాతో,

ఊఁ, అన్నాను

'అప్పుడే వచ్చావేం? ఇంకాఏమన్నా ఉన్నదేమో గాలించుకు పోదామని వచ్చావా? నువ్వు వరసన పూళ్లమీద తిరుగుతుంటే నీ యింటికి నీ పెళ్లానికి కావలసుకున్నావా ఇక్కడ నేను! నువ్వు పూళ్లంబడి తిరుగుతూవుంటే నామాట వింటారా పెద్దారా?

నీకేం తెలుస్తుది? ఎట్టాకొట్టా ఆ మునక్తే చస్తది తెమ్మనుకుంటావు ఇప్పటికి అరవై ఏళ్లు వచ్చినైనాకు ఇంత పసిపిల్లల్ని దగ్గరకూర్చోపెట్టుకుని ప్రొద్దుపుచ్చుకొనే రోజుల్లో ఆ గీతలేకపోగా అది లేదని ఇది లేదని ఇంట్లో వాటికోసమే దేవుళ్లాడాల్సొచ్చినా బతుకంతా ఇంకెప్పుడు నన్ను నవ్వు సుకపెట్టేది? ఆ గొలుసెందుకురా నువ్వు తీసుకుపోయింది? ఈ తిసేమద్దకూడా పడిపోటానికా? నీమచ్చమాయ' అని అంటున్నదామె

'అహాఁ ఇక చాల్లే ఆ ఉపన్యాసం కట్టిపెట్టు అంతటితో నువ్వు నాయిల్లుమానద్దు. ఎవర్నీ మాడద్దులే' - అంటూ వాకిట్లోకి లేచిపోయారు కాసేపట్లో వాకిటముందు బండి నిలబడిఉన్నది

మళ్లీ బండెక్కడికిరా అన్నదామె వారు నావైపు చూచిపెట్టే గిట్టా సర్దుకున్నావా అన్నారు.

పెట్టెక్కడికి అన్నదామె రాగంతీస్తూ

అడుగో బండివాడు వస్తున్నాడు నీ పెట్టె ఇచ్చేసెయ్యి - అన్నారు

ఎక్కడికే అన్నదామె మళ్లీ నాతో ఇంటికన్నాను

ఇంటికా? ఏమిరా? మొన్నటిదాకా నువ్వు తిరిగొచ్చావు మళ్లీ దాన్ని తిప్పుతున్నావా? నేను చెయ్యలేనయ్యా మీయిద్దం ఇంకెందుకు నేను పోతా ఎటోఅటూ అన్నదామె నేనలాగే నిలబడున్నాను ద్వారబంధాని ఆనుకొని

'మళ్లీ తగలాలా? ఎన్నిసార్లు చెప్పాల బండెక్కమని!' అన్నారువారు. నాకళ్ళంబడి నీళ్లు బొటబొట కారుతున్నవి. పెట్టె బండివాని కివ్వటానికి సర్దుతున్నాను.

ఏమిట్రా ఏమిటీ ! అన్నదామె ఆదుర్దాగా

ఏమీ లేదు. దీన్నసలు మనింట్లో ఒక్క నిముషంకూడా ఉండనివ్వకూడదు. అని అంటున్నారు వారు నాకు ఇష్టంలేని పనిచేయవలసి వస్తున్నందుకు దుఃఖం పొర్లుకొచ్చి అవురుమన్నారు

'ఒకే ఒక్కదాన్ని పంపిస్తే మనల్ని మాత్రం నవ్వరట్రా ? ఏదన్నా తప్పంటే వాళ్ళనాన్నను పిలవనంపిస్తే వాళ్ళే చూచుకుంటారు నేనుంటిని గాయ్యి పెద్దమనిషి అదన్నా చెప్పకూడదా అనుకుంటారు ఇదిచేసేది లోకానికేం తెలుస్తుందంటా' అని అంటూ వున్నదామె పెట్టె సర్ది గదివాకిట్లో నిలబడ్డాను నేను వారు పెట్టె బండివాడిచేతికిస్తున్నారు నేనొకసారి మా అత్తగారి ముఖంవైపు చూచాను జాలిగా

'నన్నేం చెయ్యమంటావమ్మా ? చూస్తూనే వుంటివిగా నా మాట వాడువింటాడు గనకనా పెడతాడు గనకనా ? మీలోమీరు ఏమనుకొంటున్నారో ఏంచేసుకొంటున్నారో నాకేం తెలుసమ్మా ? నాకేవంటే వాడికంటే మూడాకులు నువ్వు ఎక్కువ విపోతివి ఇవాళనుకుంటారు రేపువాగుంటారు ఎటుతిరిగీ మీరుమీరు ఒకటేనమ్మ, నేనే లేదా అవుతాగాని' అన్నదామె ఎక్కువేంలేదండి - అని ఒక్కటే కవేశారు ఇకనాకు ఎక్కడలేని ధైర్యం వచ్చింది ఛీ అక్కరలేని వాళ్ళతో ఎందాకా అతుకుపెట్టుకుంటాం ! ఏదైతేమాత్రమేమి ? ఏ సమయానికి ఏది చేయవలసివస్తే అదల్లా ధైర్యంతో నే చేసితీరాలనుకొంటూ బండి ఎక్కాను పరిష్కారంచేయలేని కొన్ని కొన్ని సమస్యలనుగురించి తీవ్రంగా ఆలోచించటమేకాని తెలియక, వాటంతటవేపరిష్కారమౌతవి కావోలనుకొన్నానప్పుడు అంతటితో నా విషాద జీవితంలోని ఒకభాగం సమాప్తమైంది

నేను మా పుట్టింటికి వచ్చినతరువాత ఎన్నడు మాయింటికి రానివాళ్ళుకూడా ఏదో ఒక వంకపెట్టుకుని మాయింటికి వస్తూండేవాళ్ళు అట్లాచిక్కిపోయావేం ? ఏమన్నా జబ్బుచేసిందా ? అనీ, మీఅన్నయ్య అత్తగారింటిదగ్గర ఉన్నాడు కావాల, ఎవరు తీసుకొచ్చారని, ఒక నెలవుంటావా, తొందరగా వెళ్ళాలా ? అనీ ఇలా ప్రశ్నలమీద ప్రశ్నలు కురిపించేవాళ్ళు అసలు విషయం వాళ్ళకు తెలియక కాదు మేమే విశదంగా చెప్తామని. మా నోటి మీదగా చెప్పించి వినాలనీ, అలాంటి ప్రశ్నలతో మమ్మల్ని ఆ స్తమానమూ బాధిస్తూండేవాళ్ళు ఇక్కడకు వచ్చిన కొత్తరోజుల్లో మొగుడుకొట్టి వెళ్ళగొట్టాడట, అనీ, దీని వ్యవహారం మొగుడుకి తెలిసి అట్లాచేశాడట అనీ చాటు చాటుగా ప్రచారం చేస్తూనే వుండేవాళ్ళు—అలాంటి వ్యవహారాలలో ఆరితేరినవాళ్ళు కొంతమంది నన్ను బాగా ఎరిగున్న వాళ్ళు ఇప్పుడే కాదు అప్పుడుకూడా నామీద మాట పడనిచ్చేవాళ్ళు కాదు

నేనసలు ఇల్లువదలి పడిపంచలు చేరవలసి రావటం సత్యం నెపంతో నేకదా తన కారణంవల్ల నేనీ విధంగా కావటాన సత్యం ఎంత బాధపడుతుంటాడు బాధపడడుమరీ ? సత్యానికి నాకువున్న పరిచయం తెలిస్తే సత్యమే కాదు హృదయంవున్న వాళ్ళెవళ్ళైనా బాధపడి తీరవలసిందే.

సత్యము నేను చిన్నప్పటినుండి ఒకేస్కూల్లో చదువుకుంటుండేవాళ్ళం నాతోపాటు ఇంకా కొంత మంది ఆడపిల్లలుకూడా వుండేవాళ్ళు ఆ స్కూల్లో ఏ కారణాల వల్లనో కాని సత్యం మా అందరికంటే పెద్దవాడైనప్పటికీ చేరీచేరటమే మా క్లాసులోనే చేరాడు మాఅందరిలో సత్యం ఇమడలేకపోయాడు. మాకు ఆలస్యంగాను సత్యానికి త్వరగాను పాఠాలు వస్తుండేవి చివరకు ఆయనకు వేరే క్లాసుపెట్టి చదువు చెప్పవలసివచ్చేది మిగిలిన మా అందరిలోకీ మళ్ళీ నాకు త్వరగా పాఠాలు వస్తుండేవి ఎప్పుడైనా మేస్టరుగారు మాక్లాసుకి సత్యాన్ని పాఠాలు చెప్పమనేవారు వాళ్ళందరికీ చెప్పబోయి వాళ్ళకు త్వరగా రాకపోవటాన విసుక్కుంటుండేవాడు నాకు చెప్పటం అంటే సరి చాలా సరదాగా చెప్పేవాడు చదువుకునేటప్పుడు ఎక్కువగా మేమిద్దరమే జంటగా తిరుగుతుండేవాళ్ళం మాయిల్లు వారియిల్లు దగ్గరగానేవుండేవి పైగా ఎక్కడో ఏదో కొంచెం బంధుత్వంకూడా కలిసివున్నదని పెద్దవాళ్ళు చెప్తుంటారు ఈ కారణాలవల్ల సత్యానికి ఫలానా వారమ్మాయినియిచ్చి చేస్తారట అనిజనం అనవసరంగా వాడుకలు పుట్టించారు అప్పటికి నాకంతగా ఏమీ తెలియదు సత్యానికిమాత్రం బాగా ఏమోకాని కొంతవరకైనా తెలిసే వుండవచ్చు నాకు తెలిసిం

దల్లా సత్యానికి బాగా పాఠాలు వస్తాయనీ, నాకంటే సరదాగా పాఠాలు చెప్తాడనీ, ఏదైనా తెచ్చిపెట్టమంటేసరి నాకోసం ఎంతకష్టపడైనాసరే తప్పకుండా తెచ్చిపెడతాడనీ, అంతవరకుమాత్రం తెలుసు స్కూల్లో తిరిమ్మ పిల్లలంతా అబద్ధాలాడుతుంటే వాళ్లేకాని సత్యంమాత్రం అబద్ధం ఆడడనీ, సత్యం సత్యమేననీ ఇదొక వాదుకకూడా

అప్పుడు సత్యంఅంటే నాకుచాలాఇష్టంగానే వుండేది తిరువాత నేనుకొంచెం ఎదుగుతున్నకొలదీ సత్యం సహవాసానికి మావాళ్లు నన్ను పోనిచ్చేవాళ్లు కాదు మా పెద్దవాళ్లు వాళ్ల పెద్దవాళ్లుకూడా బాగానే వుంటుండేవాళ్లు ఘనానావారమ్మాయిని సత్యానికి ఇచ్చి పెళ్లిచేస్తారట అని జనం చెప్పుకుంటూనే వుండేవాళ్లు జనం అవిసంగా చెప్పుకోగా చెప్పుకోగాచివరకు మా పెద్దవాళ్ళకుకూడా ఆ ఉద్దేశాలే కలిగినవి అంతలోనే నేను పెద్దదాన్నయాను

అంతకుముందే సత్యం చెబుతుండేవాడు ఇంకా కొద్దికాలానికి నిన్ను మీవాళ్లు చదువు మాన్పించటానికి ప్రయత్నించవచ్చు నీవు మాత్రం చదువుకోవలసినదేనని పట్టు పట్టుమని ఆయన చెప్పినట్లే ఇకస్కూలుకు పోవద్దన్నారు మావాళ్లు నేను పట్టు పట్టాను కాని లాభం లేకపోయింది నేను పెద్దదాననైన తిరువాతకూడా సత్యం ఏదైనా పనిమీద మా యింటికి వస్తూ వేవుండేవాడు మొదట మొదట సత్యానికి చాటుకు పోవాలో ఎదుట వుండాలో తెలిసేదికాదు నాలో ఏదోఒక కొత్తదనం రావటాన ఎదుటవుండటానికి సిగ్గుగా వుండేది నిన్నమొన్నటివరకు కలసిమెలసి తిరుగుతూ ఒక్కసారి చాటుకు పోపోయినా ఏమనుకొంటాడోనని వుండేది నాకు తెలియకుండానే రంకుపనులు చేస్తూనే వుండేదాన్ని సత్యంవచ్చినా మా అమ్మతోనో మా నాన్నతోనో మాట్లాడి పోయేవాడుకాని నాతో ఏమంత ఎక్కువగా మాట్లాడేవాడేకాదు

ఒక్కనాడుమాత్రం చేతిరుమాలమీద పన్నని మెలిక కుట్టుకుంటున్నాను నా దగ్గర సరీగా అలాంటిదే ఒకటివున్నది కాని సాదాగావుంటుంది, అదినీవు తీసుకుని ఇదినాకు ఇస్తావా అన్నాడు. అలాగే ఇస్తానన్నాను, ఒకసారి ఓ నేమో కథ వ్రాశావని, ఆకథ ఫెయిర్ చేసి పెట్టమని అడిగాడు. అలాగచేసి పెట్టాను అలాఆయన నాకేదైనా చిన్న చిన్న పనులు చెప్పుతుండటం నేను చేసిపెడుతుండటం అలవాటైపోయి ఎప్పుడుఏది చెప్పినా సరేలెమ్మంటుండే దాన్ని, ఒక్కసారి కోపోలు అన్నాడు నేను ఇప్పుడు ఏది చెప్పినా ఒక్కసారైన చెయ్యనంటావేమో అంటే అనవేమి? అని చెయ్యనని ఎందుకనాలి అన్నాను

కాదు సాధారణంగా ఇతరులు ఎప్పుడు ఏదో ఒకపని చెప్తూవుంటే విసుగ్గావుండదుమరి? అనే వారు నాకు అలావుండదని చెప్పేదాన్ని నిజంగా నాకు ఇంట్లో పనులకంటే సత్యమేదైనా పని చెప్తే ఎంతో సరదాగా చేసిపెట్ట బుద్ధయేది నాకలా వుండటానికి ఆశక్తి ఆయనలోనే ఏదోవున్నది నేను అలాగే ఆయన ఏబస్తీకవెళ్ళుస్తున్నారని తెలిస్తే సరి గాజులనీ, రిబ్బన్లనీ, ఏవేవో పనులు పురమాయించేదాన్ని ఆయన ఒక్కటికూడా మరచిపోకుండా తెచ్చిపెట్టేవారు అలా ఇద్దరం పూర్వంలాగానే స్నేహంగా వుంటుండేవాళ్లం తిరువాత సత్యానికి వున్న ఆస్తి కాస్తా వాజ్యంలో చిక్కుకుపోయింది అది అప్పట్లో తేలేటట్లుగాకూడా లేదు అందువల్ల నన్ను ఎక్కడైనా వేరేఇచ్చి వివాహం చేస్తే బాగుంటుందని మావాళ్లు ఆలోచించటం మొదలు పెట్టారు అప్పటినుండీ, ఎప్పుడో ఏమోకాని సత్యం మా యింటికిరావటం మానివేశాడు నాకు వేరే సంబంధాలు రావటం ప్రారంభించాయి నిజంగా నాకీ సంబంధం ఎంతమాత్రం ఇష్టంలేదు. అయినా మా నాన్నముందు మా వాళ్ళ పసిపిల్లకూడా ఎదురుచెప్పే వీలులేదు నాకువచ్చిన సంబంధాల్లో ఇంత నిక్షేపంలాంటి సంబంధాన్నే మావాళ్లు ఖాయం చేశారు

తిరువాత గండుమూడు రోజులకే నన్ను పెళ్లికూతుర్ని చేశారు. నాకు పెళ్లికళరాలేదనీ, నాకీసంబంధంఇష్టంలేకపోవటానికి కారణం సత్యానికి నాకు ఏదో ఉండివుంటుందనీ, అమ్మలక్కలంతా అప్పుడే చెప్పుకోవటం ప్రారంభించారట అదే అలాఅల్లుకుని అలా అల్లుకుని మా అత్తగారు మా వారివరకు కూడా పాకింది అదుగో పులి అంటే ఇదుగో తోక అనేవాళ్ళేకాని అసలక్కడ పులివున్నదో లేదో కొంచెం ఆలోచించి తెల్సుకోగల విజ్ఞానం మనలో

ఎంతమందివున్నది? వాళ్లిళ్ల మాటలునమ్మి మావారు, ఎలాగైనా పిల్లా జల్లా కలిగేటట్లుగా లేరు, పైగా సొమ్ముకూడా రాలేదని దీన్ని వెళ్ళగొట్టి ఇంకొక దాన్ని తెచ్చుకుంటే బాగా కట్నకొస్తుందని మా అత్తగారూ, ఇద్దరు ఏకమై నన్నీవిధంగా చేశారు. ఎవరైనా అదేమని అడిగితే ఒక్క పనన్నా ఒళ్లువంచి చేసేదికాదనీ, చెప్పినట్లుగా వినేదికాదనీ, ఎదురు తిరిగి ఏది పనిచేసే అదిఅంటుందనీ, అలాంటి దానితో మేమెట్లా కాపురం చేయించుకుంటామని చెప్తుంటేవాళ్లు. నేను ఇక్కడకు వచ్చినకొత్తలో ఆ మాటలు పట్టుకొని మా అమ్మకూడా 'మీరు ఇక్కడ వున్నాంకదా అని పరుగెత్తుకొచ్చావా? లేపు వాళ్లింక జన్మన్నా కట్టుకుంటే నిన్నుకూడా మూసెత్తిన ఎక్కడ ఎక్కించు కుంటామనుకున్నా. అయిన తరువాత వాళ్లుచెప్పినట్లుగా వినకపోతే ఎట్లాగనీ, వాళ్లు తిట్టినాపడాలి కొట్టినా పడాలి, తప్పుతుందామరి? ఈరోజుకే నేనుపడేవి నేను పడటల్లా? అనీ, చాటు చాటున కోప పడుతూ ఉండేది. నా బాధ్యత, తనమీద పడితేఎట్లాగా, అనే భయంవల్లను తినుకూతురు కాపురం చేయటం లేదని లోకం నిందిస్తుందనీ జంకువల్లను ఆ వేదనంతా భరింపలేకనో ఏమో, ఇలాంటి విషాదపరిస్థితుల్లో వున్న నన్ను ఆదరించటానికి బదులు ఒకొక్కసారి ఎంత ఉగ్రోషాన్నైనా వెళ్లబోసేది. అలాంటి పరిస్థితుల్లో నా స్థితిమరీ అధ్వాన్నమైపోయేది. నాకు శాంతి అనేది ఎక్కడ? ఎవరికైనా ఒకచోట దెబ్బతగిలితే ఇంకొకచోట విశ్రాంతిఉండాలి. ఆ మాత్రంకూడా స్థానంలేనప్పుడు మనమింకా ఈ బ్రతుకు బరువును మోయగలిగేదట్లా? ఫుట్ బాల్ ను తన్నినట్లుగా ఇటువస్తే వీళ్లొకతన్ను అటుపోతే వాళ్లొకతన్ను తన్నుతూవుంటే మనగతేంకాను? ఈ కష్టాలన్నీ ఎవరికి చెపితే ఎవరి హృదయంలో దాచుకోగలుగుతాను? ఈ అంతులేని కష్టపరంపర ఎప్పటికైనా దానంతట అది విరమించవలసినదేకాని ఎవరికి చెపితేమాత్రం ఎవరు తీర్చగలుగుతారు?

సత్యం వ్యాజ్యం జయించి తనకుతగిన ఇంకొక అమ్మాయిని వివాహం చేసుకొని వ్యాజ్యంతోపాటు జీవితాన్నికూడా జయించాడు ఎంత అదృష్టవంతుడు అని అనుకుంటుంటారేకాని ఆయనకుమాత్రం ఆ విశ్వాసంలేదు. అంటే తను వ్యాజ్యం జయించ లేదనీకాదు, తగిన అమ్మాయిని, వివాహం చేసు కోలేదనీకాదు. జీవితాన్ని జయించానన్న విశ్వాసం మాత్రంలేదు. నా వివాహమైన తరువాత ఆయన నేను రెండుమూడు సంవత్సరాలు మాట్లాడటానికి సంభవించలేదు. వారింట్లో వారెవ్వరూ మా యింటికి వచ్చేవారుకారు. మేమెవ్వరమూ వారింటికి వెళ్లేవాళ్లంకాదు. అందువల్ల ఎప్పుడైనా బజార్లో అలా పోతూవుంటే దూరాన్నుంచీ చూడటమేకాని, దగ్గిర్లో కలుసుకోవటంగానీ, మాట్లాడటంగాని జరిగేదికాదు. తరువాత వారిఅమ్మకు చాలా జబ్బుచేసింది. దాదాపు బ్రతకదన్న పరిస్థితుల్లో మేము వారింటికి వెళ్లటం, తరువాత తరువాత వారుకూడా మా యింటికిరావటం జరుగుతూ ఉన్నది. సత్యము నేనుకూడా మామూలుగానే మాట్లాడు కుంటుండేవాళ్లం. మా పెళ్లిళ్లు కాకముందులాగా అంతచనువుగా మాట్లాడుకునేవాళ్లం కాదు. ఎక్కువగా నేను నా కష్టాలను గురించే చెపుతుండేదాన్ని. ఆయన చాలాబాధపడుతుండేవాడు. నాకష్టాలు అలా చెప్పి చెప్పి ఆయన మనస్సును పాడుచేయటం నాకంత ఇష్టం ఉండేదికాదు. అందుకని నేను మాఅత్త గారింటి దగ్గరనుండి వచ్చిన కొత్తరోజుల్లో ఏమిటి సంగతులు? అని ఆయన అడిగినా ఏమీలేవు సంగతులు అనేదాన్ని. ఒకొకసారి నేను అలా అన్నప్పుడు నా పరిస్థితులు తనకు తెలియచేయటం లేదని ఆయనకుఎంతో కష్టంగావుండేది. నేనేమైనా ఆయన్ను అడిగితే ఆయనకూడా చెప్పేవారుకాదు. నేను నా కష్టాలనుగురించి చెప్పకపోతే ఆయన బాధ పడ్డారనిగానీ, నేనే చెప్పకుండా దాచుకోలేక పోవటం వల్లగాని ఎక్కువగా చెపుతూనేవుండే దాన్ని. నేను మావారి మనస్తత్వాన్ని గురించిచెపుతూ వుంటే ఒకొకసారి ఆయనముఖం కోపంతోఎర్రబారి, విచారంతో కమిలిపోయేది. మీరుమాత్రం తగిన ఆమెను వివాహం చేసుకొని వ్యాజ్యంతోపాటు జీవితాన్నికూడా జయించారు అన్నా నొకసారి ఆయన్ను విచారాన్నుంచి మరల్చటానికి. నీవిలాంటి బాధలనుభవిస్తున్నంతవరకు నేను నా జీవితాన్ని జయించాననుకోలేను అన్నారు. ఆయనకు నామీద వున్న ఇలాంటి కరుణవల్లను, నన్నుపూర్తిగా అర్థం

చేసుకున్నందువల్లను, నాకు ఆయనమీద ఎంతైనా అభిమానము, గౌరవము ఆదరము ఉంటుంది కాని అంత కన్నా ఇంకేమీ లేదు. ఇదంతా ఇతరులు అర్థం చేసుకోవాలంటే సాధ్యమా? ఆలోచనతో నిమిత్తం లేకుండా ఎవరిష్టం వచ్చినట్లు వారు చెప్పుకుంటారు

నేను మా యింటికి వచ్చినతరువాత అప్పటికింకా మంచిచీర కట్టుకోనిగానీ, తలలో పూలు పెట్టుకోనిగాని ఎరుగను ఎందుకో ఒకసారి డ్రామాకు వెళ్లాలనిపించింది అందరూ వెళ్తూ నన్ను కూడ రమ్మంటే, సరేనని ఆరోజు ఇస్త్రీచీరకట్టుకొని ఇస్త్రీజాకెట్ తొడుక్కుని ఒకసారి అద్దంలో చూచుకునేటప్పటికి తల్లో పూలుకూడా పెట్టుకుంటే బాగుండుననిపించింది నాకు తెలియకుండానే నేను వెళ్లే దారిలోనే సుబ్బమ్మగారి ఇల్లుంది ఏకాలంలోనైనాసరే వారింట్లో ఏవో ఒకపూలు పూస్తూవుంటవి. మా పొరుగింటామెకదా అని పూలు కోసుకోటానికి వారింటికి వెళ్లాను అంతా పూరికివెళ్ళటాన ఆమె ఒక్కతే వున్నది ఆ ఇంట్లో ఆమె నాకు ఎదురు వచ్చి ఎక్కడికి? ఏమిటి? అని అడిగిందాశ్చర్యంగా డ్రామాకు వెళ్తున్నామన్నాను

డ్రామాకువెళ్తే ఇస్త్రీ చీర కట్టుకోవాలా? అన్నది మళ్ళీ

పదిమందిలోకి వెళ్లేటప్పుడు మామూలు చీరైతే ఏం బాగుంటుందని కట్టుకున్నాను పూలున్నవిగా మీచెట్టున - అంటూనే చెట్టుదగ్గరకు పోతున్నాను

ఎవరెవరు వెళ్తున్నారు డ్రామాకు? వెళ్తే పూలెందుకు? అని ప్రశ్నలమీద ప్రశ్నలు కురిపిస్తూనే వున్నదామె నేనామె ప్రశ్నల్లో కౌటిల్యాన్ని గ్రహించక పోలేదు నాఅంతటనాకు ఎన్నాళ్ళకో పూలుపెట్టుకోవాలనే కోరిక కలగటంవల్ల ఆమె మాటలను లక్ష్యపెట్టకుండా అలాగే పూలుకోశాను కాని ఆమెమాత్రం ఏవిధంగానైనాసరే నా ఉత్సాహాన్ని చంపివేయాలనే ధోరణిలోనే వున్నది. గచ్చుమీదకూర్చుని పూలు ముందువేసుకొని తల్లో పెట్టుకోటానికి వీలుగా ముడుస్తున్నాను

భర్తదగ్గర లేకపోతే పతివ్రతలు పూలుపెట్టుకోరు అన్నదామె పుటుక్కున ఆ మాట కొంచెం మందగించిన నా ఉత్సాహపు పుటలలో ఒకపిడుగు పడినట్లైంది. అయినప్పటికి సమాధానం చెప్పకుండా వుండటం ఏమంత బాగుండదని ఆ న క టి రో జుల్లో ఎవరో చేశారని ఇప్పుడెలా ఎవరు చేస్తున్నారు? అన్నాను ప్రొంగిపోతున్న ఉత్సాహంలోనుంచి కొంచెం తెప్పరిల్లుకుని

'పనేమిటి? ఇప్పుడైనా భర్తదగ్గరలేనివాళ్లు భర్తమీద ప్రేమకలవాళ్లైతే పూలుపెట్టుకోక, ఎక్కడదాకానో ఎందుకు? మాచెల్లెలి భర్త జైల్లో వుండగా మా చెల్లెలు ఒక్కనాడైనా తల్లో పువ్వు పెట్టుకోలేదుగదా? భర్తమీద ప్రేమగలవాళ్లెవరైనా అంతే అసలదిపతివ్రత లక్షణంకూడా.' అన్నదామె మళ్ళీకొంచెం ఉద్రేకంతో వాళ్ళచెల్లెలు పూలు పెట్టుకొనేదో లేదో నాకాజ్ఞాపకం లేదుగాని వారానికి రెండుసార్లయినా సినిమాలకనీ వాటికనీ, వీటికనీ ఎక్కడికో ఒక చోటికి పోతూనేవుండేది ఆమె భర్త జైల్లోవున్నాడని ఆమె మంచి మంచి చీరెలు కట్టుకోకపోవడంగానీ, సరదాగా వుండక పోవడంగాని ఏమీ వుండేదికాదు అంతామామూలు గానే వుండేది అన్ని విషయాల్లోను మామూలు గానే వుంటూ పూలెందుకు పెట్టుకునేదికాదో మరి నాకర్థంకాలేదు బహుశః ఏ శాస్త్రాన్నో పట్టుకుని అలావుంటేగాని పతివ్రతేమో కామేమోనని అలా చేసివుండవచ్చు

నిజమే ఆమెఅన్నట్లు ఆమె చెల్లెలికి భర్తమీద ప్రేమ ఎక్కువగా వుండటానే పూలుపెట్టుకోలేక పోయిందేమో వాళ్ళు భార్యాభర్తలు ఒకరికొకరు తగినవారు కావటాన బాగా మనస్సులు కలిసిపోయి వుండవచ్చు వాళ్ళకు అన్నీ కలసివచ్చినవి వాళ్లు శుభసమయాల్లోనైనా కష్టసమయాల్లోనైనా మంచినే సంపాదించుకోటానికి అవకాశములున్నై కాని నేనో, నాకు నిజంగా వారిమీద అంత ఎక్కువగా ప్రేమలేనిమాట వాస్తవమే అది నాతప్పా? నాకు తగినంతలో నేను కాంక్షించినదేదీ వారిలో లేకపోవటం తప్పు ఉన్నదేదో ఉన్నది తెమ్మని కొంత సానుభూతితో ఆలోచించుకుని ఆత్మసంతృప్తి అయినా పొందుతుండేదాన్ని ఇదివరకు నన్నివిధంగా చేసిన తరువాత అదికాస్తా పోయిందిమరి. దానికి నేనేం చేయగలను? ప్రేమవుండడం లేకపోవటం మాట అలావుంచి జీవితంలో సుఖదుఃఖాలు ఎప్పుడైతే పోతవో సాధారణంగా అప్పుడే ప్రతివస్తువుమీద

## [illegible]

ఇది రక్తవృద్ధిని చేయు విలువ గల వస్తువులచే తయారు చేయబడినది. మేహములు, [illegible] నిస్సత్తువ, కళ్ల నష్టము, అతిమూత్రము మొదలగు వాటిని ఖండించి, మంచిబలమును వీర్యపటుత్వమును కలిగించుటలో అద్భుతమయినది అనేక సర్టిఫికెట్లు గలవు 2 డబ్బీలు చాలును

**20 తులముల డబ్బీ రు. 2/-**

**పోస్టేజి ప్రత్యేకము.**

## పి. సి. ఏ. అండ్ కంపెని

ఆయుర్వేదసమాజం

కె రి దే పి, (నెల్లూరు జిల్లా)

## కుష్ఠు ★ బొల్లి

వగైరా మేహ మచ్చలు, సెగ. సవాయి వ్యాధులకు గ్యారంటీ చికిత్స, క్యాటలాగు ఉచితము.

---

## జి. వి. రెడ్డి అండ్ కో

(రిజిష్టర్డు)

"భాస్కరాశ్రమము"

గోపాలపురం, తూ. గో. జిల్లా.

## ఆర్షరసాయనశాల ముక్త్యాల, కృష్ణా

స్థాపితము 1925.

**ప్రశస్తాయుర్వేదౌషధములకు నిలయము. ఏ మందు కావలసినను మాకు వ్రాయుడు. నమ్మకమైనవి లభింపగలవు**

---

ఆయుర్వేదభూషణ

**వేటూరి శంకరశాస్త్రి,**

ఎ. ఎం. ఏ. సి.

Consulting Physician



విరక్తి కలగటం సహజం. నా వరకు నాకు ఇక్కడకు వచ్చిన తరువాత అలంకరణమీదనే అభిలాష నశించింది. అదేమిటో గాని ఆ అలంకారానికి సంబంధించిన ఏ వస్తువు కనపడినా అది నాకు సంబంధం లేనిదిగానే వుంటుంది. ఎవరైనా సహృదయులు ముత్తయిదువతనానికి గుర్తు పూలు వద్దంటూ వేమని తల్లో పెడుతూవుంటే గట్టిగా వారించలేను. గట్టిగా వారించటానికి మాచేవాళ్ళు ఇదో కళంకం అనుకొంటారని కూడా భయమే. భర్త దగ్గర లేనంతమాత్రాన పూలు పెట్టుకుంటే పతివ్రతలం కాకుండా పోతామనే భయం నాకు లేకపోటాన అంతగట్టిగా వారించవలసిన అవసరంకూడా రాలేదు. అసలు నా అంతట నాకే పూలు పెట్టుకోవాలనే కోర్కె అంత ఎక్కువగా ఎందుకు కలిగిందో నాకే ఆశ్చర్యమౌతుంది. అసలు నా మనోవైరాగ్యభావాన్ని తెరలు తెరలుగా ఆవరిస్తున్న పూర్వ సంస్కారములను ఆ సుబ్బమ్మగారి ప్రశ్నపరంపర ఎక్కడికక్కడే పటాపంచలు చేసేసింది. అంతే ఆ రోజుకి ఈ రోజుకీ కూడా నాకు మళ్ళీ తల్లో పువ్వులు పెట్టుకోవాలనే కోరిక కలగలేదు.

ఏమిటో లే, మొగుడు ముండా అంటే ముష్టి కొచ్చినవాడూ కూడా ముండా అన్నాడట. అట్లా ఇప్పుడు నేనందరికీ అలుసే. ఎప్పుడైనా సాయంత్రం పూట ఏమీతోచక అలా వాకిట్లోకి వస్తే ఆ కృష్ణమ్మగారుకూడా అలాగే. నేనుఎప్పుడో ఒకసారి వస్తాలెమ్మన్నా వినిపించుకోకుండా, ఆమాంతం చెయ్యిపట్టుకొని వాళ్ళఇంట్లోకి లాక్కెళ్ళి కూర్చోబెట్టుకొని ఇక ప్రారంభిస్తుంది. పనంతా అయిందా? అంటుంది ముందు. ఇంకా వంటకాలేదు మా అమ్మచూస్తున్నది వంటపని అంటాను.

మీ అమ్మ చూసుకపోతే మీ వదినేం చేస్తున్నది అంటుంది మళ్లీ. మాఅమ్మకు కావలసినవన్నీ అందిస్తున్నది అని చెప్పగానే ఇక తనకేమీ సందు దొరక్క, ఊఁ లేక ఏమిటిలే నీ వదినే బాగున్నది హాయిగా నిజంగా నాకీ పిల్లలుండబట్టిగాని లేకపోతేనా? అంటుంది వ్యంగ్యంగా. అది నేను గ్రహించి - అంతహాయిగా ఉంటుందనుకుని పెళ్లి పోవాలంటే పిల్లలుమాత్రం అడ్డంవస్తారటలే, అనేదాన్ని. నేనెప్పుడు వినిపించినా సరే ఏదో రకంగా ఎత్తిపొడుస్తూనే ఉంటుందావిడ. బయట చూస్తే ఈ విధంగా వున్నదా ఇక ఇంట్లో మావదిన ఏవిధంగా వుంటుందో.

నేను ఇక్కడకు వచ్చినతరవాత వాడు మళ్లీ పెళ్లి చేసుకోవటముందు అయిదారు మాసాలవరకు మా అమ్మ ఎప్పుడూ నా మీద కోపంగానే వుండేది. తన కొడుకువల్ల కష్టంకలిగినా ఆకోపమంతా కూడా నా మీదనే చూపిస్తూవుండేది. ఆమె అలాచేస్తూ వుంటే, నేనీవిధంగా కాబట్టికదా నన్నీవిధంగా బాధించినా ఆమె నాలో లోలోపల మరుగుతున్న దుఃఖం ఒక్కసారి పొంగులుగా వచ్చేది. ఆ పొంగును ఆర్పటానికి నేను లేనిశక్తిని తెచ్చుకో వలసివచ్చేది.

నేనెంత సూక్ష్మంవిడిచి చెప్పినాకాని మా అమ్మ అసలు నేనేదో ఎగురుమాట్లాడివుంటానని, పనులేవీ సరిగ్గా చేయలేదనో అనుమానంగానే ఉండేది. ఆమె అవిధంగా నన్ను అనుమానిస్తూవుంటే ఆమె హృదయంలో ఎక్కువభాగం చీకటితెరలు ఆక్రమించినవేమో నన్నంత బాధపెట్టేదాన్ని. తల్లిని బిడ్డ అర్థంచేసుకోలేకపోవటం ఎక్కడైనా సంభవం, సహజంకూడా కావచ్చునేమో కాని బిడ్డను తల్లి అర్థంచేసుకోలేకపోవటమంత అన్యాయం ఎక్కడా లేదేమో. తననూ తల్లే అర్థంచేసుకోకపోవటంకంటె పైగా ఆపదలో కూడా ఉన్నప్పుడు మనుష్యుల కంతకంటే వేరే బాధ అనేది ఎక్కడ వుంటుంది?

వాడు పెళ్లిచేసుకున్నదాకా అంటే ఇక నన్ను అక్కడకు పంపించే ఆలోచనలు అంతరించేవరకూ మా అమ్మ నన్ను ఆ విధంగానే ఒత్తిడిచేసింది. ఆ పరిస్థితుల్లో మా అమ్మతప్ప నన్ను ఆదరించటంలో మా వదినగానీ, ఇంకే ఇరుగుపొరుగువాళ్ళయినా కొంత దయచూపించింది. వాడు మళ్ళీ పెళ్ళిచేసుకున్నారు. మా అమ్మ మనస్సు విచిత్రంగా మారిపోయింది. ఆమె కెందుకో నా మీద జాలి ఏర్పడం కలిగినది. ఆమె హృదయంలోని చీకటితెరలు చించుకుపోయినవి. ఆమె హృదయంలోని వెన్నెల కాంతులు నామీద ప్రసరించసాగినవి. కాని అప్పటి నుంచీ అంటే ఇక నేను నా యింట్లోనే వుండటం ఖాయమని తేలినప్పటినుంచీ నా కష్టాలు ఇంకొక రకమైన తీవ్రస్వరూపం దాల్చినవి. మా అన్నయ్య

పనినలు మాకు పూర్తిగా వ్యతిరేకమైనారు ఆఖరికి మా అక్కచెల్లెళ్ళదగ్గరనుంచి కూడా వ్యతిరేకతే ప్రారంభమైనది అయినప్పటికీ ఈ భారాన్ని తాళంటే మా అమ్మ ఎక్కువగా మోస్తూ వుంటాన నాకు కొంత సులభమేఅయింది కాని నే కొంత పనిచేస్తున్నా ఇంకా పనిచెయ్యటం లేదని, నాకు అంత ఖరీదుగల చీరెలు జాకెట్లు ఎందుక్కావాలని ఏవోరకంగా మా వదిన, అక్కచెల్లెళ్ళు అందరు పేచీలు పెడుతూ నేవుంటేవాళ్ళు అంటే దానికి కాపురమా కాలిపోయిందా? ఏ గుడ్డలిస్తే మాత్రం ఏం కట్టుకు నింట్లో పడుంటేదానికి? అనే ధోరణిలో మాట్లాడుతూవుంటేవాళ్ళు వాళ్ళంతా అయినా వీటెని నే నేమంత లక్ష్యపెట్టలేదు నేనింకా ఎక్కువ విచారంలో మునిగిపోటానికి వేరే కారణం వున్నది

మా నాన్నగారు నా పెండ్లికాకముందు, అయిన తరువాతకూడా కొంతకాలంవరకూ, మనిషిని చూస్తేనే భయంగాను, ఎంతో హుందాగాను వుంటేవారు అలాంటివారల్లా ఒక్కగానొక్క కొడుకైతే మా అన్నయ్యకూడా తనమాట వినకపోవటం, కేవలం భార్యను వాళ్ళవైపు వాళ్ళను వినకవేసుకుని ప్రతి దానికీ తయ్యారికీ కాలుదువ్వటం, ఒక్కడుగదా ఏవిధంగానైనా చదువు చెప్పించి అభివృద్ధిలోకి తీసుకురావాలంటే చదువుకోకపోగా ఎక్కడ అప్పులు పుడితే అక్కడల్లా నోట్లువ్రాసి అప్పులు చేయటం, ఇవన్నీ మొదలుపెట్టేసరికి అదోక విచిత్రంగా మారిపోయారు అంతకుపూర్వం వున్న గంభీరత, ఇంట్లోవాళ్ళను గడగడలాడించటం అదంతా మారిపోయింది మరీ మా సంసారం అట్లా అయిన తరువాత ఆయన కసలు మతేపోయింది ఆయన మనస్సుతోపాటు ఆరోగ్యం కూడా పూర్తిగా చెడిపోయింది నేనిక్కడకు రావటాన్నిగురించి మేమంతా అనేకవిధాలుగా కిందా మీదా పడుతూ వుంటేవాళ్ళమా? ఆయన ఒక్కనాడైనా నాతో ఏమిటిది అనిగాని, నీవు వెళ్ళు, వెళ్ళవద్దు అనిగాని ఒక్కసారికూడా నోటా వల్లాపట్టి అడిగిన పాపాన పోలేదు మానవుకు కాని మా అమ్మ ఇలా మొదలకుండా పూరుకుంటే ఎట్లామరి? అసలు సంగతేమిటో కనుక్కువిరాక అని అనగా అనగా ఒకసారి కాలోలు కయులుదేరి వెళ్ళారు మా అత్తగారి వూరికి, పెళ్ళటం కూడా వారింటికే వెళ్ళారు. ఎందుకలా పంపించాలిసొచ్చింది? ఎన్నడు మాపోటివాళ్ళకన్నా ఎదురు చెప్పే పిల్లకాదే మా పిల్ల లందర్లోకీ ఈ అమ్మాయి ఇంకా నిదానమైనది ఏమిటిదంతా? అని అడిగారట వారిని

మీ పిల్ల మీకు ఎదురు చెప్పకపోతే అందరికీ ఎదురు చెప్పదని నమ్మక మేమిటి? అది ఎన్నెన్ని చిత్రాలు చేసిందో మీకేం తెలుస్తుంది మేం చెప్తే మాత్రం మీరు నమ్ముతారా? అని మా అత్తగారు అందుకున్నదట

మీ రుండండి మిమ్మల్ని కాదు నే నడిగింది ఆయన్ని సమాధానం చెప్పనివ్వండి అన్నారట మా నాన్నగారు

ఇంకా ఇంతమంది చెప్పటాని కేమున్న దక్కడ? ఎవరుచెప్పినా అదే—అన్నారట వారు సరే మీ అల్లుడిచేతనే చెప్పించుకోండి నేనొద్దన్నానా అని మా అత్తగారు అన్నదట

ఒకరడిగే దేమిటి ఒకరు చెప్పేదేమిటి నా జోలి ఒకరి కెందుకు? నా యిష్టం వచ్చినట్లు నేను చేసుకుంటాను ఒక రెవరు నన్నడిగేటాని కసలు— అని వారు కోపంగా మాట్లాడారట

ఇట్లా తొందరపడి మాట్లాడినంత తేలికగా పోతుందా అబ్బాయి చేసుకున్న తరువాత అని మా నాన్నగారు అనేటప్పటికి

పోకపోతే చేతనైందేమైనా వుంటే చేసుకో పోయి ఇదిమొదలు చేసుకుని నా వాకిలిచాయలకు రాకోకండి ఎవరైనాసరే—అని లేచివెళ్ళారట

అంతే అప్పటినుంచీ ఇక నా విషయంలో ఆయనకు పెద్ద విచారం ఏర్పడిపోయింది మనస్సులో ఆయన వ్యాధి కూడా ఇంకా ఎక్కువ కావటం మొదలు పెట్టింది వారు మళ్ళీ పెళ్ళిచేసుకున్న తరువాత ఆయన వ్యాధి ఇంకా ప్రబలమై చివరకు ప్రాణాలు కూడా విడువవలసి వచ్చింది మా నాన్న ప్రాణం పోయేటప్పుడు ఆ బాధ చూడలేక నేను చాటుకు పోయి కళ్ళనీళ్ళు పెట్టుకుంటున్నప్పటికీ ఆయన ప్రాణం పోయేటప్పుడు కూడా నన్నే తలుస్తూ వుండటం నాకు కూడా వినబడుతూనే వున్నది తను పోతున్నానే అనీ, నేను కష్టంలో వున్నాననీ, నాకు బాగా జరుగుతుందో జరగదోననీ, ఆయన

భయం. అందువల్లనే ఆయన నన్నంతగా తలుస్తూ ప్రాణాలు వదిలారు.

అప్పటినుంచీ ఇక నా కష్టాలు అడుగుతారు. అంతకుముందు నే ననుకుంటుండేదాన్ని—జరిగిందేదో జరిగింది మా అమ్మా నాన్న బాగుండగానైనా నేను చనిపోతే బాగుంటుందని కాని నేను జీవితంలో వటి! భయపడ్డానో అవల్లా నాకే జరుగుతూ వచ్చినవి అక్కడినుంచి ఇక్కడికి రావటం ఇంటికి దూరమై చెట్టునీడకు వచ్చినట్లయిం దిప్పుడు నాపని మా అమ్మ కెప్పుడూ నామీద ఎంత ప్రేమవుంటే మాత్రం ఏంచేయగలుగుతుంది? మా నాన్న వున్నప్పుడే అంతంత మాత్రమాయె మా నాన్న పోయిన తరువాత మా అమ్మ నోరెత్తటానికే వీలులేకుండా పోయిం దా యింట్లో ఆమె మా అన్నయ్యదగ్గర మనోవర్తి పుచ్చుకోవలసిన పరిస్థితుల్లో ఇంకా నన్నేం పోషించగలుగుతుంది? ఈ పరిస్థితుల్లో నా పౌరుషం కోపమని నా భారాన్ని కూడా ఆమె మీద మోపి ఆమెను బాధించేకన్నా ఎన్నికష్టాలైనా రానీ, నా భారాన్ని నేనే మోయాలి ఈ పని చేయాలంటే మళ్ళీ అక్కడికే వెళ్ళక తప్పదు ముమ్మాటికీ తప్పదు. కాని నిజంగా అలా చేయగలనా? ఏదో నిరాశామూలాన కలిగే నిస్తబ్ధతవల్ల అలా అనుకోవటమే కాని చెయ్యాక ఏంచేస్తాను? జీవితంలోని ఈ నిస్తబ్ధత సర్వనాశానికే దారితీసేదిగా కనబడుతూ వుంది ఈ నిస్తబ్ధతనుంచీ బయటపడాలి అంటే తప్పకుండా మళ్లీ అక్కడికి వెళ్లాలి ఇప్పుడు అక్కడి పరిస్థితులు వెనకటి పరిస్థితులు కావు. ఆనాటి అత్తగారు లేదు. వారిలో కూడా వయస్సును బట్టి అయితేనేం, అనుభవాలనుబట్టి అయితేనేం, ఆనాటి దుందుడుకుతనమూ లేదు. నిజంగా అంత దుందుడుకుతనమే ఉంటే మళ్ళీ రమ్మంటారా? పరిస్థితులు మార్పు మానసికమైన మార్పుకూడా తోడ్పడవచ్చు. ఈ అవకాశాన్ని పురస్కరించుకుని వారిలో మార్పు తీసుకురావటానికి ప్రయత్నించ చేయాలి ఈమాత్రం నేను చేయలేకపోతే నా బాధలు నాకే కాకుండా ఇతరుల కష్టాలను ఇనుమడింపచేయటానికి కూడా తోడ్పడతవి నా క్షేమంకోసం కాకపోయినా కనీసం నా సంబంధీకుల క్షేమంకోసమైనా మళ్ళీ అక్కడకు వెళ్లితీరాలి కాని అబ్బబ్బ నా జీవితాన్ని నేనే ఒకసారి పునరాలోకనం చేసుకుంటున్నప్పటికి ఆ సంఘటనలన్నీ కళ్ళల్లో కదలు త్రొక్కుతూ హృదయంలోకి దూసుకుపోతున్నై, ఈ ఆలోచనలతో నా మెదడు చుట్టలు తిరిగిపోతూ వున్నది ఈ బాధలతో నా హృదయం రక్తాన్ని చిమ్ముతూ వున్నది నా తెలివితేటలు ప్రతిభ, యావనము అన్నీ మిళితమై మసై ఈ చుట్టలు తిరిగిన రక్తపు పేరులలో కలిసిపోయినవి ఇంకా నాకు స్వతంత్రతేమిటి? ఆలోచనేమిటి? నిర్ణయమేమిటి? ఈ సమాజంలో ఇదేనా నా స్థానం? ఇదేనా భారతనారీమణుల సౌశీల్యసంప్రదాయం? ఇదే కాబోలు భారతనారీమణులు గవర్నర్లుగా వుండటం, మంత్రులుగా వుండటం, విదేశాంగ రాయబారులుగా వుండటమూను!





సీతారామ లక్ష్మణులు.

# దెందుకూరి శిథిల శిల్పసంపద

★

శ్రీ కొ. రాఘవాచారి

నైజాము మండలములోని మధిర తాలూకాకు చెందిన దెందుకూరు గ్రామములో ఆంజనేయ స్వామి దేవాలయము ఒకటి కలదు ఈ ఆలయ ప్రాంగణములో ఒక సత్రమును నిర్మించు నుద్దేశ్యముతో శ్రీమతి కపిలవాయి సీతమ్మగారు ఆలయపు దక్షిణభాగములో పునాదులు త్రవ్వించుచుండగా రెండున్నరగజముల లోతున, ఒకదానిపై నొకటి పేర్చియున్న విగ్రహములు ఇరువదిఒక్కటి బైట పడినవి ఇక్కడి బొమ్మలో వాటిని చూడవచ్చును

క్రింది వరుసలో పద్మాసనస్థులైనవారు ఏడుగురున్ను, వెనుక నిలచియున్నవారైదుగురున్ను చేరి పన్నిద్దరాళ్వార్లు ఇరుప్రక్కల త్రిభంగిని, నిలచియున్నవారు ద్వారపాలకులు. మధ్యభాగములో సీతారామలక్ష్మణులు లక్ష్మణునికి కుడిప్రక్కున గరుడాళ్వారు పై పటములో సీతారామలక్ష్మణుల మూర్తులు పెద్దవిగా చూడవచ్చును

వాని పీఠములు ప్రత్యేకముగా పద్మములుగా మలచుటకు వీలు లేకపోవుటచేత కాబోలు, పాదముల దిగువ పద్మములను అర్ధశిల్పముగా మలచినారని యూహించవచ్చును. విగ్రహములకు దిగువనున్న రాళ్లపలకల రాతి మేకులనుబట్టియు, విగ్రహముల చిన్న పొడవునుబట్టియు (మూడున్నర అంగుళులు) ఈ విగ్రహములు ఏదేనొక పెద్దదేవాలయ ప్రాంగణములో నిర్మించిన చిన్న కోదండరామస్వామి ఆలయములో ప్రతిష్ఠ చేయబడియుండునని యూహించ వీలగుచున్నది

ఈ ఆంజనేయ ఆలయప్రాంగణములోనే ఈ విగ్రహములు దొరుకుటకు రెండు నెలలు ముందుగా, శాల్గొన్నర అడుగులు ఎత్తుగల ముఖమంటప శిల యొక్కటి లభించినది. దీనిపై, ప్రాచీనాంధ్ర లిపిలో ఎనిమిది పంక్తుల దానశాసనమొకటి ఉన్నది. అది ఇది

"స్వస్తి శ్రీ మన్మహా మండలేశ్వర మన్మ భా
గి గణపయ రాజులు కొలని కేశ
దేవరకు రెండు మత్తురులు వేసవి వా
న కాలాలు ఆచంద్రార్క స్థాయిగా విస్తిమి"

దీనినిబట్టి ఈ ఈప్రాంతములోనే కేశవస్వామి ఆలయము ఒకటి పెద్దగ వుండియుండునదియు, పైన చూపిన కోదండరామస్వామి ఇత్యాది విగ్రహములు ఆకేశవస్వామి ఆలయములో నుండిన చిన్న దేవాలయములోనివైయుండునని ఊహించుచున్నాము.

పైన చెప్పిన (ఆంజనేయస్వామి) ఆలయములో ఇంతకు పూర్వము, ఈరీతిగనే ఆంజనేయ విగ్రహము, రెండు శివలింగములు, పూర్వపు దేవాలయములకు సంబంధించిన పునాదులు, బైటపడినవట గ్రామీణులలో పెద్దలైన శ్రీకపిలవాయి కృష్ణయ్య గారు ఆంజనేయ విగ్రహమును మాత్రము నేటి ఆలయములో ప్రతిష్ఠించి, శివలింగములు భిన్నమైనందున ఆలయప్రాకారములోనే పూడ్చించిరట నేటికిని, ఆలయప్రాంగణములో రెండు పాతపానవట్టములు, వినాయకుని విగ్రహము, దేవీ విగ్రహములు విడిగా కనబడుచున్నవి.

ఈ చెందుకూరుగ్రామము నూరు, నూటయాభై సంవత్సరముల పూర్వము ఏర్పడినదని, అంతకుముందు ఈ ప్రదేశములో సారంగపట్టణము పేర ఒక పట్టణము వుండేదని ఒకశ్రుతి. ఈ పట్టణము అనేక శైవ, వైష్ణవ దేవాలయములకు ఆటపట్టని ప్రసిద్ధి.

దొరికిన విగ్రహములు వరివిగా శైవ, వైష్ణవ సాంప్రదాయములకు చెందియుండుటనుబట్టి, ఈ జనశ్రుతి సత్యమే యైయుండునని మనవిచేయుచున్నాము. శాసనపు లిపి కాకతీయ యుగమునకు అనంతరపు లిపివలె గోచరించుచున్నది. కాకతీయులు పరమశైవులు వీరి పతనానంతరము, తెనుగు దేశము నేలిన రెడ్డిరాజులు శైవులే అయినను,



పన్నిద్దరాళ్వార్లు

శ్రీరంగమునుండి, ఉత్తరాదికి వచ్చిన వైష్ణవస్వాముల బోధవల్ల వైష్ణవాలయములుకూడ కట్టించినట్లు కొన్ని కొండవంటి వైష్ణవ క్షేత్రములు సాక్ష్యమిచ్చుచున్నవి. పన్నిద్దరాళ్వార్లు, గరుత్మంతుడు, (బహుశా ఆంజనేయస్వామికూడ యుండియుండును) ద్వారపాలకులు చేరిన నిండోలగముతో సీతారామలక్ష్మణులుండిన పూర్ణవైష్ణవ సాంప్రదాయము కడపటి రెడ్డి



దానశాసనము.

రాజుల కాలములో గాని కడతేరియుండదనియూహించుచు, ఈ విగ్రహములు పదునైదవ శతాబ్దము నాటివియయుండునని యూహించుచున్నాము. (వైఖానసమును, ఈ విగ్రహములను ఒకే కాలమునకు చెందియుండునను యూహ సత్యదూరము కాకపోయినను, నిర్ధారించి చెప్పుటకు వీలు లేనిది) శిల్పమైనను మూర్తి వైష్ణవమత సాంప్రదాయ విజృంభణకు నాందీ రూపము సాంకేతిక సాంప్రదాయము ననుసరించినట్లున్నది గాని, దేశమునందు స్థాయిగానుండి, పూర్ణ వికాసము చెందిన శిల్పసంపదకు చెందినట్లు లేదు విన్యాసములో కాకతీయ సాంప్రదాయమునకు చెందిన లాలిత్యము గోచరించుటలేదు అట్లని విజయనగరకాలపు పూర్ణవికాసముకూడ కనబడదు ఈకారణములచే, ఈ విగ్రహములు కాకతీయ, విజయనగర కాలములకు నడిమికాలమునకు చెందినవని యూహచేసినాను విగ్రహములన్నియు ఒకదానిపై నొకటి పేర్చి, భూస్థాపితము చేయబడియుండుటను బట్టి ఏభామినీసుల్తాను కాలములోనో ఇవి నాశనముచేయబడునను భయము కలుగ, భక్తులు వీటిని భూగర్భమున దాచి, ప్రాణరక్షణకు దక్షిణాదికి తరలియుండురేమో యని యూహించవచ్చును కనుక ఈ ప్రాంతమునందు విరివిగా భూగర్భపరిశోధన చేసినచో పైన చెప్పిన సంధికాలపు సంఘచరిత్ర నిర్మాణమునకు సాయపడగల శిలాశాసన విగ్రహసంపద విరివిగా లభించునని మనవి చేయుచున్నాను

# పోయిన పుటలు



## శ్రీ అంగర వెంకటకృష్ణారావు

నేను అదనపుజిల్లా మేజిస్ట్రేటువద్ద క్యాంపు గుమాస్తాగా వున్న రోజులలో జరిగిన వొక సంఘటన, నన్నమాంతంగా వొక దశాబ్దానికి పైగా వెనక్కు నెట్టింది

ఆ రోజులలో నాకు రోజూ వొక అరగంట సంక్షిప్తలేఖనం, సుమారొక గంట టైపుపని వుండేది మా ఆఫీసరుగారు న్యాయమైన ప్రభుత్వాధికారి, నిజమైన ప్రజాసేవకుడు ఇంటికి రావొద్దని చెప్పిన గజెటెడ్ ఉద్యోగి నా యెరికలో అతనొకడే

కాని నే నక్కడ అట్టే కాలం మనలేకపోయేను. అక్కడ నా జీవితం నిర్మానుష్య ద్వీపంలో 'క్రూసో' బ్రతుకులా వుండేది మోసం ఉచ్ఛ్వాస నిశ్వాసాలుగా జీవిస్తూన్న ఆ ఆఫీసు ఉద్యోగుల మధ్య నాకు వూపిరిసలపకుండేది కాదు నిర్వ్యాపకంగా వున్న నిముషాల్లో, సంఘానికీ, జీవితానికీ, నాకు గల సామరస్య వైషమ్యాలు వూహా కందక, శూన్యంలో మనసు కరిగి కలిసిపోవడం పరిపాటిగా వుండేది

అట్లాంటి సమాధిపరిస్థితిలోనే వున్న వొక నాటి మధ్యాహ్నం బంట్రోతు వచ్చి 'బాబూ— చిన్న పిటీషను టైపు చెయ్యాలంట' అని బ్రతిమాలేడు. సమాధిలో వుండే, ఆ కాగితం అందుకుని, అప్రయత్నంగా చివరవరకూ చదివేను

'ఎవరిదోయ్ యీ పిటీషను ?'

'ఒక బీద బ్రాహ్మడిదండి'

'అతనిని పిలు' బంట్రోతు వెళ్ళేడు

పిటీషను వ్రాసిన ఆ స్వామి వచ్చేవరకూ నా మనసు దట్టమైన పొగమంచు క్రమ్మిన హేమంత చంద్రికారాత్రివలె వుంది అతను వచ్చి నాముందు నిలబడ్డాడు—లోతుకు పోయిన బుగ్గలు—చెవు కాలపు జలగ నెత్తురు యావత్తూ పీల్చివేయగా మిగిలిన బొమికెలపోగు! జరిగిపోయిన రోజులను కబళించిన విస్మృతి అనే చీకటిని చీల్చ ప్రయత్నిస్తూంది నా జ్ఞాపకశక్తి విస్మృతిరాహువు దశదిశలు వదులుతూంటే, క్రమేపీ జ్ఞాపకంలోకి వస్తున్నాడా వ్యక్తి—అదంతా వొక పెద్ద అవశేషములా వుంది అతని ఫాలభాగం వెడల్పై, కాంతి తేరి, బాలారుణ బింబంకంటె కుంకుమరేఖతో విరాజిల్లింది తరుణ రక్తం పూరించి బుగ్గలు మిసమిసలాడేయి అనన్యమైన ప్రభావం వల్ల తేజస్సు కలిగిన ఆ నేత్రాలు తిరిగి తళుకులు తులికేయి ఇరటంగా ఛాతీ లేచింది దండలలో కండలు కమ్మెచ్చులు తిరిగేయి పదిహేనేళ్ల క్రిందటి విగ్రహం నామదిలో పొడచూపింది

'పతంజలిశాస్త్రిగారూ! నేను జ్ఞాపకం వున్నానా'' హఠాత్తుగా అతని కన్ను నేత్రాలలో గుడ్లు మరీ లోతుకు కుంచుకుపోయేయి

'లేదండి!' చిరిగిపోయిన డప్పులా ఆ గొంతు భయపెట్టింది అతను యింటికోసం వ్రాసిన అర్జీ కాగితం నా చేతులోంచి జారి క్రింద పడిపోయింది ఒక ధర్మాత్ముడు తన యిళ్లలో వొకటి సద్బ్రాహ్మణ కుటుంబానికి నివాసంగా యిచ్చేనిమిత్తం కేటాయించి, ఆ అధికారం జిల్లా కలెక్టరుకిచ్చి చనిపోయేడు—ఆ యిల్లు తన కిమ్మని అర్జీ దాఖలు చెయ్యబోతున్నాడీ సద్బ్రాహ్మణుడు!

'శాస్త్రిగారూ, మీరు పీరనగరంలో కొన్నాళ్లున్నారు కదూ ?'

'అవునండి' అతను తడబడ్డాడు 'కాని మీ తలపో నాకు తెలీదు నేను మీ రనుకున్న మనిషిని కాను—మనిషిని పోలిన మనిషుంటాడు' ఆ మాటలలో జాలి, దొంగతనం, విషాదం, యస్కేపిజం, కుస్తీలు పడుతున్నాయి

నా మానసఫలకమీద గతించిన రోజులు, ఆటలు, నవ్వులు, యెన్నెన్నో దృశ్యాలుగా మరో స్మృతితో విరిసి, కరిగి, మాయమౌతున్నాయి.

'మాది ఆంజనేయస్వామిమఠంలో కుమా

మెట్టెక్కి నా కోసం అటూ యిటూ పరికించి, వన్నూ గదిలో చూసి, వొక్క గంతున లోన ప్రవేశించేడు వాడికి కొత్త లేదు—నా కంటె వొక్క యేడాది చిన్నవప్పటికీ మూడు క్లాసులు తక్కువ. ఒస్తూనే గది అంతా కలయ చూసేడు శాస్త్రి వేపు చూసి 'నా కొక్క పూదొత్తి యివ్వండి' అని అడిగేడు.

'వీడు నా స్నేహితుడు—అంజనేయులు', పతంజలిశాస్త్రి నవ్వేడు — 'పేరు చెప్పక్కర లేకుండానే తెలుస్తోంది'

అంజనేయులు శాస్త్రి వేపు తీక్షణంగా చూసి, పళ్లికిలించి నవ్వి, రెండు కాళ్లూ యెగరేసి 'అక్కా భాస్ కృభాస్ బాగా పాళ్ళేసేవే లబ్కా లబా, లబ్కా లబా, లబ్కా లబా' అని గంతులేసి, తిరిగి హేళనగా నవ్వుతూ పరుగెత్తేడు శాస్త్రి వేపు నేను ఉదాసీనంగా చూసి 'వెంక నెగస' అన్నా వాడి తరఫున తను వేసుకుంటూన్నట్టు శాస్త్రి 'కాదు వాడు మంచివాడే' అని బంతి పువ్వురంగు శాలువపై మీద కప్పుకున్నాడు 'జాగ్రత్తగా వుండవలసిన వాడివి నువ్వే నువ్వు బాగుపడతావు' నేనప్రయత్నంగా అన్నా 'ఉంటారా యిక్కడ కొన్నాళ్లు?'

'ఉందామనే వచ్చా' అంటూ అతడు నా కళ్లలోకి తీక్షణంగా చూసేడు

మఠంలో ఆరాధన తక్కువగా వుండేది పూజార్లు ఆ ఆవరణలోనే నివసిస్తూండేవారు పిల్లల మందరం కూడి ప్రతి సాయంత్రం 'భజన' పేరిట గుడో పాటలు పాడే వాళ్లం అంజనేయులు కన్నడ పాటలు అవకృతిలో నక్క కేకలులా పాడే వాడు అక్కడ వొక బాక్కు హార్మోనీ కూడా వుండేది

ఆవేళ సాయంత్రం నేను కృతిలాగుతున్నాను అంజనేయులు 'త్యాగళమ్మనే నొప్పి కళ్లో మమ్మప్పకాయ తేకో తిమ్మప్ప నీవూ' అని భయంకరంగా అరుస్తున్నాడు మిగిలిన కుర్రకారంతా యెవరికి తోచిన లయలో వాళ్లు చప్పట్లు చరుస్తున్నారు. అప్పుడు శాస్త్రి నెమ్మదిగా వచ్చి అంజనేయులు మెడమీద చెయ్యి ఆనించి కూచున్నాడు అంజనేయులు చుంచులా ముడ ముడిచి చిరునవ్వుతో పాట సాగనిచ్చేడు.

'అంజనేయులూ, బాగా పాడతావే!' మెడ మీది చెయ్యి దిగించేడు.

'ఉంటుందే, కోతలూ మీరూను'

'ఏం కోతలు?'

'బంతాయలు, గుమ్మడికాయలు. యిహి హిహి—' అంతా గొల్లున నవ్వేం

'అలాక్కాదోయ్ చూడు ఆ హార్మోనీ శబ్దం యిలా వుంది అది శ్రుతి అంటారు'

'నెప్పక్కర్లేదు'

'ఆ శ్రుతిలో నీగొంతు కలపాలి—మాట స్వచ్ఛంగా పలకాలి అలా పాడితే స్వామికి ఆనందం కలుగుతుంది'

'లేకపోతే' అని కొంటె ప్రశ్న వేసేడు

'చుట్టుప్రక్కలవాళ్లకి బాధగా వుంటుంది. చూడు యిలా పాడాలి'

శాస్త్రి హార్మోనీ శ్రుతిలో గొంతు 'ఆ' అని కలిపి ఆ పాట తిరిగి మృదువుగా, హాయిగా, భక్తిగా పాడి వినిపించేడు మాకందరికీ ఒళ్లు పులకరించింది పూజార్ల యింట్లో పనిచేసే 'పైడి' వచ్చి మండపంక్రింద బొమ్మలా నిలబడి పాట వింటూంది దానిలో కూడా భక్తి వికసించింది కాబోలు.

'అబ్బాయిలూ, మనం అంతా కలిసి వొక బాలభక్త సమాజంగా తయారవుదాం నెల కొకసారి రావిచెట్టు క్రింద వున్న ధర్మమండపంలివారి భజన పార్టీనికూడా పిలిచి, చక్కగా భజన చేస్తే, అంతా వచ్చి ఆనందిస్తారు అప్పుడు మనం భజన యింకా సక్రమంగా చెయ్యొచ్చు ఏమంటారు?'

మాకు చాలా సరదా వేసింది అలాగే అన్నాం కాని అంజనేయులే చిన్న సమస్య లేవదీసేడు 'ఆ డబ్బు దవాలంతా చేత వరకూ మనకైదైనా ప్రసాదాల యేర్పాటుందా లేక మన భజన మిరియాల దండుగకేనా?'

'ప్రసాదాలు కావలసినన్ని ఆవన్నీ నేను చేయిస్తాను' ఆ మాట వినగానే అంజనేయులు ఆంజనేయస్వామిలా పొంగిపోయి, గక్కున లేచి గుండెలదు పూకాళ్లు తగిలేలా కుప్పి గంతులేసి 'అక్కా భాస్ కృభాస్ బాగా చెప్పేవే—లబ్బ లబా లబ్బ లబా' అని వల్లే కాంపసం చేసేడు. మంగళహారతి

మూగియాగానే అంతా వెడిపోయేరు—నేనూ శాస్త్రీ నడుస్తూంటే పైడి మండపం చాటుకు మెల్లగా తప్పుకుంది.

పతంజలిశాస్త్రీ మీద చుట్టుప్రక్కల పెద్దలందరికీ గౌరవభావం యేర్పడింది ఆ కారణంవల్ల అతనిమీద నాకున్న గురుభావంవల్ల నేనతనితో అనుచిత్యం వుండడం మా వాళ్లు హర్షించేరు శాస్త్రీ కూడా నన్ను శిష్యవాత్సల్యంతో చూస్తూ, నేనెప్పుడూ సక్రమ మార్గంలో నడిచేటట్లు చెయ్యడానికి ప్రయత్నించేవాడు నేనూ వకుళం వొంటరిగా వున్న సమయాల్లో యేదో పని కలిపించి నన్నెక్కడికో పంపుతూండడంవల్ల వకుళానికి నా మీద కొంత అసహ్యం కలిగింది వకుళం మా పొరుగింటి ప్లీడరు గారి కూతురు—చురుకైనది—మంచి నెమ్మది కలిగినది—ఆ పిల్ల నాకు ప్రాణంకంటె యెక్కువ

వకుళం అంజనేయులకు దూరపు బంధువు వాడివల్లే నాకాపిల్లతో పరిచయం కలిగింది

ఆవేళ సాయంత్రం ఐదు దాటిన తరువాత మేం డాబామీద శాస్త్రీ నేను కూచుని యేవో కబుర్లు చెప్పుకున్నాం తరవాత శాస్త్రీ సంధ్యా వందనానికి వెడిపోయేడు పిల్లిలా చప్పుడు చెయ్యకుండా వకుళ వచ్చి నా వెనక నుంచుంది

'ఏమి టాలోచిస్తున్నావు?' పరధ్యానంగా వున్న నేను ఉలిక్కిపడ్డాను వెనుదిరిగి ఆమెను చూడగానే నా కాశ్చర్యం వేసింది ఆమెలో యేదో గొప్ప మార్పు కనిపించింది అప్పటికి సుమారు వారం రోజులనుంచి వకుళం నా కంట పడలేదు. అంజనేయులు నడిగితే, 'వకుళ మూన్నాళ్ళపాటు మౌనంగా కూచుందిరా యేమిటో—పెద్దమనిషైందను కుంటున్నారు' అన్నాడు నాకేమీ అర్థం కాలేదు పెళ్లికాకుండా పెద్దమనిషెలా అయిందిగా అంటే నాకి బోధపడలేదు.

'ఏం వకుళా! వారంరోజులై యెక్కడా జాడ లేదు!'

'వారం రోజులై నేను జాడలేదుగాని, మువ్వన్నాళ్ళయి జాడలేదో గుర్తుందా? శాస్త్రీ దగ్గర వైదికం నేర్చుకుంటున్నావా?'

'వైదికం నేర్చుకోడానికి మాకర్మం లేదట'

'అయితే మంత్రాలు నేర్చుకుంటున్నావా?'

నాకేం జవాబు చెప్పాలో తోచలేదు ఆమెను చూస్తున్నకొద్దీ ఆమెలో యేదో విచిత్రమయిన మార్పు గోచరిస్తూంది నిజంగా పెద్దమనిషయిందా? అంటే యేమిటి? నే నెప్పుడు పెద్దమనిషవుతాను? నాడంశలు, హృదయభాగం మూసుకున్నా ఇలా ఆలోచిస్తూంటే పడమటి దిక్కునుంచి అరుణారుణ కాంతుల్ని కబళిస్తూ వొక కారుమేఘం పరుగెత్తి వస్తూంది తిరుగాలి పెనుగాలిగా మారి వుధృతంగా టపటప చినుకులు పడసాగేయి డాబామీద దక్షిణ దిక్కున దగ్గరగా వున్న గదిలోకి పరుగెత్తేం వెంటనే ఆవాన పెద్దదై వుత్తరగదిలోకి మమ్మల్ని వెళ్లనివ్వలేదు దక్షిణగది మెట్లు కూలిపోయివుండడం చేత అక్కడే మేం ఖైదయిపోయేం ఎదురుగా కిటికీలోంచి వకుళయిల్లు కనిపిస్తూంది ఆమె కిటికీ మూసింది

'కిటికీ మూసేవేం?'

'చలిగాలి వీస్తోంది' ఆమె మందహాసం చేసింది

'వకుళా! నీలో యేదో మార్పు కలిగింది అది నాకర్థం అవడంలేదు నాకు చెప్పవూ?' ఆమె ముగ్ధమైన కనురెప్పలు బరువుగా వాలేయి ఎందుకో వాటిని చుంబించాలనిపించింది హోరని వర్షపు శబ్దాన్ని చీల్చుకుని క్రింద మండపంమీంచి అంజనేయులు 'లక్కాలకా' వినిపిస్తూంది నెమ్మదిగా వకుళాన్ని సమీపించి దగ్గరకు తీసుకున్నా తటాలున ఆ పిల్ల నా హృదయంమీద రెండు చేతులూ ఆదిమి పక్కకి నెట్టి, ధారాపాతంగా కురుస్తున్న ఆ వర్షంలో, డాబాపైనుండా పరుగెత్తి ఉత్తర గదిలోంచి అదృశ్యం అయింది ఆమె వెడిపోయిన ఐదునిమిషాల తరవాత 'గోపాలం' అని పతంజలి శాస్త్రీ పిలుపు వినబడింది

అతడు గంటసేపు నన్ను ప్రశ్నించిప్రశ్నించి విషయం అంతా గ్రహించేడు అమాయకంగా నా ఆరాటం అంతా అతనికి చెప్పేను శాస్త్రీ వుగ్రరూపం ధరించేడు భగవద్గీత చేతిలో పట్టుకుని 'దీనిమీద చెయ్యివేసి ప్రమాణం చెయ్యి మళ్లీ అలాంటి పొరపాటు చెయ్యనని' అని గద్దించేడు — వెట వర్షం కురుస్తూన్నట్టు నాకళ్లంట అశ్రువులు జలజల రాలేయి. ప్రమాణం చేసేను. గీత చేతిలో వుంది. అది అతని చేతిలో

కూడా వుంది ప్రమాణవాక్యం నా నోటిలో ధ్వనించింది అతని హృదయంలోనే!

ఆ నిముషంనుంచీ కొంతకాలం నా మనసు బాధపడింది. అనుభవహీనుడిని అజ్ఞానం నన్నలా తప్పుత్రోవలోకి నెట్టివేస్తోంది తరవాత నాలుగైదు రోజులవరకూ వకుళంతో మాట్లాడలేకపోయేను. ఆమెకూడా నాతో మాట్లాడాలన్న అభిలాష అంతగా చూపలేదు.

ఒకనాడు సాయంత్రం మసక వెన్నెలలో నేనొంటరిగా పొగడచెట్టుక్రిందకూచుని, వర్షంనాటి సాయంత్రం జరిగిన సంఘటన నెమరువేసుకుంటున్నా ఆంజనేయులు వెనకచాటునే వచ్చి కళ్లు మూసేసు నేను విదిలించుకున్నా.

'ఏమాలోచిస్తున్నావురా?'

'ఏం లేదు'

'నాకు తెలుసు'

'ఏమిటి?'

'వకుళం—'

'ఎవరన్నారు?'

'నాకు తెలుసు వకుళం అందంగా వుంటుందిరా కాని నన్ను చూస్తే దానికి వెక్కిరించాలని వుంటుంది హాస్యంటే దానికి చాలా సరదా'

'ఎప్పుడు చెప్పింది'

'ఇందాకా—వాళ్ళనాన్నగారి కవరులో పూతరేకు లిచ్చారట—నీకిమ్మని యిచ్చింది' జేబులోంచి అరుమడత తీసేను దానిలో రెండు పూతరేకులున్నాయి

'నీకిచ్చిందా?'

'లేదు దొంగ కాని జాగ్రత్తగోయ్ వాళ్ల నాన్నకి తెలిస్తే నీపు యిస్త్రీ అయిపోతుం దిద్దరికీ'

'ఏమిటి తెలిస్తే—పూతరేకు యిచ్చిందనా?'

'నాకూచే యొరగన్ కాని వోరేయ్ నాకు తోచాయేదైనా వైద్యంచెపితే నీకు మంచి సాయం చేస్తా' నా మనస్సు వికసించింది. ఒక పూతరేకు వాడి కిస్తూ అన్నా 'పోనీరా—నువ్వంతా యెగతాళి చేస్తావూ నాకలాంటి వుద్దేశమే లేదు'

'దాని కుంచేనో'

'అక్కే'

'అలా కాదు'

'నిజం!'

'అశ్వథాన్ కృథాన్—యేమీ యొరగళ్ళ—లబ్బు లలా, లబ్బు లబా' రెండో పూతరేకు కూడా వాడికిచ్చేను అప్రయత్నంగా నాట్యంచేస్తూ పరుగెత్తేను మళ్లీ నిశ్శబ్దం—ఒంటెరిగా వకుళం పెద్ద మనిషైంది నేనింకా కాలేదు—అయేవరకూ వేచి వుండాలి కామోసు ఈ అగమ్యగోచరపు లోకంలో వున్న నన్ను 'బాబూ' అన్న పిలుపు మేలుకొలిపింది వెనుదిరిగి చూసేను పైకి/ అది నన్ను రమ్మంటోంది ఎవరో పిలిచేరట యంత్రంలా దానివెంట వెళుతున్నా

చుట్టు తిరిగి వకుళంవనక వున్న చెరువుగట్టు మీంచి కుమారు మకం పెరటివరకూ వచ్చేను పైకి ముందు దారితీస్తోంది చెరువు నానుకొని దిబ్బ—ఆ దిబ్బ యెక్కలేక పాడైన మెట్లవరస అక్కడి తలుపు లెప్పుడూ మూసివుంటాయి కాని అప్పుడవి తెరచి వున్నాయి తూర్పునుంచి వుదయేందుకిరణాలు సూటిగా గదిలో పడుతున్నాయి

ఆ మెట్లు నేనెన్నడూ యెక్కలేదు వాటి కిరుప్రక్కలా గడ్డి మొలిచి వుంటుంది చెరువుగట్టు మీంచి అక్కడకు చేరడానికి సరైనమార్గం లేదు. పైగా ఆ పెరటింటికెదురుగా చెరువుగట్టుగోడ నానుకొని వొక పెద్ద రావిచెట్టుంది మతంలో విశ్వాసగత్తియైన వొక వితంతువు సిగ్గు ధరించలేక ఆత్మహత్య చేసుకోవడంచేత దయ్యమై ఆ చెట్టును పట్టివుందని పుకారు అంచేత ఆ వెంపు వెళ్ళేవాళ్లం కాము మెట్లమీద పాకుడు కూడా వుంది

మీద మెట్టెక్కి వెనక్కి తిరిగి చూసేసరికి పైకి తిరోగమిస్తోంది కారణం ఆలోచిస్తూండగా కిందకొక్క గదిలోంచి ఖణేలుమని గాజులచప్పుడు వినపడింది తలుపుమూలనుంచి హటాత్తుగా వొక కోమలాంగి వచ్చి, నావేపుచూసి 'ఓహో వచ్చావా' అన్నట్టు మందహాసం చేసింది ఆమెను చాలాసార్లు చూసేను కాని ఆ లావణ్యంతో యెన్నడూ చూడలేదు వెన్నెల చిందించిన ఆమె పలువరసనుంచి ప్రసారితమైన కాంతులు నా కళ్లకు మిరుమిట్లు గొల్పేయి. ఆమె డాక్టరు అయ్యంగారి కూతురు—బాలవితంతువు—పేరు అలిమేలు.

'నీ పేరేమిటి?' నేను అడిగేను.

'గోపాల కృష్ణుడివా?' తమాషాగా నవ్వింది. అది కొంటెగానే వుంది కాని దానిలో వొకవిధమైన జాలి వుంది దానిలోనే యేదో కాంతిని సూచించే ధ్వనివుంది అది జాలిగొలిపే యేదో విజ్ఞానపత్రంలో ముందు వ్రాసే విషయసూచికంలా వుంది

బూజులు పట్టి, గోడపెళ్లలు రాలిపోయిన ఆ పాడుగదిలో, వెన్నెలవెలుగులో, ఆమె యేవో ప్రశ్నలు వేస్తోంది కాని, ఆమె మాటలు నాకు వినిపించడంలేదు నేనేవో జవాబులు చెప్తున్నాంటే ఆమె ముసిముసి నవ్వులు నవ్వుకుంటోంది తెలుగు పలుకులమధ్య ఆమె అరవభాష విచిత్రమైన కమ్మదనం కలిగివుంది

అతను—నీతో తిరుగుతూంటారు, ఎఱ్ఱగా—ఆయన పేరేమి?'

ఈప్రశ్నతో నాకు తెలివివచ్చింది అప్రయత్నంగా 'పతంజలిశాస్త్రి' అన్నా వెంటనే ఆమె మాటలు నేర్చుకుంటూన్న చిలుక క్రొత్తమాట వినగానే దానిని లోలోపలే పలుకరిస్తూ పురశ్చరించినట్లు 'పతంజలిశాస్త్రి' అని రెండుమూడు సార్లు గొణిగింది

'ఆయనకు యీ చీటీయిస్తావూ?'

హారేరామ్! నా గుండెలలో రైళ్లు గుద్దుకున్నాయి

'పతంజలి శాస్త్రి అంటే యెవరనుకున్నారు? ఆయనొక మహాగ్నిజ్వాల!'

'ఈ చీటీలో అతడిని తిట్టుతూ వ్రాయలేదే!' ఆమె కొంటెగా అంది—కాని నవ్వుతూనే

'పొగుడుతూ వ్రాసినా, వ్రాసిన మిమ్మల్నీ, అందిచ్చిన నన్నూ మసి చేస్తాడు'

'ఫరవాలేదు ఇవ్వకూడదా' చీటీ అందిస్తూ జాలిగా పలికిన యీ వాక్యంలో వుక్రోషం అగుపించింది చీటీ తీసుకుపోయి యివ్వడానికి ధైర్యంకలగలేదుగాని, ఆమెకు ఆశాభంగం కలిగించడంలో హింసగోచరించింది. సరే యిమ్మన్నా చీటీయిచ్చి నా చెయ్యిపట్టుకుని 'ఎవ్వరికీ చూపించకూ—'అంది.

చెయ్యిగట్టుకు దిగి వెనుతిరిగి చూసేను. ఆమె గది గుమ్మంముందు నుంచుని చూస్తోంది నా వెంట. చందమామ ఆమె సౌందర్యాన్ని గ్రోలుతున్నాడు ఆ క్రొత్తవెన్నెలవికాసంలో ఆమె అరబ్బీరాత్రుల కథలలో యే దేవకన్యకో అనిపిస్తోంది

చీటీ పట్టుకెళుతున్నానన్న మాటేగాని అది అందివ్వడానికిగుండెలు లేవు కుంటెనకాడికి కుండే సాహసం నాలో మృగ్యం సందు మలుపు దగ్గర అయ్యంగారి మేడముందు పెద్దనీడ యేర్పడింది ఆ నీడ చేరగానే పైడి పన్నని అవరుద్ధ కంఠం వినిపించింది 'ఏటన్నారు బాబూ' నేను సంగతి చెప్పేను 'నా నిచ్చేస్తాను బాబూ, తెండి' ఆ కీ నీడలో దాని మత్తిలోచనాలు మెరిసేయి నా తల మీంచి పర్వతం దించినట్లయింది

నేను పిల్లిలా మా గుమ్మంముందు నిలబడి పైడి శాస్త్రిగదిలోకి వెళ్లడం, ఐదు నిమిషాల తరవాత తిరిగి రావడం చూశా అది తిరిగి అయ్యంగారింటికి ప్రదక్షిణం చెయ్యడానికి గామోసు బయల్దేరింది నేను ఒక్కొక్కగా దానిని సమీపించి అడిగా—

'ఏమయింది?'

'చీటిచ్చేరు'

'నే విస్తానే'

'లేదు బాబూ నేనే యిస్తా'

'అక్కర్లేదు—నేనే యిస్తా'

'మీ నాన్నగారితే చెప్పనా?'

నా గొంతుక తడి ఆరిపోయింది దాని కెందుకంత కోపం! అది దూరం అవుతూన్నకొద్దీ దాని తెల్లచీర వొక మబ్బులా మారుతూందా వెన్నెలలో. అది అయ్యంగారింటి పెరటివేపు వెళ్లడం లేదు— మలుపుదగ్గరున్న పెద్ద రావిచెట్టు నీడలో కొంచెం ఆగి తిరిగి బయల్దేరింది నాకు అనుమానం వేసింది, అది తిన్నగా పరిపోతూంటే నన్ను నేను మరిచిపోయి అలా నిలబడ్డపాళంగా, ఆంజనేయులు నా కెదురుగా వచ్చేడు వాడి నొసట విభూతిరేఖలు నడుమ సిందూరం మెరుస్తోంది

'ఏమిరోయ్! అలా నిలబడి నిద్రపో' తున్నావు!'

'అలాగేరా ఎక్కడనుంచి వస్తున్నావు'?

'నా కోదండం నుంచి . ఇంద ప్రసాదం.'

'కాని మువ్వలా వస్తున్నప్పుడు ఆ రావిచెట్టు క్రింద ఏమిట ఉన్నారురా?'

'ఏం? మన పైడి'

'ఏం చేస్తోంది'

'ఏదో కాగితం చింపిస్తుంది'

'పద చూదాం'

వెల్లి అక్కడ పతికితే నాలుగు చిన్న కాగితం ముక్కలు కొరికేయి ఎదురుగుండా వున్న కిల్లికొట్టు దీపంవద్ద అవి దగ్గరచేసి చూసేం అది అతి మేలు శాస్త్రికి వ్రాసినలేఖ నా కళ్యాశ్చర్యం కలిగింది ఆంజనేయులు పళ్లికిలించి నారంభించేడు, 'లబ్కు లబా'

ఆ రాత్రి నాకు నిద్రపట్టలేదు పతంజలిశాస్త్రి మంచిపడిపోయి వుంటాడు కొంపతీసినా ప్రమేయం తెచ్చిందేమో పైడి లేపు శాస్త్రిముఖం ఎలా చూడడం ఈ ఆలోచనలతో చూడుర్యాముబు దాటేనతరకూ కునుకురాలేదు ఎప్పుడు నిద్రపట్టిందో తెలీదు కాని హటాత్తుగా ఋకెంముందు మ్రోగిన భేరీ భాంకారాలతో తెలివివచ్చింది

ఉదయంనుంచి మన్యస్వాములవారు శిష్య గణంతో, హాయంపటాకోపంతో వచ్చి తెల్లవారు ఝామునకే మఠంలో దిగరు ఆ నిముషంనుంచి మతం వచ్చిపోయే జనంతో, పూజావిధానాలతో, పండితగోష్ఠితో ఊరు మ్రోగింది ముఖ్యంగా పిల్లలకు రెండు విశేషాలు ఆహ్లాదం కలిగించేయి ఒకట స్వాములవారి సొన్నాయిమేళం, నగారా—రెండు రూపయౌవన ఉపాసనాభూషణుడైన స్వామి—ఆ మహాపండితుడు పిల్లలమున్య యిట్టే పసిపిల్లవానిగా మారిపోయేవాడు

ఈ కోలాహలంలో పతంజలిశాస్త్రి దృష్టి నుండి తప్పించుకోవడం నాకు సులువైంది అతను దూరంనుంచి నావేపు చూచినప్పుడల్లా నాగుండెలు టువ్వటువ్వమనేవి కాని అతని ముఖంలో నాకేమీ మార్పు అగుపించలేదు పైడి పోకచేక నాప్రమేయం లేలేదికా!

సాయంత్రం ఐదుగంటలకు మఠం ఎదర పూర్ప వరండామీద పిల్లలంతా చేరి గోలపెడుతున్నారు. ఎదురుగుండా అరుగుమీద వకుళ అమాయకంగా నిల బడి పిల్లల ఆట చూస్తోంది. ఒక్కొక్కప్పుడా పిల్లను కల్లిచేసుకొని దొంగాటాడుతున్నారు. నేనూ ఆంజనేయులు అటువేపు వెళ్ళేం నన్ను చూడగానే వకుళం చిరునవ్వు నవ్వింది ఆమె కనురెప్పంమీద పూర్వకోప చిహ్నం లేమైనా వున్నాయేమో అని అనుమానం వేసింది ఆమె మందహాసంలో 'పోకిరి వాడా' అని నన్ను రూలనాడే ధుమకిణాంకం మసక మసకగా గోచరించింది ఆంజనేయులు 'చెల్లెరా' అని నన్ను పొడిచేడు వాడికి మాయిద్దరినీ బాగా తెలుసు—వాడికి వకుళం వాన్నంటే హుసలు

కాని నేనూ వకుళం ఒక్కడుంటే పిల్లలంతా అక్కడే చేరుతున్నారు. గోల చేస్తున్నారు ఒకటి రెండుసార్లు పెరటిలోకి వెళ్ళడానికి ప్రయత్నించేం—కాని ఆ వానరమూక అంతా వెంటపడ జొచ్చింది

ఇంతలో, ఆంజనేయులు కళ్లింతలు చేసి, చేతులు త్రిప్పుతూ—సాంస్కృతం పోలిన ఏదో సోటితడాకాలు వాగుతూ, 'నేను ముద్రధారణ స్వాములవారిని— రండి— మీ కందరికి ముద్దలు వేస్తాను' అని పొక్కొక్కరినీ పిలిచి జబ్బగిల్లులు ప్రసాదించసాగేడు గిల్లు తిన్నవాడు మొఱ్ఱో అంటే మిగిలినవాళ్లంతా గొల్లున నవ్వుతున్నారు నే మిద్దరం పొదంచెట్టు పెరటిలోకి దారితీసేం

ఎండిన పాదరూకులు మా కాళ్ళకిందపడి పకపక కక్కిస్తున్నాయి పసిమటి సూర్యుని రక్తకిరణాలు ఆకాశంమీద పొర్లుతున్నాయి చెరువునీరు షర్బత్ లా మెరుస్తోంది

మేం దబ్బ ఒక్క గన్నేరుచెట్టునడుమ పొద్దుగా చేరిన రెండు పండుటాకుల దిండుమీద కూచున్నాం మారంగా మఠంలోంచి ఆంజనేయుల ప్రతాపం వినిపిస్తోంది మేమున్న స్థలం రహస్యంగా వుంది చెట్టమీద, చెరువులోను, పిట్టల అరుపులు, తొగరుపూల గమగమలు, తల దిమ్మెక్కిస్తున్నాయి

'వకుళం! కోపం వచ్చిందా?'

'ఎందుకూ?' ఆమె నావేపు జాలిగా చూసింది.

'ఆ వేళ ' ఆమె కోపం లేదన్నట్టు తల్విన విధానం చూస్తే, ఆ వేళ తిరుక్తా కర్ణంలోనికి

విజ్ఞానవికాసాలు :

# నాళరహిత గ్రంథులు

**(Ductless Glands)**



శ్రీ బి. వి. వి. యస్. మూర్తి

శరీరము, మెదడు సరిగా పని చెయ్యాలంటే వాటికి సంబంధించిన వివిధ మండలాలు ఒకదానితో ఒకటి సరిగా అమర్చబడి వుండాలి ఉదాహరణకి మానవ శరీరానికి పెరుగుదల పది, పదిహేను సంవత్సరాల వయస్సుల మధ్యనే జరుగుతుంది ఆ తరువాత జ్ఞానేంద్రియముల అభివృద్ధితోపాటు శరీరపు పెరుగుదలకూడ తగ్గుట మొదలిడుతుంది

ఈపై రెండు పనులు అనగా జ్ఞానేంద్రియముల పెరుగుదల సరిగా సాగి పెరుగుదల తగ్గిపోవుటగాని లేక పెరుగుటగాని హెచ్చి జ్ఞానేంద్రియముల అభివృద్ధిని నిరోధించుటగాని అసమానంగా జరగకుండా మన శరీరములో నాళరహిత గ్రంథుల సమ్మేళనముతో 'ఎండో క్రైన్' మండలము తయారయినది.

మానవులు, జంతువులు టెలిఫోనులా పనిచేసే నాడీమండలము వలననే అంత పొందికగా జీవించగలుగుతున్నారు అలాగే శరీరములో రక్తప్రవాహము రేడియో వార్తావాహినిలా పనిచేస్తుంది రక్తనాళికలు పాతాళములో కాల్వల మల్లే శరీరములో మూలమూలకు ప్రవహిస్తున్నాయి ప్రకృతి మితవ్యయి అందుచేతనే అంత చాకచక్యముగా రెండు పనులను నిర్వర్తించుతుంది రక్తముద్వార వార్తలను శరీర భాగాలకందచేస్తూ నాడీ మండలానికి సహాయకారిగా పనిచేస్తుంది ఈ పంపబడిన వార్తలు రసాయన పదార్థములు ఏ ఏ పనులను నియమింపబడ్డాయో ఆయా స్నాయువులపై వివిధ అంగాలమీద పనిచేసి వాని పనులను నిర్వర్తిస్తాయి వీనినే "హార్మోన్సు" అన్నారు.

తమ స్రావములను నాళములద్వార ఓ ప్రత్యేక ఇంద్రియముల లోనికి ప్రవహింప చేయుటకు బదులు ఏకంగా రక్తములో పోయుటయే వీని విచిత్ర లక్షణము ఈ కారణమువల్లనే వీనికి నాళరహిత గ్రంథులని పేరువచ్చినది

వీనిలో ముఖ్యమైనవి "థైరాయిడ్" "పేరా థైరాయిడు" "ఎడ్రినల్స్" "ఐలెట్సు ఆఫ్ లేంగ్రహాన్సు" "పిట్యుటరి" గోనాడ్సు అనునవి

"థైరాయిడ్" అనబడు నాళరహిత గ్రంథికోడి గ్రుడ్డు ఆకారములో సుమారు దీనిబరువు ఇంచుమించు ఒక ఔన్సు కంఠమణికి ఇరుపైపుల చెరొకటి వుంటాయి

"పేరా థైరాయిడ్"—ఇవి నాలుగు బటానీ గింజలమల్లే వుంటాయి ఇవి థైరాయిడ్ చుట్టుపట్లా వుంటాయి

ఎడ్రినల్స్—ఇవి మూత్రపిండములకు కొంచెము పైగా వున్న చిన్న గ్రంథులు. వీని బరువు థైరాయిడ్‌లో 1/7 వంతు వుంటుంది

క్లోమము చుట్టువున్న నాళరహిత గ్రంథులనే "ఐలెట్సు ఆఫ్ లేంగ్రహాన్సు" అంటారు

వీనిలో ఏకొక దాని ప్రాచకమైన "హార్మోను" అనే పదార్థాన్ని కలిగుంటుంది ఇంద్రియాన్ని ప్రేరేపించడము దీనిపని.

నాళరహిత గ్రంథి మండలమును గూర్చి యిప్పుడిప్పుడే పరిశోధనా ఫలితాలు గోచరిస్తున్నాయి. అనవసర గ్రంథులను శరీరమునుండి తీసివేస్తే అనుకోని ఫలితాలేర్పడ్డాయి పూర్తిగా గండమాలని కుదర్చడానికని థైరాయిడ్‌ని పూర్తిగా తీసివేస్తే క్రమంగా ఆ వ్యక్తి పొట్టిగాను, మందముగాను, గరుకు చర్మము గలవాడిగాను, కుండ పొట్టతోను, తయారయేడు అయోడిన్, థైరాయిడ్ ఎక్స్‌ట్రాక్టు తినుమాత్రంగా యిచ్చినట్లయిన మళ్లీ మామూలుగా తయారయేడు దీనినిబట్టి యీ నాళరహిత గ్రంథియొక్క ప్రాముఖ్యత తెలియుచున్నది

'క్రెటిన్స్' అనబడుని ఆరోగ్యాభివృద్ధి కెంతో ముఖ్యమని తెలియుచున్నవి. నూజిలండ్ స్విడ్జర్లండు మొదలగు దేశములలోని భూములలో 'అయిడను' పాలు తక్కువగా ఉండబట్టి 'గండ మాల' అనే రోగము విస్తారము ఈ కారణను తీర్చ డానికై ఉప్పులో అయిడను కలిపి వుపయోగిస్తు న్నారు స్విడ్జర్లండులో

థైరాయిడ్ హెచ్చుగా పనిచేయుట మూల ముగా పిండి పదార్థములు మండుట అతి త్వరగా జరు గును దానివలన ఆ మనిషియొక్క బరువు హెచ్చి పోయి ఆ గ్రంథివలనటచే ప్రాణహాని సంభవించును

థైరాయిడ్ శస్త్రచికిత్స సమయములో అక స్మాత్తుగా కాని పేరా థైరాయిడ్ గ్రంథిని తీసివే యుటవలన స్త్రీ, 5 లేక 6 సంవత్సరముల తరువాత ఆరోగికి '*Titanus*' సున్నపు వాతమువలె పరిఅయి చనిపోతాడు అప్పుడు—రక్తమును పరిశీలించగా 'కాల్సియము' అను పదార్థము దానిలో తక్కువయి పోవుటవలన సున్నపు వాతము బయలుదేరినది బుజువై నది

'ఎడ్రినల్' మన శరీరములో నెయ్యిలలేని విధులు చాల వున్నాయి అందు మొదటిది రక్తపు పోటునుచక్క బెట్టుట దీనివలన శరీరానికి 'గ్లూకోజ్' అనే పదార్థమును సరిగా అందిచ్చుట, ఆకలి కలిగిం చుట, జాత్యభివృద్ధికి తోడ్పడుట జరుగుతాయి 'ఎడ్రినల్' గ్రంథిలో తయారయిన హార్మోను 'ఎడ్రి నలిన్' ఇది శిరవాళికలపై చర్యవల్ల రక్తపు పోటుని క్రమపరుస్తుంది దానిని తుదించుకు చేట్లు చేస్తుంది దీనివల్ల శరీరోష్ణమును క్రమ పరుస్తుందన్న మాట ఎడ్రినలిన్ కాలేజములోని 'గ్లైకోజ్' అనే పదార్థ ముపై చర్యవల్ల 'గ్లైకోజెన్' 'గ్లూకోజ్' క్రింద మార్చబడును 'ఎడ్రినలిన్' ఎక్స్ట్రాక్టును మామూలు మనిషిలోనికి పంపిస్తే ఆకలి చచ్చిపోతుంది

ఇది జాత్యభివృద్ధి కెంతవరకు తోడ్పడతాయో ఇంకా ఇప్పటిదాకా నియమింప బడలేదు కాని అది పిట్యుటరీ పనితో దీనికి సంబంధము ఉండని శాస్త్రజ్ఞుల ఆలోచన

ఐలేట్సు ఆఫ్ లాంగ్రహాన్సు తయారు చేసిన ఇన్సులిన్ అనే పదార్థాన్ని కాలేజములో తయా రైన గ్లూకోజ్ ఎడ్రినల్ గ్రంథుల ప్రోత్సాహముతో స్నాయువులు తీసుకొంటాయి ఎవరిరక్తములో యీ 'ఇన్సులిన్' తక్కువగా వుంటుందో వారు 'గ్లూకోజ్'ని ఉపయోగించుకోలేరు అందు మూలంగా రక్తములో 'సుగర్' భాగము ఎక్కువై పోయి అతిమూత్రవ్యాధి (*Diabeter Mellitus*) సంభవిస్తుంది స్నాయువులు గ్లూకోజ్ లేని మూల ముగా లేరుకొన లేక పోవుట తక్కువయి సరిగ్గా పని చేయవు రోజురోజు రోగి బలహీనుడౌతాడు 'ఇన్సులిన్'ని శాస్త్ర పరిశోధనలద్వారా కని పెట్టడం మూలముగా అతిమూత్రవ్యాధిని 'ఇన్జెక్షన్స్' ద్వారా కుదర్చడము సులికయింది

పిట్యుటరీ రెండు భాగములు ఒక్కొక్కటి మూడు ప్రత్యేక కార్యములను నిర్వర్తిసాయి వెనుక భాగము మూత్రపిండములను క్రమపరచి గర్భాశ యమును అందంచేలా చేసి రక్తోద్రుక్తాల్లో కొంత ప్రాత్రవహిస్తుంది ఎదటిభాగము పెరుగుటను క్రమ పరచును, జాత్యభివృద్ధిని హద్దులో నుంచడము, పాల తయారీ తను మాత్రింగాను ప్రోత్సాహిస్తుంది ఈ ప్రావాన్ని థైరాక్సిన్ తో పోల్చినప్పటికిని ఇది ప్రోటీన్ లాంటి పదార్థమై యుంటుందనిన్నారు పిట్యుటరీ ఎదుటభాగము క్రమ పరచుటలో చాల సహాయము చేస్తుంది ఇది కాని సరిగా పనిచేయని యెడల మరుగుజ్జత్వము, శిశుత్వము (*Infantilem*) (అంటే జాత్యంగాలభివృద్ధిలేనివిగా నుండుట) సంభ వించును ఎక్కువగా కనక పనిచేస్తే యవ్వనము రాక పత్వములోనికి దారి తీస్తుంది

*Case*—11 సంవత్సరముల బాలుడు 250 పౌనుల బరువు, 9 అంగుళముల పొడవు ఉన్నాడు మరుగుజ్జత్వ నిని నిదర్శనంగా 9½ సం|| ల బాలిక 35½ అం ల పొడవు 37½ పౌ|| ల బరువు కలిగివుంది

ఇది హెచ్చు లేక తగ్గగా పని చేసినయెడల జాత్యభివృద్ధికి నిరోధకము కలుగుతుంది ఈడొ చ్చిన తరువాత దీనిలోని ముందు భాగము ఎక్కువగా పని చేస్తుంది దీన్నే *acromegaly* అంటారు అట వంటప్పుడు అభివృద్ధి కరకాలం వున్న భాగాలు అనగా చేతులు, కాళ్ళు, ముఖం ముఖ్యంగా గడ్డము ముక్కు ఇంకా వంటివి భారంగా పెరిగి మృదుత్వం పోయి ఓవిధమైన గరుకుతనం యేర్పడు తుంది.

పిట్యుటరి ఎదటి భాగములో '*Harmone*' కాని చాలీచాలకుండా ప్రసరిస్తే ఓ విధమైన అర్థాల త్వము ఏర్పడుతుంది. ఈ విషయము *Pickwick-papers*' లోని కుంభకర్ణునిద్వారా అర్థం చేసుకొన వచ్చును

దీని మిగతా కార్యాలు థైరాయిడ్ మీద, ఎడ్రినల్ మీద, గోనాడ్స్ మీద పనిచేస్తూండడం ఇంచుమించు దీనిపని పెద్దకూ వరాలకూ వున్న సంబంధంలాంటిది; ఎండోక్రైన్ మండలంలో అతి ముఖ్యమైనది

గోనాడ్స్ (ఓవరీస్, టెస్టీస్) ద్వితీయ జాత్యంగాల అభివృద్ధిలో సహాయపడడం దీని పని స్త్రీలో "ఆస్ట్రిన్" అనే హార్మోన్ ఋతుకాలాన్ని ఓవ్యులేషన్ని క్రమపరుస్తుంది పక్వమైన "ఓవమ్" fertilise అయింతర్వాత విసర్జించిన 'గ్రాఫియన్ ఫాలికల్' 'కార్పస్ లూటియమ్' క్రింద పెరుగుతుంది ఇదప్పుడు 'ల్యూటిన్' అనే హార్మోనును తయారుచేసి, 'మెన్స్ట్రుయేషన్ని' ఓవ్యులేషన్ని అధికం కాకుండా చేస్తుంది అంటే ముట్టు ఆగకుండా చేస్తుంది పాలగ్రంథుల్ని బలపరిచి ఇది పాల తయారీనికూడా ప్రోత్సహిస్తుంది గర్భవతులలో అలాంటి హార్మోనే పిట్యుటరీ ఎదటి భాగంలో స్రవించే 'ఆస్ట్రిన్'లాంటి హార్మోన్లూ, "ఆస్ట్రిన్" యీ రెండూ ఆ స్త్రీ మూత్రంలో విసర్జించబడతాయి వీటినిబట్టే స్త్రీలు గర్భవతులో కాదో నిర్ణయించవచ్చుతుంది ఇదొక్కటే నిశ్చయమైన పరీక్ష, మిగతవన్నీ అనుమానాలే

ప్రాబల్యం Influence నాళరహితగ్రంథుల హార్మోన్స్ శరీరంమీద ప్రాబల్యత కలిగివుంటచే మనిషియొక్క స్వభావం (Temperament) మీద కూడా ఆ ప్రాబల్యత కనిపిస్తుంది ఉదాహరణంగా థైరాయిడ్ కొంచెం ఎక్కువగా పనిచేస్తే చురుకుదనం, తక్కువగా పనిచేస్తే మందత్వం వుంటాయి

ఒకప్పుడు 'Vornaffs' అనే ఆయన 'టెస్టిస్'ని మారుస్తే ముసలితనం పోతుందన్నాడు కాని ఈ రోజు ఆ పద్ధతి అనుమానాస్పదంగావుంది శస్త్రచికిత్స తాత్కాలిక ఫలితాల్నిచ్చింది కాని శాశ్వతఫలితాల్నియ్యలేదు. అనేక విధాలుగా అనేకమంది విషయములో పనిచేసిరి 'Steinachs' అనే ఆయన అనేక విధాలుగా శస్త్రచికిత్స చేసి పరిశోధించగా 'వార్‌నల్స్' చికిత్స ఫలితాలే కనిపిస్తే 'ఎండోక్రైనాలజీ'లో పెద్ద క్రాంతి కలిగించదనుకున్నారు మానవ సృష్టిలో

ఎండోక్రైన్ హార్మోన్ గుణాన్ని యీ క్రింది విధంగా పరిశీలించాలి

1. ఏ గ్రంథయితే హార్మోన్ని తయారుచేస్తున్నదో దాన్ని జంతువునించి తీసేసి, గుణాల్ని పరిశీలించాలి

2. మామూలు జంతువుకి 'హార్మోన్' యిచ్చి చూడాలి (అప్పుడా జంతువులో యిది ఎక్కువుంటుంది)

3. అప్పుడా గ్రంథియొక్క రోగలక్షణాల్ని పరిశీలించాలి 'థైరాయిడ్'ని యీ విధంగానే పరిశీలించేరు. తలకప్ప (Tadpole) లో 'థైరాయిడ్'ని తీసేస్తే అది పెద్ద కప్పక్రింద తయారవలేక పోయింది మళ్ళా 'థైరాయిడ్ ఎక్స్‌ట్రాక్ట్'ని కాని అది నివసించే నీటికి కలిపితే అది తిరిగి కప్పక్రింద పెరగడం ఆరంభించింది మామూలు తలకప్పవుంటే నీటికి అధికంగా కాని 'థైరాయిడ్ ఎక్స్ట్రాక్టు' కలిపితే అది చెప్పలేనంత పెద్ద కప్పగా తయారయింది. ఈ ప్రయోగాల్నిబట్టి థైరాయిడ్ యొక్క గుణగణాల్ని మానవుల్లో కూడా తెలుసుకున్నారు

అప్పుడప్పుడు పిల్లలకి థైరాయిడ్ గ్లాండు లేకుండాగాని, పనిచేయనిదిగా కాని పుడుతుంటారు వీళ్ళని 'Cretins' అంటారు పిల్లలు పుట్టిన ఆరునెలలవరకూ శరీరం ఆరోగ్యంగానే అభివృద్ధి చెందుతూన్నట్టు కనిపిస్తారు కాని తరువాత వాళ్ళలో యీ 'క్రెటినిజమ్' వృద్ధిచెందుతుంది ఇది అలా 6 7 నెలలదాక రాకపోవడానికిగల కారణం వింతగా లేదు ఆ పిల్లపుట్టకపూర్వము తల్లి రక్తప్రవాహంలోని థైరాయిడ్నీ, తరవాత తల్లిపాల ద్వారా తీసుకొన్నదీ ఆ పిల్లలో 6 నెలల దాకా 'క్రెటినిజమ్' రాకుండా కారణాలై యుండవచ్చు థైరాయిడ్ కొరత సాధారణంగా పిల్లల మొదటిసంవత్సరపు కొసభాగంలో ఛాయలు చూపుతుంది అప్పుడు కాని సరైనవైద్యం లేకపోతే, శారీరకంగానూ మానసికంగానూ అభివృద్ధి చెప్పరానిదిగా అడ్డేస్తుంది అలాంటివాడు పొట్టిగా, మందంగా, నీరసంగా తయారవుతాడు వాని కండరముల ఎముకల్ని వాని క్రమస్థానముల్లో ఉంచనీయక పోవుటచే వంగిపోయి అవాకారంగా తయారవుతాయి వాడి నాలికవాడి నోటికి చాలనంత అయి ముందు కొచ్చేస్తుంది పంది ముక్కులా తయారవుతుంది వాడి కేశాలు తక్కువైపోయి ముట్టుకుంటే పోతూన్నట్టుంటాయి కనురెప్పలు పెద్దవిగా ఉబ్బుతాయ్, భుజాలమీద ముద్దముద్దలా క్రొవ్వు పెరుగుతుంది శరీరంమీద చర్మము ఎండిపోయి గరుకుగా ఉంటుంది

ఇంగ్లండులో ప్రస్తుతం ఈ 'క్రెటినిజమ్' చాలా తక్కువ డాక్టర్లు, పిల్లలకే ఏమాత్రం మానసికంగానూ, శారీరకంగానూ బలహీనంగా కనిపిస్తే 'థైరాయిడ్ Extract' ఇచ్చేసి క్రెటినిజమ్ రాకుండా కాపాడుతున్నారు

పెద్దవారిలో యీ గ్రంథి పనిచేయుట మానేస్తే 'మిక్సోడిమా' అనే వ్యాధి వస్తుంది. మందంగానూ, మానసికంగానూ వృద్ధిలేని బాలుగనూ, చర్మము దాడిపోవటం, బోడితల, భుజాలమీద ముద్ద, ముద్దలాంటి క్రొవ్వు పెరిగి, అసహ్యంగా కళ్ళచుట్టు ఉబ్బడం, దీని లక్షణాలు దీన్ని థైరాయిడ్ *Extract* ఇచ్చిపోగొట్టవచ్చును అలా ఇస్తేనే మళ్ళీ మామూలుగా తయారవుతారు

థైరాక్సిన్ ముఖ్యమైన హార్మోన్. ఇది మామూలుగా పెరుగుటకేకాక, మానసిక, శారీరకాభివృద్ధికి మూలబిరాట్టు అయొడిను (*Iodine*) దీనిలో విస్తారంగా వుంటుంది కొన్నిచోట్ల భూసారంలో ఇది తక్కువై 'గండమాల' అనే రోగం వస్తుంది హిమాలయాల్లోనూ, ఆల్ప్స్ పర్వతాల్లోనూ ఇది తక్కువై యుంటుంది ఒక్కొక్కప్పుడు ఈ 'గ్లాండ్' పెద్దదై గుండెల దాకా వ్రేలాడుతూ వుంటుంది అటువంటప్పుడు దీని పెరుగుదల కారణంగా పనిచేయుట మానివేయవచ్చును

థైరాయిడ్ హెచ్చుగా పనిచేయటంవల్ల కలిగే ఫలితాలు వేరు దీనివల్ల బాధపడే రోగుల కళ్ళు ఉబ్బి పాలుగా వుంటాయి కారణం వార్కి కనురెప్పలు ముడుచుకుపోయి కళ్ళే కనిపిస్తాయ్ కోపం కొద్దిగా వచ్చినప్పటికి ధైర్యహీనంగా, చిరాకుగా *Excite* అయిపోతారు విసరించుకొన్న థైరాయడ్ గ్లాండ్ వుంటే మెడమీద ఉబ్బుకాయ మొలవటం, గుండెలు వేగంగా కొట్టుకోవటం, మొదలయినవి ఉంటుంటాయ్ అలాంటప్పుడు హెచ్చుగ పనిచేసున్న ఆ థైరాయడ్ *Extract* లో కొంతభాగం తీసిస్తే ఆ రోగాన్ని బాగుచేయొచ్చు—

పారాథైరాయడ్స్ కాని జంతువులోంచి తీసేసి దాని నాడీమండలం, కండరాలూ, హెచ్చుగా ప్రేరేపించబడి 'ఫిట్స్' వచ్చేయ్. ఈ న్యూరో మస్క్యులర్ క్షోభ్యత (*Irritability*) అవస్థని *Tetany* అంటారు పారాథైరాయడ్ హార్మోన్ లేకపోతే ఆ జంతువాట్టే కాలం బ్రతకదు

వీని పని రక్తంలోని కాల్షియాన్ని బలపరచడం పుత్రాళ్లలో ఒకొక్కప్పుడు *Tetany* రావచ్చు అపుడు పారాథైరాయడ్ గ్లాండ్ కాదు, వాళ్లలో రక్తము లేకపోవడమే కారణం పై రెండు రోగాల్ని కాల్షియం *Inject* చేస్తే నయం చెయ్యవచ్చును

పారాథైరాయడ్ హెచ్చుగా పని చేస్తే రక్తంలో కాల్షియం మామూలుకన్న ఎక్కువై ఎముకల్లో ప్రవేశించి వాటిని మెత్తగా చేస్తాయి వాళ్లకి కొంచెము దెబ్బతగిలితే ఎముకలు వంగిపోతాయ్ హెచ్చుగ పనిచేస్తున్నపుడు *Tumour* క్రింద వస్తాయ్ వాటిని తీసివేస్తే మామూలుగా వుంటారు

*Suprarenals* — ఒకొక్క మూత్ర పిండం మీద కుచ్చుటోపీలా వుంటాయ్ ఇవి ఒకొక్కటి రెండు భాగాలు పైభాగాన్ని కార్టెక్స్, మధ్య భాగాన్ని మెడ్యుల్లా అని అంటారు

మెడ్యుల్లా ఎడ్రినలిన్ అనే (*Harmones*) హార్మోన్స్ తయారు చేస్తుంది ఈ మెడ్యుల్లా (*Medulla*) నరముల్లోంచే జనించింది

అలా కాకుండా కార్టెక్స్ *Embryonic cells* లో నుంచి ఉత్పత్తి అయి *Glands* ని జనింపచేస్తుంది

కార్టెక్స్ సంగతి మనకింకా పూర్తిగా తెలియలేదు కాని అది ఒక జంతువునుంచి తీసేస్తే ఆకలి పోవటం, శరీరపు బరువు పోవటం, నీరసించి తుదకు చనిపోవుట సంభవించింది *cortex* ని నాశనం చేసే రోగం కాని మనిషిలో ప్రవేశిస్తే అతను పై లక్షణాలే చూపుతారు దీనికి సుప్రారీనల్ క్షయ కారణం దీనినే '*Addisons disease*' అన్నారు ఈ రోగం కుదర్చడానికై పరిశోధనలు గావించి *cortin* అనే హార్మోన్ కనిపెట్టేరు ఇది యిస్తే రోగం కుదురుతుంది

ద్వితీయ జాత్య ధర్మం గలిగిన ఈ *cortex* భాగం కాని పిల్లలలో హెచ్చుగా పని చేస్తే నాలుగేళ్ల కుర్రాడిలో జాత్యంగాలు వయసు మనిషిలో జాత్యంగాలులా పెరుగుతాయ్ స్త్రీలలో హెచ్చుగా పనిచేస్తే పురుషుల్లా తయారవుతారు మీసాలు, గడ్డం, బొంగురు గొంతుక దీని లక్షణాలు ఈ మార్పు వాళ్ల తత్వాన్ని కూడా మార్చి పురుషుల్లా ప్రవర్తింప జేస్తుంది

పిట్యుటరీ చాలా ముఖ్యమైనది నాళరహిత గ్రంథుల్లో ఇది మెదడు కడుగు భాగమున దాని కొమ్మకొక దానికి అంటుకొని చిన్న ఎముకలపెట్టిలో అమర్చబడి యుంటుంది ఇది రెండు భాగములుగ వుండి వానిచే వేర్వేరు పనులు నిర్వర్తింప జేస్తుంది దీన్ని గూర్చి తెలుసుకొన్న కొద్దీ దీని పనులు మన కాశ్చర్యాన్ని కలిగింప జేస్తాయ్ ఇది బటాణీ గింజ కన్నా చిన్నదైనా పెక్కు హార్మోనులను తయారు చేస్తుంది తతిమా గ్రంథులను కంట్రోల్ చేసి అవి కొన్నట్లా సరిగా పనిచేసేటట్లు చూస్తుంది.

పిట్యుటరీని కనక శరీరంలోంచి తీసేస్తే జాత్య గ్రంథులు వృద్ధి చెందవు మామూలు ఎలుకల్లో

పిట్యూటరీ *Extract* ని గాని పంపిస్తే అవి పంది కొక్కుల్లా తయారవుతాయి

పిట్యూటరీ అభివృద్ధికరము హార్మోన్లను తయారుచేయుట కాక, ఇంకా యితర హార్మోనులని తయారు చేస్తుంది వీనిలో రెండు థైరాయిడ్ మీద *Suprarenal cortex* మీద పని చేస్తాయి ఇవే *Thyrotropic hormone, Adrenotropic hormone* అని పిలువబడుతాయి పిట్యూటరీ రెండు *gorabo tropic hormones* ద్వారా జాతిగ్రంథుల మీద పని చేస్తుంది దీని నుంచి తయారైన *prolactir* అనే హార్మోన్, క్షీర గ్రంథుల్నించి పాలని స్రవింప (తయారు) చేయుటకును, *parathyrotropic hormone*, పెరథైరాయిడ్ గ్రంథుల్ని ఉత్తేజపరచుటలోను పని చేస్తాయి *Diabetogenic hormone* రక్తంలోని *Sugar* శాతాన్ని హెచ్చు చేస్తుంది

పైన చెప్పిన *hormones* అన్నీ ఈ *gland* ఎదటి భాగం తయారు చేస్తుంది ఇవి ఈ మధ్యనే పరిశోధింపబడ్డాయి ఈ గ్రంథి వెనుక భాగము వైద్యంలో చిన్నటిదాకా చాలా ఉపయోగకారిగా వుంది వెనక భాగం లేకపోతే *Diabetes Insipidus* అనే వ్యాధి వస్తుంది దీని లక్షణాలు ఎక్కువ దాహం, అతి పల్చటి మూత్ర విసర్జన అధికం వెనక భాగపు *Extract* యిచ్చి దీన్ని తగ్గించవచ్చు జాతి గ్రంథులు కాని జంతువుల పిల్లల్నించి తీసేస్తే వాని గర్భోత్పత్తి కారణభూతులయ్యే అంగాల అభివృద్ధి ఆగిపోతుంది క్రొవ్వు అసాధారణంగా పెరుగుతుంది పెరుగుదల ఆగిపోతుంది

ఓవరీ (*Ovary*) ఈస్ట్రిన్ (*Oestrin*), ప్రోజెస్టిన్ (*projestin*) అనే రెండు హార్మోన్స్ని తయారు చేస్తుంది ఓవరీలో చుక్కలు, చుక్కలుగా గుండ్రటి కణములుంటాయి వీనినే గ్రాఫియన్ *follicles* అంటారు ప్రతి నెలా యింగలో ఒక *follicle* పెరిగి పెద్దదై పక్వమైన అండము (*Ovum*) కల్గి గుండ్రని రంధ్రము (*cavity*) కలదిగా తయారవుతుంది ఈ 'కేవిటీ'కూడా ద్రవాన్ని కల్గియుంటుంది ఈ అవస్థలో *ovary* నుంచి వచ్చే కణాలు 'ఈస్ట్రిన్' అనే హార్మోన్ని తయారు చేస్తాయి

ఓవరీలోని 'గ్రాఫియన్ ఫాలికల్' పగిలి అందులోని అండము 'ఫెలోపియన్ ట్యూబ్స్' ద్వారా గర్భాశయములోనికి పోవును ఈ సమయంలో దాని చుట్టూ వున్న లావైన పసుపు పచ్చని కణాలతో నిండివున్న గ్రాఫియన్ ఫాలికల్ *corpoq sluteum* అని పిలువబడుతుంది ఈ *Corpuslutem 'projestin'* అనే హార్మోన్ని ఉత్పత్తి చేస్తుంది ఇది గర్భాశయములోనికి రక్త ప్రవాహం ద్వారా తీసుకోపోబడి అండాన్ని ఆహ్వానించేందుకు తగు సన్నాహాల్ని చేస్తుంది

అండము రేతస్సు (*spermatonoon*) తో కలియక పోయినట్లయితే (*fertilise*), మూడు రోజుల్లో ఇది బయటకు గెంటబడుతుంది అలా అయినట్లయితే *corpusluteum* వెంటనే *ovary* నించి మాయమవుతుంది అలా కాక అండము కలిస్తే (*fertilise*) అయితే ఈ *corpus luteum* గర్భధారణ సమయం పోతునా పెద్దదౌతుంది ఇది రక్త ప్రవాహంలోకి కలిసే *projestin* అనే హార్మోన్ (*placerta*) కూడ పెరుగుతుంది, దాని ఉత్పత్తి ఏర్పడే కారణం కూడ ఒక వాహకరహిత గ్రంథి ఇది రెండు హార్మోనులని ఉత్పత్తి చేస్తుంది ఇందులో ఒకటి *oestrin* లాగే పని చేస్తుంది రెండోది *corpusluteum* పెరుగుదలని పోషిస్తుంది

జాత్యభివృద్ధి — స్త్రీ రోజుల్లో మూత్రం నుంచి వచ్చిన ఈస్ట్రిన్ మూత్రంలో హెచ్చుగా కనిపిస్తుంది ఇది స్త్రీ గర్భిణి ఔనో కాదో తెలియ చేసే పరీక్ష దీన్ని *'Ascheium', 'Zondk'* అనే యిద్దరు జర్మన్ శాస్త్రజ్ఞులు కనుగొన్నారు వీరు గర్భిణిగా యున్న స్త్రీ మూత్రాన్ని జాత్యంగాలు వృద్ధి కాని చిన్న ఎలుకలలోకి పంపి, కొన్ని దినాలయ్యాక ఎలుకని చంపి చూస్తే జాత్యంగాలు అభివృద్ధి చూపేయి అనగా కొన్ని గ్రాఫియన్ *folliclcs* పక్వమై *'corpora Lutea'* ఏర్పడింది ఈ పరీక్ష వైద్యులకు గర్భ నిర్ణయాన్ని బుజువు చేసింది

గ్రాఫియన్ *follicle* ఉత్పత్తి చేసిన 'ఈస్ట్రిన్' స్త్రీలో ద్వితీయ జాత్య గర్భాల అభివృద్ధి అవడానికి బాధ్యత వహించింది

తరువాత తయారయ్యే పురుష జాత్య గ్రంథి లోని హార్మోను అతినిలోని 'ఇన్టర్ స్టిషియల్' కణాల్ని తయారు చేస్తుంది ఇవే పురుషునిలో తయారయ్యే *spermatoza* క్రింద తయారవుతాయి దీని పేరు *Testosterone* ఇది పురుషునిలో గొంతుమార్పు, గడ్డం మొదలైన ద్వితీయ జాత్యగుణాల్ని కలిగిస్తుంది పది, పదకొండు ఏండ్లు వచ్చే దాకా పిల్లల మూత్రంలో కనపడదు ఆశ్చర్యం ఏమిటంటే ఈ పురుష హార్మోన్ రూపాలు స్త్రీ మూత్రంలో కనిపిస్తుంది ఇది వాళ్ల శరీరంలో ఎక్కడ ఏర్పడ్డదో, ఎందుకోరకు ఏర్పడిందో ప్రస్తుతం మనకింకా తెలియ లేదు.

ఈ రోజుల్లో కూడా ఇంకా దీని మీద పరిశోధనలు చురుకుగా జరుగుతున్నాయి భవిష్యత్తులో మనకింకా క్రొత్త క్రొత్త సంగతులు అందవచ్చు.

# కలగూరగంప

## భారతీయ ప్రాచీన క్రీడలు

సంస్కృతి, సభ్యత, యీ రెండు శబ్దములు మిక్కిలి సంగ్రథితములు. ఇవి పరస్పరము ఆధేయ - ఆచ్ఛేద్య సంబంధము గలవి. సంస్కృతి ఆత్మ యనుచో సభ్యత శరీరము. సద్గుణముల ఆత్మలో ఆహిత మొనర్చుకొనుట సంస్కృతి. శరీరము అవయవములవలన ఆ సద్గుణములను అభివ్యక్తి చేయుటయే సభ్యత. మానము గాని మన పూర్వులు గాని Polo, Tennis, Foot Ball, Cricket మున్నగు క్రీడ లెరుగరనే దురుగమని కొందరి అభిప్రాయము. కాని అది సరి కాదు.

మన ప్రాచీనక్రీడలు నాల్గు విధములు. 1 ఆత్మమనో వినోదార్థమైనవి 2 ప్రేక్షకజనుల ఆనందము కొఱకు 3 ధనోత్పన్నాది ప్రధానములు 4 మిశ్రితములు.

### కృత్రిమ వృషభ క్రీడ

బాలురు ఎద్దులవలె బట్ట కప్పుకొని సింహమువలె చర్మము గప్పుకొని క్రీడింతురు. ఇందు పశుపక్షుల ధ్వనులు కూడా పలుకుదురు.

### నిలయన క్రీడ

1 కొందరు బాలురు దాగియుందురు. కొందరు వారిని వెదకుదురు. కొందరు పిల్లలు దొంగలుగా కొందరు పోలీసులుగా ఆడెదరు.

2. బాలురు మూడు విధములుగా విభక్తులగుదురు. పశుపాలకుడు, పశుచోరుడు, మేషాయితుడు. మేషమయిన బాలకుని పశుచోరుడు ఎత్తుకొనిపోవును. పశుపాలకుడు వాని నన్వేషించును. ఇది శ్రీకృష్ణుడు వత్సహారణమున ఆడియుండెనని భాగవతమున చెప్పబడెను.

### మర్కటోత్ప్లవన క్రీడ

బాలకులు వానరులవలె చెట్లెక్కి ఆ కొమ్మ వృక్షములపై ఎక్కుచు దాటుచు తిరుగుచు ఆడుకొనెదరు. భాగవతమున యీ ఆట కూడ పేర్కొనబడినది.

### శిక్యాదిమోషణ క్రీడ

ఇంచు బంతివంటి దానిని వాని కందకుండ ఇతరులవద్దకు విసరబడును. బంతి గలవాడు చూడుచు నూరకుండును. అతడలసి తన వస్తువును కోరినప్పు డాతని కిచ్చివేయబడును.

### అహమహమికాస్పర్ధ క్రీడ

దూరముగా నున్న బాలుని ఎవరు ముందుగా ముట్టుకొనెదరో యని పందెముతో ఆడుట.

### భ్రామణ క్రీడ

ఒక బాలుడు వేరొకని చేయి పట్టుకొని తిరుగుచు వేగ వేగము హెచ్చించు ఆట.

### గర్తాదిలంఘన క్రీడ

ఎవ రెంత దూరము దుముకగలరో యను పరీక్ష.

### బిల్వాది ప్రక్షేపణ క్రీడ

తీగ గాని బంతి గాని దారిలోనే తగిలి పుట మించునట్లు విసురుట.

### అస్పృశ్యత్వ క్రీడ

ఒకని నొకడు ముట్టుకొన యత్నించగా రెండవ వాడు తప్పించుకొనుటకై ప్రయత్నించును.

### నేత్రబంధ క్రీడ

1 వెనుకనుండి వచ్చి కనులు మూయగా వానిని గుర్తించుట.

2 కనులు బట్టతో మూయబడినప్పుడు దాగియున్న బాలురను వెదకి పట్టుకొనుట.

3. కన్నులు బట్టతో మూయబడిన వానిని యితర బాలకులు వచ్చి స్పృశించుచుందురు. బద్ధనేత్రుడు వారలను పట్టుకొనుటకు ప్రయత్నించును.

స్పందాందోళికా క్రీడ

ఊగుచునే కొంకుచూ దుమ్ముల లెక్కి ఇంకను నూగుచుపోవుచుండుట

నృప క్రీడ

ఒకనిని రాజుగా నొకనిని మంత్రిగా జేసుకొని సభ లొనర్చుట

హరిణా క్రీడనకము

లేడివలె దుముకుచు ఒకడు వెంబడించువానికి ముందు పోవుటకు ప్రయత్నించుట

వాహ్యవాహక క్రీడ

పరాజితుని భుజమెక్కి విజేత సవారించుట

దేవ—దైత్య క్రీడ

కొందరు దేవతలై — కొందరు రాక్షసులై దుమ్ము ఎగురజిమ్ముచు వాదుదురు శివాజీ ఆడుకొనినట్లు—యవనులను పరాజితు మొనర్చినట్లుగా ఆడుకొందురు.

జలక్రీడ

1. చెట్లపై కెక్కి నీటిలోనికి దుముకుట ఒకరిపై నొకరు నీరు జిమ్ముట

2. కాళిదాసు, భారవి, మాఘుడు చెప్పినట్లు యీ ఆట స్త్రీ పురుషులలో కూడ గలదు

కందుక క్రీడ

1. బంతి పైకెగుర వేయగా గెంతినవాడు దానిని పట్టుకొనును. అట్లు పట్టుకొనలేకపోయినచో వరుసు మొదట బంతి విసరినవాని భుజమెక్కి మరల విసురును. అప్పుడు ఇతరులు బంతి క్రింద పడకుండనే పట్టుకొందురు

2. ఈ ఆట బాలబాలిక లందరు నాడుదురు. భీతునిపై గాని నేలపై గాని బంతి కొట్టి అణచి పెట్టుట ఇదే నేటి *Volley Ball* అందురు

వనభోజన క్రీడ

అడవిలోనికి పోయి ఆడుట, అచ్చటనే వంటలు చేసుకొని భుజించుట దీనినే నేడు *Picnic* అందురు.

రాసక్రీడ —ఇసుక మైదానములలో శ్రీకృష్ణ లీలాను కరణము. ఉత్తర హిందూస్థానమున రాసలీల, ఇట్టిదే. గుజరాత్ దేశమున "గరబానృత్యం" మించుమించుగ నిట్టిదే

భాగిక్య క్రీడ —ఇందు ఆటవారలు మధించి హోలీ కోలాటములో వలె పాడుదురు వాద్యములు ప్రయోగింతురు ఇట్టి ఆట పురాణములలో గూడ వర్ణింపబడియున్నది

నియుద్ధ క్రీడ —ప్రజ్ఞులు గుర్తుడు లేక కుస్తీ దెబ్బలాడుచు ఆడుదురు జరాసంధ భీముల మధ్య ఈ ఆటవలెనే జరిగెను

నృత్య క్రీడ —కొందరు నాట్యము చేయుదురు కొందరు దప్పులు కొట్టుదురు బాలబాలికలు కలిసి గాని విడివిడిగా గాని యీ ఆట ఆడుదురు

అక్ష క్రీడ —మహాభారత కథకు ఆధారభూతమైనది యీ ఆటయే ఋగ్వేదములో దీనికి విశేషము చెప్పబడినది

మృగయాత్ర క్రీడ —వేట పేరుతో ముఖ్యముగ రాజులలో నిది ప్రసిద్ధమైనది

పక్షి క్రీడ —శ్యేనములవలె బకుల బట్టుట నేర్పబడు యాట

మత్స్య క్రీడ —నావలపై నెక్కి రాజపుత్రులు చేపల బట్టుట నేర్పెడి ఆట

చతురంగ క్రీడ —నేటి చదరంగము జూదము వంటి ఆట

సాలభంజికా క్రీడ —కర్ర బొమ్మలతో లేక గుడ్డలబొమ్మలతో ఆడెడి ఆట

లతోద్వాహ క్రీడ —చెట్టును తీగను పెంచి యీ రెండింటికి పెండ్లి చేసెడి ఆట కుటుంబముల ఇట్లే చేయుచుండెడిది తులసీబృందా వివాహము ధార్మిక కృత్యమని విశ్వాసము

చీటా క్రీడ —చిత్రపుల్ల యను నొక ఆట దీని వర్ణనము మహాభారతములో ఆదిపర్వమున గలదు

కనక శృంగకోశ క్రీడ —పిచికారితో ఆడుట

వివాహ క్రీడ —వరుడు వివాహమునకై వచ్చిన తర్వాత స్త్రీలు—వర-వధూ వేషములలో ఆడుదురు.

హల్లీశ క్రీడ —ఒక బాలుడు ఒక బాలిక-బాలుడు బాలిక ఇట్లు కూర్చొని మండలాకారముగ తిరుగుచు ఆడెడి ఆట

గానవర్ధన క్రీడ —కొందరు పాడుచు కొందరు దుముకుచు నాడెదరు.

నౌకాక్రీడ — నదీతీరనివాసులు నౌకలు న్యాయముగ నడుపుచు నాడుదురు ఇది కాళీపట్టణమున నిప్పటికిని జరుగుచున్నది

జలక్రీడ — జల మగ్నస్థులై భోజనాదులు గావించుట దుర్యోధనుడు జలస్తంభ విద్య నేర్చియుండెనని మహాభారత పాఠకు లెరుగుదురు

వనవిహార క్రీడ — పూవు లేరుట, మాలలు కట్టుట, సామగ్రి లేనిదే భోజనము తయారుచేయుట దీని రెండవ పేరు పుష్పాపచయ క్రీడ

అమలక ముష్ట్యాది క్రీడ — పిడికిలి బిగించి అడుగుట నొప్పనిచో లేక తప్పు చెప్పినచో విజేత వానిని ముష్టిప్రహారముతో బరాజితునిగా జేయును

దర్దురప్లావ క్రీడ — మండూకమువలె దుముకుచుపోవుడి ఆట

నాట్యక్రీడ — నాటకమాడుట

అలాతి చక్రక్రీడ — కొఱవి వెలిగించి త్రిప్పుట దానితో ఆకాశమునకు అక్షరములు వ్రాయుట

గదా క్రీడ — వృత్తిమగ గదాయుద్ధము చేయుట. ఇట్లే ధనుఃక్రీడ మున్నగునవి

అశోక పాదప్రహార క్రీడ — ఒక చెట్టు నలంకరించి నీరు పోసి పెంచుట నా చెప్పదెబ్బలు తిని ఇది పెరిగిన దని చెప్పుచుందురు. దీనిని కాళిదాసు వర్ణించెను

చిత్ర క్రీడ — విరహావస్థలలో యువతినిత్ర చిత్రములు వ్రాయుట *Painting, Drawing*

కావ్యవినోద క్రీడ — ఇందు 'బిందుచ్యుతకము - మాత్రాచ్యుతకము - సమస్యాపూర్తి, ప్రహేళిక, ఖడ్గబంధము, పద్మబంధము మున్నగు కావ్యరీతులు వచ్చును నేటి *Puzzles* కూడా ఇందు చేరును

వాజివాహ్య క్రీడ — అశ్వము నెక్కి బంతి యాడుట గీతావళిలో తులసీదాసు దీనిని వర్ణించినాడు

కరివాహ్య క్రీడ — గజము నెక్కి బంతి యాడుట

మృగవాహ్యా క్రీడ — లేడి-దుప్పుల రథముపై కెక్కి పరుగెత్తుచున్న వ్యక్తిని తాకుట

గోప క్రీడ — ఇది రాసక్రీడలోనిదే

ఘటక్రీడ కత్తిపై ఎన్నో కుండ లుంచుకొని నడుచుట, విల్లంపై నడచుట, గడలు తీసుకొని నడచుట ఒక త్రాడుపై నడచుట ఇవన్నియు ఘటక్రీడలే

ఇవి ప్రాచీనభారతీయుల ఆటల కొందటి విధము సంక్షేపముగ జెప్పబడెను (కళ్యాణ్)

శ్రీ తటపర్తి సూర్యనారాయణ.

---

## భారతీయాధ్యాత్మిక భావాలు పాశ్చాత్యుల నవలలు

19 వ శతాబ్దఅంతం వరకు పాశ్చాత్య ప్రపంచం భవిష్యత్తును గురించి ఉత్సాహంగా కలలుకంటూ ఉండేది కాని ఇరవయ్యో శతాబ్ద ప్రారంభానికి పాశ్చాత్యులలో ఆ ఆశాభావం కాస్తా అడుగంటి గారికి ప్రపంచధోరణి అంతా అయోమయంగా తయారయింది పాశ్చాత్యుల కళాస్వరూపం తారుమారై, అనవసరమైన అతిస్వల్ప విషయాలకు ప్రాధాన్యం హెచ్చింది పాశ్చాత్య తాత్త్వికులో చీలిలు పొడచూపటం వల్లనే కళలలో ఇలాంటి ఫలితాలు కలిగాయని ప్రొఫెసర్ సోరకిన్ అన్నారు

ఇది ఇలాగ ఉండగా శాస్త్రవిజ్ఞానం అణుగర్భం భేదించి పరమాణుశక్తిని ప్రపంచం మీదికి వదిలిపెట్టింది అయితే మానవునికి ప్రాకృతిక శక్తుల మీద వచ్చినంత అధికారం ఆత్మావగాహనలోను, ఆత్మనిగ్రహంలోను రాలేదు యంత్రానికి వచ్చిన ప్రాధాన్యము, మానవుని అధఃపతనము, దీని మూలంగానే ప్రారంభమైనాయి ఈ దృక్పథంలో జీవితోపకరణాల విషయంలో తీసుకున్నంత శ్రద్ధ, అత్మవివేకము లక్ష్యాల విషయంలో కనబడనే లేదు ఇందువల్ల స్పెంగ్లర్ అనే విజ్ఞానవేత్త చెప్పినట్లు ఈ యాంత్రికయుగము, ఆకాశాన్నంటే మహా నగరాలు, మొదలైనవన్నీ తుత్తునియలై భిన్నమై పోగలవేమో నన్న భయం కలగడానికి గట్టి అవకాశాలున్నాయి

నేటికాలపు పాశ్చాత్య వాఙ్మయంలో సందిగ్ధస్థితి, జీవితం అంతా ప్రయోజనరహితమైనదనే మనస్తత్త్వదృక్పథము బాగా ఎక్కువగా కనిపిస్తున్నాయి ఈ విషయాలన్నీ జేమ్స్ జాయిస్ తన రచనల్లో గొంతెత్తి ఉద్ఘోషించాడు ఇతని రచనలలో సమాజంలో ఏర్పడిన అయోమయ పరిస్థితి, మానవాత్మాంతరాళాల్లో ప్రవేశించిన దుస్స్థితి విస్పష్టంగా ప్రతిఫలించాయి ఇలాగే థామస్‌మాన్, మార్సెల్ ప్రౌస్ట్ అనే నవలారచయితలు తమ రచనలలో నేటి నాగరికతలోని అధఃపతనాన్ని గురించీ, నీతినియమ రాహిత్యాన్ని గురించీ, విస్తృతంగా చిత్రించారు ఈ ముగ్గురు నేటికాలపు పాశ్చాత్యవాఙ్మయంలో ఒడులు జేరిన ఉత్తమోత్తము నవలా రచయితలు

అపూర్వ భావిల స్వర్గాలను గురించి కలలు గనే నేటికాలపు నవలలో కొన్నింటిలో ఇలాంటి భావాలు మరీ బాగా స్పష్టంగా కనిపిస్తున్నాయి అసలీరకపు నవలా రచన ప్లేటో వ్రాసిన యుటోపియాతో ప్రారంభమైనది ఈ రకం రచన నేటి కాలంలో ఫిలిప్ ఆర్వెల్, ఆల్డస్ హక్స్లేల వరకు అవిరతంగా సాగుతూనే ఉన్నది ఆర్వెల్ వ్రాసిన '1984' అనే వ్యంగ్య నవల చదువుతూంటే మనకు చాలా భయం వేస్తుంది వీరిద్దరికీ ముందు కాలంలో శక్తివంతులయిన రచయితల కొందరు ఈ జాతి రచనలెన్నో సాగించారు సర్ థామస్ మోర్, ఫ్రాన్సిస్ బేకన్, శామ్యూల్ బట్లర్, విలియంమారిస్, ఎడ్వర్డ్ బెల్లామీ, హెచ్ జి వెల్స్ ప్రభృతులీ వర్గానికి చెందిన వారే అయితే ఈ జాతి 'భూతల స్వర్గ' రచనల పరిణతి నిరూపించడం ఈ వ్యాస లక్ష్యం కాదు ఈ జాతి రచనలలో పాతవాటికీ, క్రొత్తవాటికీ మధ్య బాగా భేదా కనిపిస్తున్నది పాతవాటిలో మానవజాతి భవిష్యత్తు ఉత్సాహకరంగా ఉన్నట్టు కనిపిస్తుంది క్రొత్తవాటిలో నైరాశ్యం తాండవమాడుతున్నది ఇవేళల వ్రాసిన ఈ జాతి నవల ఒకటి చదివితే, అది భయపడి పోయిన మనిషి పెట్టిన ఒక పెద్ద గావు కేకలా ఉంది 1887 లో వ్రాసిన బెల్లామీ నవలలో మానవజాతి విషయంలో ఇంకా కొంచెం ఆశాలేశం కనిపిస్తుంది అయితే రెండు ప్రపంచ యుద్ధాలకు మధ్య, హక్స్లే 'బ్రేవ్ న్యూ వరల్డ్' అనే నవలలో శాస్త్రవిజ్ఞానం భూతల స్వర్గం సృజించగలదనే అభిప్రాయాన్ని పట్టుకుని బాగా అవహేళన చేశాడు.

శాస్త్రవిజ్ఞానం సృజించే భూతల స్వర్గంలో కవిత్వము, సౌందర్యము క్రమక్రమంగా మాయమై పోతాయనీ, ప్రతీ విషయము ఒక యంత్రంలా భయంకరంగా సాగిపోతూ ఉంటుందనీ ఇతడీ నవలలో గట్టిగా ఆక్షేపణ చేశాడు. ఆ తరవాత హక్స్లే వ్రాసిన 'ఏప్ అండ్ దిఎసెన్స్' అనే నవల గాని, ఆర్వెల్ వ్రాసిన 1984 గాని చదివితే నైరాశ్యం ఇంకా బాగా ఎచ్చు పెరిగిపోయినట్లు కనబడుతుంది. ఆర్వెల్ 1984 అనే నవలలో మనుష్యుల ఆలోచనలు కూడా పసికట్టి శిక్షించే పోలీసులుంటారనీ, పిల్లల మీద కూడా ప్రభుత్వం గూఢచారిదళం ఏర్పాటు చెయ్యగలదనీ అప్పటి ఆంగ్లదేశం ఒక పెద్ద నియంతృత్వం క్రిందపడి నలిగి గజగజవణికిపోతూ ఉంటుందనీ వ్రాశాడు.

ఇదంతా చూస్తే ప్రపంచంలో భవిష్యత్తు భయంకరంగా మారిపోగలదనే సూచన బాగా కనిపిస్తున్నది. అయితే నీతి నియమశూన్యమయిన పరిస్థితుల్లో ప్రపంచం చాలా కాలం నిలబడలేదనీ, మానవుడు తన భౌతిక ప్రపంచాన్వేషణలోనించి బయట పడి క్రమక్రమంగా ఆధ్యాత్మికాన్వేషణలో పడక తప్పదనీ ప్రస్తుత పరిస్థితులు ఋజువు చేస్తున్నాయి. ఆధ్యాత్మిక విజ్ఞానం ద్వారానే మానవుడు తన భౌతిక సమస్యలు సాధించవలసిన అవసరం కూడా నేడో రేపో రాక తప్పదని నేటి ప్రపంచ పరిస్థితి ఋజువు చేస్తున్నది.

ఇలాంటి పరిస్థితులలో ఈ విసమయిన భావాలపై తిరుగుబాటు బయలుదేరడం సహజమే. ప్రాచీన కాలంలో ప్రపంచం ఆధ్యాత్మిక విషయాలపై బాగా అభినివేశం కనబరిచింది. అటుపిమ్మట శాస్త్రీయపరిశోధన భౌతికవిషయాలవైపు బాగా ఆసక్తి చూపించడం ప్రారంభించింది. ఈ పైన మానవ మేధస్సు రెండు విషయాలు సమన్వయం చెయ్యడానికి ప్రయత్నించవచ్చును. హెగెల్ తన తాత్త్విక దృక్పథంలో ప్రపంచ పురోగతి ఈ విధంగా ఉండగలదని సూచించాడు. అందుచేత మానవ మేధస్సింకొక మారిన మార్గం వైపు తన దృష్టి మరలించగలదని మనం ఊహించవచ్చును.

ఈ విషయంలో ముందుగా పేర్కొనదగినవాడు బెర్నార్డ్ షా. ఇతడు ఒకానొక దివ్యశక్తి ప్రేరితమైన ప్రకృతి క్రమంగా దివ్యత్వంవైపు పురోగమిస్తున్నదని తన రూపకాల్లో వ్యంగ్యంగా సూచించాడు. ఇతని 'బాక్ టు మెథూసిలా, మేజర్ బార్బరా, మాన్ అండ్ సూపర్‌మాన్' అనే రూపకాలు దీనికి ఉదాహరణంగా ఇవ్వవచ్చును. వెల్స్ కూడా ఈ వర్గానికి చెందినవాడే. ఆధ్యాత్మికతకు ప్రాధాన్యం ఇవ్వకపోయినా క్రమక్రమంగా ప్రపంచం అభివృద్ధివైపు పురోగమిస్తున్నదని ఇతని 'ఔట్‌లైన్ ఆఫ్ హిస్టరీ' మొదలయిన గ్రంథాలనుబట్టి గ్రహింపవచ్చును. ఇతడు విజ్ఞానమే మానవవిముక్తికి సాధనమని విశ్వసించే రచయిత.

ఇటు తరవాత పరిగణింపదగినవాడు జోసఫ్ కోనార్డ్. ఇతడు విశాల మానవత్వానికి వ్యతిరిక్తమయిన మానవప్రవృత్తి చివరికి మానవత్వానికే బాధాకరంగా పరిణమింపగలదని తన నవలా వ్యక్తుల ద్వారా సూచించాడు.

ఇ. ఎమ్. ఫార్స్టర్ తన నవలలలో మానవవ్యక్తిత్వానికి ప్రాధాన్యం ఇచ్చి గౌరవించాడు. ఈ విధంగా పాశ్చాత్య వాఙ్మయంలో క్రమక్రమంగా

ఆధ్యాత్మిక దృక్పథానికి ప్రాధాన్యం ఎక్కువైంది. అందుచేత కొంత మంది రచయితలు ప్రాచ్యాధ్యాత్మిక విజ్ఞానంవైపు తమ దృష్టి మరల్చడం ప్రారంభించారు.

ఈ విధంగా ప్రాచ్యాధ్యాత్మిక విజ్ఞానంవైపు తిరిగి చూచిన ఇద్దరు పాశ్చాత్య రచయితల నిక్కడ పేర్కొంటున్నాను.

ఆల్డస్ హక్స్లే ఈ విషయంలో ప్రప్రథమంగా పేర్కొనదగిన రచయిత. ఇతనిలో ఈ కాలపు వ్యంగ్యయుగ స్వభావం ఎక్కువగా ప్రతిఫలిస్తున్నది. ఇతనిలో కవిహృదయము, విజ్ఞానవేత్త మేధ చక్కని సమ్మేళనం పొందాయి. ఈ యుగంలో ఈ హృదయము, మేధ రెండు పరస్పరాధిపత్యంకోసం పాకులాడుతున్నాయి. అందుచేత ఇతడీ విషయాలలో సమన్వయం ప్రదర్శించడానికి అన్నివిధాలా అర్హుడైన రచయిత.

ఇతను 1921 లో మొట్టమొదటగా 'క్రోమ్ యెల్లో' అనే నవల ప్రచురించాడు. అటు పిమ్మట 1945 లో 'టైమ్ మస్ట్ హావ్ ఎ స్టాప్' అనే నవల ప్రచురించాడు. ఈ మధ్య కాలంలో వ్రాసిన నవలలన్నిటిలోను ఇతను అనేకమైన శాస్త్రీయ దృక్పథాలను గురించీ ఆధ్యాత్మిక దృక్పథాలను గురించీ ధ్వనించాడు.

ఇతని మొట్టమొదటి నవలలో కథానాయకుడు హక్స్లే వంటివాడేమో ననిపిస్తుంది. ఇతడు తోటివారందరు ప్రేమ సల్లాపాలలో సరదాగా కాలక్షేపం చేస్తుంటే తాను దైవాన్ని గురించి తక్కువగా కూర్చోవడం తగిన పనేనా అనే భావంలో పడతాడు. హక్స్లే ఈ పుస్తకం వ్రాసిన 24 ఏళ్ల తరవాత టైమ్ మస్ట్ హావ్ ఎ స్టాప్ అనే నవలలో తన అభిప్రాయాలన్నీ స్పష్టంగా వివరించాడు. ఇందులో పరమేశ్వరునివైపు దృష్టి మరలిస్తే తప్ప వ్యక్తి సమాజ సమస్యలు సాధింపబడజాలవని చక్కగా నిరూపించాడు.

ఈ తరవాత ఇతని రచనలలో పేర్కొనదగినవి 'ఎండ్స్ అండ్ మీన్స్' 'ఐలెస్ ఇన్ గాజా' అనే రెండు నవలలు. వీటిలో ఇతడు ప్రాచ్యమహర్షుల ఆధ్యాత్మిక భావాలు విపులంగా వివరించాడు. ఈ నవలలో కాలప్రవాహం మిథ్య అనీ, మన దైనందిన ప్రత్యేకకార్యాలను ఆత్మధ్యానం ద్వారా పరమాత్మలో విలీనం చెయ్యడంవల్లనే కాల సమస్య సాధింపబడగలదని నిరూపించాడు. హైందవవేదాంతంలో అనాసక్తియోగం ముఖ్యమైనది. హక్స్లే రచనలలో ఈ అనాసక్తియోగాభిప్రాయాలు బాగాలు, ప్రకాశించాయి.

ఈ అనాసక్తిని గురించిన చర్చ ఇతను వ్రాసిన 'పెరెన్నియల్ ఫిలాసఫీ' 'ఆఫ్టర్ మెనీ ఎ సమ్మర్' 'గ్రే ఎమినెన్స్' అనే గ్రంథాలలో బాగా ఎక్కువగా కనిపిస్తుంది.

ఈ సందర్భంలో సోమర్‌సెట్ మామ్ కూడా ప్రధానంగా పేర్కొనదగినవాడే. ఇతను అసంఖ్యాకంగా నవలలు నాటకాలు కథలు రచించాడు. అయితే ఇతని రచనలలో ప్రస్తుతం మనం పేర్కొనదగిన ముఖ్య రచన 'రేజర్స్ ఎడ్జ్'. ఇది 1944 లో ప్రకటింపబడినది. ఇంతకు పూర్వం 1938 లో మామ్ భారతదేశం వచ్చి ఈ దేశం అంతా తిరగాడి ఇక్కడి యోగులను, మహాత్ములను అనేక మందిని దర్శించి భారతీయాధ్యాత్మిక దృక్పథం బాగా అవగాహన చేసుకున్నాడు. ఇందులో కథానాయకుడు లారెన్స్ డారెల్ ఇతని జీవిత వృత్తాంతమే ఈ నవలలో కథా వస్తువు. ఈ కథానాయకుడు ఇంతకు పూర్వం జీవిత విషయంలో తనకు కలిగిన భావాలన్నీ విడిచి ఒక నూతన జీవిత దృక్పథం అవలంబిస్తాడు. చివరికితడు వేదాంతి దృక్పథం అవలంబించి, అనాసక్త భావంలో దైనందిన వ్యవహారాల్లో పాల్గొంటూ ఉంటాడు.

ఈ విధంగా ఆంగ్ల సాహిత్యవేత్తలనేకులు ఆధ్యాత్మిక దృక్పథం అవలంబించనిదే జీవిత పరమార్థం గ్రహించడం దుష్కరం అని గ్రహించి తమ రచనలలో ఈ దృక్పథం కనబరుస్తున్నారు.

మళ్లీ తిరిగి ప్రాచ్యాకాశంలో నూతనాధ్యాత్మిక తారక ఉదయిస్తున్నది. అనేక మంది సాహిత్యవేత్తల హృదయ దర్పణాలలో ఈ తారకా కాంతులు తళతళ మెరుస్తున్నాయి.

డాక్టరు టి రామారావు

('1963 జనవరి త్రివేణి నుండి')



# విమర్శనము



## రాజగోపాల విలాసము

చెంగల్వరాయ కవి ప్రణీతము, తంజావూరు సరస్వతీ మహల్ గ్రంథాలయం, తంజావూరు వెల మూడు రూపాయలు.

ఇది క్రీస్తుశకము 1633 లో పట్టాభిషిక్తుడైన విజయరాఘవ నాయకుని కంకితమైన అయిదాశ్వాసాల పద్యకావ్యము.

పీఠికలో సూచించినట్లిది విజయవిలాసం తరువాత కొద్ది సంవత్సరాలలో రచింపబడిన కావ్యము.

తంజావూరు ఆంధ్రకావ్యాలలో విజయవిలాసం ఉత్తమోత్తమమని విమర్శకులందరూ అంగీకరిస్తారు. అయితే ప్రస్తుతం తంజావూరు సరస్వతీ మహలువారు ప్రకటించిన రాజగోపాలవిలాసం విజయవిలాసంతో సమానంగా నిలిచిన ఉత్తమ కావ్యము. కొన్ని విషయాలలో కాళకవి చేమకూర వెంకటకవికంటె మిన్న అని అనవచ్చును.

చేమకూర వెంకటకవి, తన కావ్యంలో రసోత్పత్తికన్నా శబ్దశ్లేషలమీద ఎక్కువగా ఆధారపడతాడు. ఇతనిలో రసదృష్టి తక్కువ. కనకనే శబ్దరత్నాకరకారుడు ఈ కవిని కవులలో చతుర్థ కక్ష్యలో చేర్చినట్లు కనబడుతుంది. శబ్దరత్నాకరకారుని విమర్శకదృష్టిలో కొంత అతిశయోక్తి ఉన్నా దనిపిస్తుంది. ఎంత తీసివేసినా తాత్కాలిక కవిత్వ దృక్పథాన్ని బట్టి పరిశీలిస్తే విజయవిలాసం ఆ కాలపు కావ్యాలలో ఉత్తమమైనదే అని అందరు అంగీకరిస్తారు.

కాళకవి కవితా దృక్పథం, వేరు. ఇతని కవిత రసప్రధానమయినది. ఎక్కడో సకృత్తుగా గాని శ్లేషలు కనబడవు. చేమకూరకవి కవిత్వం ఎక్కువగా శబ్దంలోని శ్లేషశక్తిద్వారా మనస్సుకు ఆహ్లాదం కలిగిస్తుంది. కాళకవి కవితలో శబ్దార్థాలు రెండు అప్రధానంగా ఉండి హాయిగా సహృదయులకు రసస్ఫూర్తి కలిగిస్తాయి. దీనికి కేవలం రసదృష్టితో చూచినప్పుడు కాళకవి చేమకూర కవికంటె గట్టివాడే. శ్రీకృష్ణుని అష్టమహిషులలో ఉద్భవించిన అష్టవిధ నాయికాభావాలు ఈ కవి చాలా హృద్యంగా వర్ణించాడు. ఒక్క కథాఘటనలో నే ఇతడు చేమకూర కవికంటె కొంచెం లోచ్చని అనిపిస్తాడు.

జాంబవతి విప్రలబ్ధాభావం రూపించే పద్యాలు కొన్నిమాత్రమే ఇక్కడ ఉదాహరిస్తున్నాను. ఇవి కాళకవి సామాన్య కవితాస్థాయి మాత్రమే సూచిస్తాయి. ఇవి జాంబవతి తన చెలికత్తెతో పలికిన మాటలు.

"చింతా సంతతి జిక్కి
    చిక్కటిపయిం దేశర్చి చింతింప నీ
ప్రాంతారామనికుంజపుంజముల
    ఛాయన్ నిల్చి నామాక్షి! నీ
కొంకున్ దచ్చదనంచు వేపుదనకన్
    గాసింబడం జేసితే!
కాంతా! యూహలు వేయుమాటలకు
    లోగాకుండు నా దెవ్వరే!

తగవులు తెగువలు బిగువులు
నగవులు వైపూతవలపునయగారములన్
మగువా! ఈ తగవెల్లను
మగవానికి జెల్లుగాక మగువకు దగునే!"

"తల్లడమేల నీ వరుస
    దప్పవటంచు నచేక నాయికా
వల్లభు డాడుమాట
    తెరవంచన యంచు దలంచవైతివో
హల్లకపాణి! యీవికచ
    హల్లక జాతిపరాగ జాతముల్
చల్లని తేనెపై పెకలు చల్లగ
    నేగతి తాళనేర్తునే?"

"ఎన్నడు సమ్మతించునిక
    నెన్నడు నన్ దయమీరజూచు నిం
కెన్నడు ప్రస్నమెల్ల ఘటియించునో!
    యంచుదలంచు నాకు నే
నన్నిటి చాకచేకినను
    నాతిరో! యెగతి నోర్వవచ్చునే!"

## మీగడ తరకలు

శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రి. ప్రకాశకుడు: వి. శంకరశాస్త్రి, ముక్త్యాల, కృష్ణాజిల్లా. వెల: 2-8-0.

ఇది కీర్తిశేషులు వేటూరు ప్రభాకరశాస్త్రి గారు రచించిన వివిధ వ్యాసాలసంపుటి. వీటిలో శాతవాహనులు, శివకవులు, పండితారాధ్య చరిత్రము, ప్రాచీనాంధ్ర నటన శాస్త్ర గ్రంథాలు, మొదలైన సారస్వత విషయాలపై శాస్త్రిగారు చేసిన విశిష్ట పరిశోధన లెన్నో ఉన్నాయి. వీటిలో శాతవాహనులు ఆంధ్రులనే అన్న విషయం నిరూపించడానికి శ్రీ శాస్త్రిగారు కొన్ని ప్రబల ప్రమాణాలు పేర్కొన్నారు. అయితే ఇవి శాతవాహనులు ఆంధ్ర ప్రాంతంలో కూడా తమ పరిపాలన సాగించారనే విషయం నిరూపించగలవు గాని ఆ చక్రవర్తు లాంధ్రులే అని నిర్ణయించడానికి అంతగా సహాయకారులు కాజాలవు.

ఈ వ్యాస సంపుటి చివరభాగంలో భాషలకు సంబంధించిన రెండు వ్యాసా లున్నాయి. వీటిలో 'భాషాపరిణామము' వ్యావహారిక భాషా వాదానికి సంబంధించింది. దీనిలో శాస్త్రిగారు వ్యావహారిక భాషలో మార్పు, మాటకు మొదలైన ప్రయోగాలు ఎవరికి తోచినట్లు వారు వ్రాసుకుపోయి నప్పుడు భాషకు ఒక దారి తెన్ను లేకుండా పోవచ్చునని తమ ఆందోళన సూచించారు.

అయితే వ్యావహారిక భాషావాదం శాస్త్రిగారు తలచినంత ఒక దారి తెన్నూ లేనిది కాదు. వ్యావహారిక భాషకు వ్యాకరణాది సంస్కారా లుండాలని వ్యావహారికవాదులూ అంగీకరిస్తారు. అయితే ఆ వ్యాకరణం శిష్టజన వ్యవహారా న్ననుసరించి మార్పు చెందాలనీ, వ్యావహారిక భాష శిష్టప్రయోగాలమీద ఆధారపడి ఉండాలనీ, ఆంగ్లాది భాషల వ్యాకరణాలన్నీ ఈ సంప్రదాయంమీదనే రచించారనీ, ఆ మార్గమే మనము అనుసరించాలనీ వ్యావహారిక వాదు లంటారు.

బహుశః శాస్త్రిగారు ఈ వ్యాసం వ్యావహారికవాదం ప్రారంభమైన రోజులలో వ్రాసి ఉండవచ్చును.

శాస్త్రిగారి వ్యాసాలు ఆంధ్రభాషా పరిశోధకులకు అమూల్యమయినవి. ప్రభాకర పరిశోధక మండలి వారు శాస్త్రిగారి వ్యాసాలన్నీ పుస్తకరూపంలో ప్రచురించడం అత్యంతావశ్యకమయిన విషయం. ఇల్లాగే వీరు శాస్త్రిగారు వ్రాసిన వ్యాసాలన్నీ క్రమక్రమంగా పుస్తకరూపంలో ప్రచురింపగలరని ఆశిస్తున్నాము.

ఈ గ్రంథంలో సమకూర్చిన వ్యాసాలకు చివర వ్యాసం ప్రకటించిన పత్రిక, కాలము కూడా ఉదాహరిస్తే పాఠకుల కది ఇంకా ఉపయోగకరంగా ఉండేది.

---

## ప్రజ్ఞా ప్రభాకరము

వేటూరి ప్రభాకరశాస్త్రి, ప్రకాశకులు: యోగ మిత్రమండలి మద్రాసు, కాపీలకు వి. శంకర శాస్త్రి, ముక్త్యాల, కృష్ణాజిల్లా. వెల లేదు.

ఇది శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారి ఆత్మకథ. ప్రభాకరశాస్త్రిగారి జీవితం రెండు విధాలుగా విభజింపవచ్చును. ఒకటి వారి నిరంతర సాహిత్య

పరిశోధన. రెండవది సహజంగా జీవితంలో అను స్యూతంగా వస్తున్న ఆధ్యాత్మికాన్వేషణ.

శాస్త్రిగారి వాఙ్మయపరిశోధన ఆంధ్ర సార స్వతాభిమానులందరికీ బాగా తెలిసినవిషయమే.

వారి ఆధ్యాత్మిక పరిణతిని గురించి వారికి అత్యంత సన్నిహితులైనవారి కొందరికో తప్ప ఇతరుల కంతగా తెలియదు

ప్రస్తుతం ప్రభాకర పరిశోధకమండలివారు ప్రకటించిన ఈ చిన్నపుస్తకంలో శ్రీ శాస్త్రిగారు ఆత్మగ్రాహ్యమైన తమ ఆధ్యాత్మికానుభావా లెన్నో విపులంగా వివరించారు.

శాస్త్రిగారు చిరకాలం గర్భవ్యాధులతో బాధపడుతూండేవారు. వారికి మి రి రి అనే మహాయోగులతో పరిచయం కలిగిన ఉత్తరకాలంనుంచీ ఆరోగ్యం పటాపంచలై అనితర సాధారమైన దివ్యానుభవా లెన్నో కలగడం మొదలుపెట్టాయి అప్పటినించీ వారి జీవితదృక్పథమే మారిపోవడం మొదలుపెట్టింది. తమ శక్తులతో వారు అనుదినము రోగపీడితులై బాధపడేవారి కందరకు సహాయపడి చికిత్స చేస్తూండేవారు. చివరి దినాలలోకూడా వారు రోగపీడిత సహాయార్థం చింతతో ప్రాణ త్యాగం చేసినట్టు కనబడుతుంది.

దురదృష్టవశాత్తు శాస్త్రిగారు తలపెట్టిన స్వీయ చరిత్ర పూర్తికాకుండా వారు పరమపదించడం జరి గింది. అసంపూర్ణమైనా ఈ స్వీయచరిత్ర మన తెలుగు వాఙ్మయంలో బయలుదేరిన స్వీయచరిత్ర లలో ఉత్తమోత్తమ కృతులలో చేర్పదగిన రచన దీనిలో శాస్త్రిగారి గ్రాంథికరచన ఉదాత్తగంభీర శైలిలో సాగిపోతూ, అడుగడుగునా అర్థగౌరవంతో తాలువారుతూ ఉంటుంది.

శాస్త్రిగారు తమ సాహిత్య పంథాలో ఎదు రొన్న ఒడిదుడుకులను గూర్చి ఈ ప్రజ్ఞాప్రభా కరలో అంతగా వివరంగా వ్రాయలేదు 'సాహిత్య జీవనము—అరుదుడుకు' అనే ప్రకరణంలో మాత్రమే వారు సాహిత్య పరిశోధనలలో తమకు, పిరికిలింగ కవికీ మధ్య బయలుదేరిన వాదోపవాదాలనుగూర్చి, వాదాల పట్టుదల ఒక్కొక్కప్పుడు యథార్థ విష యాలను అణచివేసిన సందర్భాలను గురించీ, తమ ఉద్యోగ పరిస్థితులనుగురించీ ముక్తసరిగా వ్రాసుకు పోయారు

శా॥ శాస్త్రిగారి జీవితచరిత్ర వారు రచించిన ఈ క్రిందిపద్యంలో చాలావరకు ప్రతిఫలిస్తున్నది.

"కవితాశిల్పము పల్పగా దొలుత
చెక్కల్ లేగ నాకుం, గ్రహాల్
చివురొత్తెన్; పనసూయు మొత్తె
విక నాచే జెల్లకి కల్ల దొ
ల్లి వినోదంబు లికే జరామరణముల్
చీపల్ వాతంబార్చి, పు
ట్టువు కృష్ణా సఫలీకరించుకొని,
యంటుల్ గట్టితిన్ మాలిమై."

ఇంతటి ఉత్తమ స్వీయచరిత్ర ప్రకటించిన ప్రభాకర పరిశోధకమండలివారు ఆంధ్ర వాఙ్మ యాని కొనర్చిన సేవ అమూల్యమైనది.

## ప్రభాకర ప్రవచనములు

యోగమిత్రమండలి, తిరుపతి. వెల లేదు.

ఇది ప్రభాకరశాస్త్రిగారు అప్పుడు చేసిన ఇష్టగోష్ఠి ప్రసంగాలసంపుటి వారిపై శ్రద్ధాళువు లయిన శిష్యులు, అభిమానులు కొంతమంది ఆయా సందర్భాలలో వారు చేసిన ప్రసంగాలు సేకరించి ఇప్పుడీ పుస్తకరూపంలో వెలువరించారు

ఈ ప్రసంగాలలో కూడా చాలా చోట్ల వారు అనుదినము చేసిన చికిత్సలు మొదలైన వాటినిగూర్చిన విశేషాలున్నాయి. నేటి వైద్యవిధానాలు అనుసరించే వారికి చికిత్సావిధానం చాలా ఆశ్చర్యకరంగా కని పిస్తుంది

శాస్త్రిగారికి కౌలిదాస కవిత కంటె భవ భూతి కవితపై ఎక్కువగా అభిమానం ఉండేది దీనికి గల కారణాలు, వారి సాహిత్య దృక్పథము, ఆధ్యా త్మిక వ్యక్తిత్వము మొదలైనవి తెలిసికోగోరే వారంద రికీ ఈ పుస్తకం బాగా ఉపయోగిస్తుంది.

యోగమిత్రమండలివారు ఈ ప్రసంగాలు మొదలైనవన్నీ కలిపి శాస్త్రిగారి సమగ్ర జీవితచరిత్ర ప్రచురిస్తే, అది ఇంతకంటె ఎక్కువగా శాస్త్రిగారి సర్వతోముఖ చరిత్రకారులకు సహాయకారి కాగలదని భావిస్తున్నాము.

## బుద్ధావతారము

[నాటకము]

విద్వాన్ బండ్ల సుబ్రహ్మణ్య కవి, పేట పాలెము, ఎమ్. ఎస్. ఎమ్. వెల: 1—12—0.


BETTER THAN THE BEST
Co-optex
FABRICS
కో-ఆప్టెక్స్
వస్త్రాలు
ఆబాల గోపాలానికి
ఆకర్షణీయమైనవి
మద్రాస్ స్టేట్ హాండ్‌లూం వీవర్స్
కో-ఆపరేటివ్ సొసైటి లిమిటెడ్

# నేడు మీరు మెక్లీన్‌తో పళ్లు తోముకున్నారా?




మీటూత్ బ్రష్ మీద మెక్లీన్స్ పెరాక్సైడ్ టూత్‌పేస్టును కొంచెం వేసుకుని పళ్లతోముకొండి — ఆటుపైన మీనోరు అత్యద్భుతంగా ఎంత పరిమళవంతంగా ఉంటుందో చూడండి. దంతక్షయానికి మూలకారణమైన నోటిలోని ప్రమాదకరమైన ఆమ్లాలను మెక్లీన్స్ పెరాక్సైడ్ టూత్‌పేస్టు వెంటనే విరిచివేసి అసహ్యకరమైన పచ్చదనము తొలగించి పళ్లను ఉజ్వలధవళంతోపాటు మీశ్వాసము పరిమళభరిత మొనర్చుతుంది

నోటి ఆరోగ్యం తెల్లని ఆకర్షణీయమైన దంతాల నిమిత్తం నిత్యం- రోజుకు రెండుపర్లు. మెక్లీన్స్ పెరాక్సైడ్ టూత్‌పేస్టును ఉపయోగించండి. దీని పరిశుభ్రతకు సాటిలేదు

నేడే మెక్లీన్సును కొనండి!




MTY-4 TEL.

ఇప్పుడు పెద్ద సైజులోనూ, మరిన్ని అధిక లాభ కరమైన భారీసైజులోనూ దొరుకుచున్నది

వ్యాపార వివరాలకు జె ఎల్ మోరిసన్, సన్ అండ్ జోన్స్ (ఇండియా) లిమిటెడ్ పో బా 8527 బొంబాయి 26 పో బా 387 కలకత్తా పో బా 1370, మదరాసు



# అతిథి సత్కారానికి అమోఘమైనది

హేమ — ఏమిటి పిన్నీ, నిన్న మీ యింటికి వచ్చిన పెద్ద మనిషిని కేవలం కుశల ప్రశ్నలు వేసి పంపించావు? కాస్త కూర్చో పెట్టి కొంచెం ఫలహారం గాని పానీయం గాని ఇవ్వ లేక పోయావా?

శ్రీరు — వస్తువుల ధరలు ఇలా మండి పోతూంటే ఏం ఫలహారాలు పెట్టగలమమ్మా? పైగా ఆతడు ఏ గడియా కూర్చుందుకైనా టైము లేదంటూంటే ఏం పానీయం ఇవ్వగలను?

హేమ — అదేమిటండీ, ఓగ్లాసుడు 'టీ' తయారు చేసి ఇవ్వ వచ్చునే. మీకు తెలుసు గదా — 'టీ' అతి చవకగా అతి త్వరగా శ్రమ లేకుండా తయారు చేయవచ్చునే!

శ్రీమ — అవును నిజమే సమయానికి తోచలేదు ఎంత మంచి బుద్ధి కాది! అతిథి సత్కారానికి నిజంగా 'టీ' అమోఘమైనది

## మంత్ర శక్తి నిచ్చే పానీయం
## "టీ" త్రాగండి



సెంట్రల్ టీ బోర్డువారివల్ల ప్రచురింపబడినది

CTB 70